ఆంధ్రసరస్వతీ గ్రంథమాల—21

# విహంగయానము.

Vihangayanamu

(ఆంధ్రభాషలోని ప్రకృతిశాస్త్ర సంబంధమైన మొట్టమొదటి నవల.)

Prakruti Sastram



చెన్నపురి వేపేరీ పోస్టుకుచేరిన పరశువాకము వెళ్లాళవీధి 124 నెం.
గల గృహమున స్థాపింపఁబడిన
ఆంధ్రసరస్వతీ గ్రంథమాలవారికొఱకు
తేకుమళ్ల రాజగోపాలరావు గారిచే
Rajagopala Rao
ప్రకటింపఁబడినది.





1934.

వెల 1-8-0] [పోస్టేజీ ప్రత్యేకము.

# పీఠిక

---

ఈ గ్రంథమాలలోని 8-వ కుసుమము లలిత 1915-లో ప్రకటింపబడినది. అందు లలితాదేవి సోదరులు మువ్వురును రుస్తుంఖానుచే చంపఁబడిరి. రెండేండ్ల వాఁడగు సోదరపుత్రుఁడు బాల జగపతియొక్కఁడే ఆ వంశమునకు మిగిలిన మగపురుగు. విహంగయానమను నీ ప్రకృతనవలకు లలితయను వెనుకటి నవలతోఁగల సంబంధమింతవఱకే. ఆ కథాభాగములలో లలితాదేవి పేరుమాత్రమె ఇందు వచ్చును గాని, విహంగయానమున కానవలలోనికథతో నించుకంతయు పాఠకు లెఱుఁగవలసిన యితర సంబంధము లేదు.

విహంగయానము తెలుఁగులోని ప్రకృతి శాస్త్రసంబంధమైన నవలలలో మొట్టమొదటిది. స్వతంత్రముగా రచింపఁబడినది. కాని యిందలి ప్రకృతిశాస్త్ర విషయములు జనసామాన్యమున కందుబాటులో నుండు రీతిని కూర్పఁబడినవి. వాయువిమాన నిర్మాణపద్ధతులు 18, 20 ప్రకరణములలో తెలుపఁబడినవి.

ప్రేమవతియను నంగన జలాంతర్గాములతో సముద్రగర్భములు శోధించి గనులు త్రవ్వించి నిర్మానుష్య ద్వీపముల కెత్తించి ఆ ధనముతో లోకమునందు ప్రకృతి శాస్త్రవిద్యను వెలయించుట యిందలి ప్రధాన కథ. ప్రతి ప్రకరణమునందును అవారిగా ప్రకృతి శాస్త్రరహస్యములు వెల్లడింపఁబడినవి. ఇందలి విషయములన్నియు శాస్త్రసిద్ధముగాని శాస్త్ర వ్యతిరిక్తములు కావు.

శాస్త్ర నవలారచనకు వలెన భాషకును నాకునుగూడ నిదియే ప్రథమము. ఆంధ్రులు ఇందు దోషములుకలవేని మన్నించుచు నీ ప్రయత్నము నాదరింతురుగాత. రాఁబోవు గ్రంథము ఆహారశాస్త్రము. ఫిబ్రవరు మాసాంతమున కిది వెలువడును.

చెన్నపురి, వేపేరి.
22—1—1934

తేకుమళ్ల రాజగోపాలరావు.

# విహంగయానము.

## మొదటి ప్రకరణము.

---

### ప్రకృతి నిలయస్థాపనము

అట్లు బాలజగపతికారణమున ప్రాణము[illegible] ట్టుకొన నొల్లక లలితామహాదేవి పెద్దాపురము కోటలోఁ బ్రవేశించి [illegible] తనవారికై వగచుచు కాలము పుచ్చు చుండెను. అంతవఱకు సైన్యాధికారిగానుండిన రామభద్రుఁడు ప్రధాన మంత్రీంద్రుఁడయి పరిపాలనా కృత్యములను అత్యంత శ్రద్ధతోను చాకచక్యముతోను నడపుచుండెను. విచార కారణమున కృశించి కృశించి శల్యమగుచున్న లలితా మహాదేవిని ఏదేని నెపమున కార్యనిమగ్నను గావించినఁగాని కోలుకొనుట పొసఁగదని యెఱిఁగి యాతఁడు ఒక యైంద్ర జాలికుని రావించి యాతనితోఁ గొంత రహస్య ప్రసంగము చేసి ఒకనాఁటి సంజప్రొద్దున దీపములు పెట్టువేళ నాతనిని మహారాణి సమ్ముఖమునకుఁ గొనిపోయెను. నుదుట పెద్ద కుంకుమ బొట్టును, పక్షి యీఁకలతో నలంకరింపఁబడిన యెఱ్ఱని తలగుడ్డను, చంకను ఒక బొంతను, కుడిచేత నొక పెద్ద నెమలికుంచెను, కాళ్లకు కొయ్య పావుకోళ్లను ధరించి యా యైంద్రజాలికుఁడు లలితకు నమస్కరించి యెదుట నిలువఁబడెను. చిఱునవ్వుతో నాతని కేలుమోడ్పు నాదరించి లలితామహాదేవి తనకు వినోదములందు వెగటు గలిగిన దనియు, దనయింటికిఁ మూఁడిన దొసఁగును దలంచుకొని

పలవించుచుండు తనకు ఇట్టి యింద్రజాల మహేంద్ర జాలములను జూచుటకు కోరిక పుట్టుకున్నదనియు, నెట్లయిన తన మనస్సును మఱలించి, తన వంతను మఱపింపఁ జేయుటకై మంత్రీంద్రు డొనరించు ప్రేమంపు పూనికను దా నెఱుఁగుదుననియు, నమ్మిన బంటగు నాతని కడుపులోని యారటమును శాటించి యిప్పుడు దర్శన మొసఁగితిననియు, కాఁబట్టి యొకటి రెండు గడియలలో పనిని ముగించుకొనుమనియు సెలవొసఁగెను. మంత్రీంద్రునకు గద్దెయు, ఐంద్రజాలికునకు తివాసియు నొసఁగి, లలితా మహాదేవి తాను వట్టినేలనే కూరుచుండెను. అదిచూచి వారును నచ్చటి గచ్చునేలనే కూరుచుండిరి.

"అస్యశ్రీ ఇంద్రజాల మహాతంత్రస్య భాస్కరఋషిః ప్రాచీనాంధ్రాక్కర రగడ,సీసాదయః ఛందో విశేషాని నవీన పాశ్చాత్య ప్రకృతి శాస్త్రాదయః దైవతాని—న్యూటన్, క్యావెండిష్, ఇత్యాదయః నిరంతర సేవకాః..." అని వెంటనే యింద్రజాలికుఁడు కొన్ని మంత్రములు చదివి నెమలి కుంచెను ముమ్మాఱు ఆడించి తన బొంతనుండి యొక కొయ్యపెట్టెను పైకితీసి దానికి రంగురంగుల గాజు బుడ్లను దగిలించెను, తోడనే యా బుడ్లయందు ఎఱ్ఱని, పచ్చని, ఆకు పచ్చని, యిట్టి రంగురంగుల దీపములు బయలుదేఱి యా ప్రదేశమును తమకాంతులతో నింపివైచెను. ఆ వెలుఁగు ముందఱ మందిరములోని దీపములన్నియు సూర్యుని ముందఱి దివిటీలైనవి. పిమ్మట నా యైంద్రజాలికుఁడు ఆ పెట్టెకు తొమ్మిదడుగుల పొడుగుగల యొక కఱ్ఱను అమర్చెను. ఆ

కట్టపైన రెండు నెమళ్ల ప్రతిమలు కలవు. వాని రెక్కలకు పరిమళములు అలఁదఁబడి యుండెను. పెట్టెకు కట్టను తగుల్పఁగానే యీనెమళ్లు రెక్కలువిప్పి యొయ్యారముగా నాట్యము చేయుచు మహారాణిని నచ్చటి యెల్లరను గుమగుమ వాసనల నీను చల్లని వాయువులతో సుఖా వహులను గావించెను. వింజామరలనుండి యింత చిక్కని గాలి యెన్నఁడును వారికి రాలేదు. ఆ దీపముల సొంపును కొనందించుచున్న మహారాణి యీ నెమళ్లు వెదఁజల్లు కమ్మతెమ్మెరలకు ఆశ్చర్యమును నివ్వె అను చెందెను. తోడనే ఆ నెమళ్లు కట్టనుండి ఎగిరి నేలకు దిగి తిన్నఁగా మహారాణికడకు ఒయ్యారముగాఁ నడచి రెక్కలతో విసరుచు, మెడలుత్రిప్పి యాడుచుచు, ఆమెచుట్టును ప్రదక్షిణము చేయుచు నాట్యము చేయసాఁగెను. అప్పుడు ఐంద్రజాలికుఁడు అచ్చటి యొక పరిచారికను ఒక పాటను పాడుమనెను. ఊర్మిళాదేవి నిద్రనుండి కొన్ని చరణములు ఆ యంగన శ్రావ్యముగాఁ బాడినది. ఆపాట ముగిసిన మఱు క్షణముననే ఐంద్రజాలికుని పెట్టెనుండి యాపాట మఱల వినవచ్చినది. పరిచారిక మఱల పాడుచున్నదేమో యని,

మహారాణి—ఇదియేమి? పాడినదే పాడుచున్నావు?

పరిచారిక—నేనుకాదు దేవీ! ఈపాట నా గొంతుకతో ఎవ్వరు పాడుచున్నారో తెలియకున్నది.

మహా—(కలయఁజూచి) ఎవ్వరును నోరు మెదపుట లేదు. నీ గొంతుమాత్రమే వినఁబడుచున్నది.

ఐంద్ర—మహారాణిగారికి జోహారు. ఈ కొయ్యపెట్టె శబ్దగ్రాహక యంత్రము. ఈ పెట్టెయే తాను విన్న యీ

పాటను పాడుచున్నది.—దేవిగారి పరిచారికలు ఈ పింగాణి పాత్రములోని నీటియందలి యా సువర్ణమును తీసి నాకొసంగఁ బ్రార్థించుచున్నాను.

ఒకతె—(నీట చేయిముంచొనిపి) అబ్బా! ఎవ్వరో వీపుపై కొట్టినట్లాయెను. నేను తీయలేను.

ఇంకొక పరిచారిక—చేయి యీడ్చుకొని పోయినది. కొరడాతో కొట్టినట్లాయెను.

ఎందఱు పరిచారికలు ప్రయత్నించినను చేతిని నీటముంచుటకు సాధ్యము కాలేదు. మహారాణియు తన హస్తము నందుంచఁ బోవుచుండఁగా తన్ని వేసినట్లయ్యెను.

ఐంద్ర—ఏలినవారికొక్క మనవి. ఈ పావుకోళ్లలో యంత్రము కలదు. వీనిని అధిష్ఠించి దేవిగారు ఆ సువర్ణమును తీయఁగలరు.

లలిత అట్లే ఆ పాదుకలెక్కి సునాయాసముగా నా సువర్ణమును తీయఁజాలెను. ఇంతలో నీ యైంద్రజాలికుఁడు తన పెట్టెనుండి యొక పటమును లాగి రాణికొసఁగెను. అది ఆచోట ఆ సమయమున నచ్చటివారందఱును ఉండునట్లు ఎత్తఁబడిన ఛాయాపటము. ఆశ్చర్యముతో వారందఱును ఆ పటమునందలి యొయ్యారములను చూచుకొనుచుండఁగా దీపములు ఆఱిపోయినవి. ఎదుటి గోడమీఁద భవభూతి వ్రాసిన యుత్తర రామచరిత్రము ప్రదర్శింపఁ బడుచుండెను. శ్రావ్యముగా శ్లోకములును సంభాషణలును వినవచ్చుచుండెను. నాటకపాత్రలు రంగస్థలమున అద్భుతముగా నటించి ఆశ్చర్యమును గూర్చుచుండిరి.

మహారా—రామభద్రా! ఆశ్చర్యములో మునిఁగి పోవుచున్నాను. ఇది యేమో నాకుఁ దెలియకున్నది.

రామ—దేవీ! ఇది ఉత్తరరామ చరిత్ర నాటకము ఏలినవారి యెదుట ప్రదర్శింపఁ బడుచున్నది.

మహా—ఈ నటకులు, ఈనటీమణులు, వీరందఱు కాక యైన ప్రవాలరాని నా యంతఃపురములోని కెట్లు వచ్చినారు? ఈ చిన్నచావడి యింత విశాలముగా నెట్లయినది! ఈ రంగ స్థల మున్నచోటి మనగోడ యేమైపోయినది?

ఇంతలో ఫెటిల్లు ఫెటిల్లున చప్పుడు వినవచ్చినది. ఉత్తరరామ చరిత్రము నిలిచిపోయినది. మరల యెప్పటి వలెనే గోడ కానవచ్చినది. లలిత ఆశ్చర్య పరవశురా లయ్యెను. ఇంతలో నా గోడ మాటలాడ సాగినది. “సూర్యగ్రహణము పట్టుచున్నాను.” అనుమాటలు విన వచ్చినవి. ఆ గోడమీఁద పెద్ద యాకాశమును ఆ నడుమ సూర్యుఁడును ముందుఁ గానవచ్చెను. చంద్రుఁడు భూమికిని సూర్యునకును నడుమ పరుగెత్తుచుండెను. భూమినుండి సూర్య బింబము కొంచము కొంచముగా చంద్రుని చాటున బడెను. తుదకు భూమికి సూర్య స్పర్శయే లేదు. చంద్రుఁడు అవ్వలి కరిగెను. క్రమముగా గ్రహణము విడిచినది.

మరల ఫెటిల్లు ఫెటిల్లు. ఆ గోడమీఁద నవఖండ మండితమైన భూమండలము కానవచ్చెను.

పాటను పాడుచున్నది.—దేవిగారి పరిచారికలు ఈ పింగాణి పాత్రములోని నీటియందలి యీ సువర్ణమును తీసి నాకొసఁగఁ బ్రార్థించుచున్నాను.

ఒకపరి—(నీట చేయిచొనిపి) అబ్బా! ఎవ్వరో వీపున బాదినట్లయినది. నేను తీయలేను.

ఇంకొక పరిచారిక—చేయి యీడ్చుకొని పోయినది. కొరడాతో కొట్టినట్లయినది.

ఎందఱు పరిచారికలు ప్రయత్నించినను చేతిని నీట ముంచుటకు సాధ్యము కాలేదు. మహారాణియో తన హస్తము నందుఁ జొనుపఁగా తన్నివేసినట్లయ్యెను.

ఐంద్ర—ఏలినవారికొక్క మనవి. ఈ పావుకోళ్లలో యంత్రము కలదు. వీనిని అధిష్ఠించి దేవిగారు ఆ సువర్ణమును తీయఁగలరు.

లలిత అట్లే ఆ పాదుకలెక్కి సునాయాసముగా నా సువర్ణమును తీయఁజాలెను. ఇంతలో నీ యైంద్రజాలికుఁడు తన పెట్టెనుండి యొక పటమును లాగి రాణికొసఁగెను. అది ఆచోట ఆ సమయమున నచ్చటివారందఱును ఉండునట్లు ఎత్తఁబడిన ఛాయాపటము. ఆశ్చర్యముతో వారందఱును ఆ పటమునందలి యొయ్యారములను చూచుకొనుచుండఁగా దీపములు ఆఱిపోయినవి. ఎదుటి గోడమీఁద భవభూతి వ్రాసిన యుత్తర రామచరిత్రము ప్రదర్శింపఁబడుచుండెను. శ్రావ్యముగా శ్లోకములును సంభాషణలును వినవచ్చుచుండెను. నాటకపాత్రలు రంగస్థలమున అద్భుతముగా నటించి ఆశ్చర్యమును గూర్చుచుండిరి.

మహా—రామభద్రా! ఆశ్చర్యములో మునిఁగి పోవుచున్నాను. ఇదియేమో నాకుఁ దెలియకున్నది.

రామ—దేవీ! ఇది ఉత్తరరామ చరిత్రనాటకము వలినవారియెదుట ప్రదర్శింపఁ బడుచున్నది.

మహా—ఈ నటకులు, ఈనటీమణులు, వీరందఱు కాంకి ణైన ప్రాలరాని నా యంతఃపురములోని కెట్లు వచ్చినారు? ఈ చిన్నచావడి యింత విశాలముగా నెట్లయినది! ఈ రంగ స్థల మున్నచోటి మనగోడ యేమైపోయినది?

ఇంతలో ఫెటిల్లు ఫెటిల్లున చప్పుడు వినవచ్చినది. ఉత్తరరామ చరిత్రము నిలిచిపోయినది. మఱల యెప్పటి వలెనే గోడ కానవచ్చినది. లలిత ఆశ్చర్య పరవశురా లయ్యెను. ఇంతలో నా గోడ మాటలాడ సాగినది. "సూర్యగ్రహణము పట్టుచున్నాను." అనుమాటలు విన వచ్చినవి. ఆ గోడమీఁద పెద్ద యాకాశమును ఆ నడుమ సూర్యుఁడును ముందుఁ గానవచ్చెను. చంద్రుఁడు భూమికిని సూర్యునకును నడుమ పరుగెత్తుచుండెను. భూమినుండి సూర్య బింబము కొంచము కొంచముగా చంద్రుని చాటున బడెను. తుదకు భూమికి సూర్య స్పర్శయే లేదు. చంద్రుఁడు అవ్వలి కరిగెను. క్రమముగా గ్రహణము విడిచినది.

మఱల ఫెటిల్లు ఫెటిల్లు. ఆ గోడమీఁద నవఖండ మండితమైన భూమండలము కానవచ్చెను.

# భూమిలో మూఁడుపాళ్లు సముద్రము ఒక్క పాలు నేల.

అనియందు వ్రాయఁబడెను. ఆపటములో నొకమూల ఆంధ్రదేశము కానవచ్చినది. అందు ఆంధ్రులందఱు నిద్రపోవుచుండిరి. అందుండి అనేకవిధలైన గుఱ్ఱు గుఱ్ఱులు సమవిషమాదిస్వరభేదములతో వినవచ్చుచుండెను. ఆ గుఱకలకు మహారాణికి నవ్వువచ్చినది. ఇంతలో నొక ద్వీపాంతరవాసి లేచి నిలిచి యుపన్యసించుచుండెను.

“భ్రాతృవరులారా! వినుఁడు. దేశాభివృద్ధియని సాకుపెట్టి వంచకులు చెలరేగుచున్నారు. ఎవ్వరే కార్యమును ఆరంభించినను దాని మంచిచెడ్డలు విచారించుటకు మనకు ఎవ్వరును జీతబత్తెములు ఒసంగలేదు. విరారు కులికి యలయకుఁడు దేశాభిమానుల మనువారు కూసికొని కూసికొని నిస్సహాయులై తామే నశించి పోవుదురుగాక. వారివలని ప్రమాదము తొలఁగుటకై వీలునుబట్టి మెల్లరును నొక్కొక్కఱాయి వేయుదురుగాక.”

మహా:—ఇదియేమి ?

ఇంద్ర—కొన్ని దేశములలో స్వాతిశయము ప్రబలినది అచ్చట ఎవ్వరు ఏఘనకార్యమును ఆరంభించినను తక్కినవారు అలస భావముచేతనో ఆపదలఁ గూర్చుటచేతనో దానిని నశింపఁజేయుదురు. దేశాభిమానులను వారిలో స్వార్థపరులే వేలకువేలు కలరు.

మహా—అట్టి దేశము లేయేయవి ?

ఇంద్ర—నిర్బంధ విద్యాశిక్ష లేక నూటికి తొంబది తొమ్మిదిపాళ్లు అజ్ఞానదశతోనే యుండు సర్వదేశములును. మఱియు స్వార్థపరుఁడును వాని కుమారులగు వంచక ప్రభృతులును రాజ్యము చేయు దేశములు.

మహా— వీనిలో మనయాంధ్ర దేశము ఉన్నదా.

ఇంద్ర—ఇట్టి యాంధ్రదేశమువంటి దేశములు అందు ఎన్నివందలో యున్నవి కాని ఏలినవారు ఈ చిత్రమును దర్శింపవలెను.

గోడమీఁద పోర్చుగల్ దేశము. ఒక నిర్ధనుఁడు సముద్రముల వెంటఁబోయి ప్రపంచముచుట్టి వత్తుననుచున్నాఁడు. ధనికులందఱును పోటీలుపడి ఆ నిర్ధనునికడకు పరుగెత్తు చున్నారు. ఆ పరుగులో ముందు చేరినవాఁడు

నేను నీకు ఓడను కట్టియిచ్చెదను నీవుచూచిన విషయములు నాకే తెలుపవలెను.

తరువాత చేరినధనికుఁడు—నీకు ఓడను ఓడనడుపు వాండ్రను గూడనిచ్చెదను.

మూఁడవధని—నీకు ఓడను, మాల్మీకాండ్రను, ఆహారాదులకగు వ్యయమునుగూడ నొసంగెదను.

నాలుగవధని— వీని యన్నింటికిఁ దోడుగా తిరిగి వచ్చిన తరువాత నీకు వేయినిష్కములిచ్చెదను.

ఐదవ— ఆ నిష్కములను నీకు ప్రయాణమునకు ముందుగానే ఒసఁగెదను.

ఆఱవ—అట్లే చేయుచు సమర్థులగు మహానీయులను

గూడ నీకు సాయమొసంగెదను. ప్రయాణములలోని సర్వసమ
స్యలను వారు ఎదురుకొందురు.

ఏడవ—దీనితోపాటుగా నేను వీరభటనికాయమును
గూడ నీతో నంపెదను.

ఇంద్ర—దేవీ! సత్కార్యము ప్రారంభింపఁ బడి
నప్పుడు బాగుపడుదేశములు ఇట్లు సహాయమొనర్చును. అధమ
దేశములలోని ధనికులు భోగములకును మేళములకును జూద
ములకును త్రాఁగుడులకును ఎన్నికలకును మన్నికలకును ఉన్నది
ఊడ్చిపెట్టి అప్పులు కట్టికొందురు. ఈ దృశ్యమును చిత్త
గింపుఁడు.

అది సైబీరియా యను నుత్తరకురుభూమి, ఆ భూమి
యంతయు మంచుగడ్డలతోఁ గప్పఁబడియుండెను. దుర్భరమైన
చలికి తాళలేక యందొక మనుష్యుఁడు ఒక ఎలుఁగుచర్మపు
బొంతలోదూఱి పరువెత్తుచుండెను. భూమిలో ఆ చలికి ఏ పం
టయును బండదు ఏ మృగములును బ్రదుకవు. తెల్ల యెలుఁగు
గొడ్లును మంచులేళ్లును మాత్రమే యచ్చటి మృగములు. ఆ
ప్రదేశమున సంవత్సరమునకు ఒక్కటే దినము. అనఁగా మన
లెక్కను వారికి ఆఱునెలలు రాత్రి; ఆఱునెలలు వెన్నెలవంటి
చల్లనియెండ. ఆ ప్రదేశమధ్యమున మేరువు పర్వతము అది
యంతయు సువర్ణమయము. అచ్చోటనుకొంతమందిఊఁపిరి విడు
చుటకైన తెఱపిలేనంత పాటును పడుచున్నారు.

ఇంతలో మఱియొకదృశ్యము ఆటవికుఁడొకఁడు ఒక
యంత్రమును స్థాపించెను. పదిమంది యాటవికులు దోష భూ
ష్ఠమైన యా యంత్రమును నాశనముచేయ శపథమూని దేశ

ములవెంట బయలుదేఱి ఆ యంత్రములో దోషములను ఎన్ని పనికి అడ్డమువచ్చిరి. తుదకు ఆ యంత్రస్థాపకుఁడు దివాలా తీసి చెఱసాలకు పోవలసివచ్చెను. అటువెనుక ఫ్రాంసుదేశములోని ద్రాక్షతోటలు: రైతు ఒక్కొక్క పండునేవరి రసముపిండి శుద్ధముచేసి సీసాలకెక్కించి విదేశములకు ఎగుమతి చేయుచుండెను. కష్టించి యచ్చటివారు కోటీశ్వరులగుచుండిరి. "కష్టించి కష్టించి వన్నెల చిన్నెలతో దివ్యపదార్థములు చేయుము కష్టేఫలీ" అని యచ్చటి జీవితాదర్శము.

మఱల గోడమీఁద ఆంధ్రదేశము. ఒక యాంధ్రుఁడును కొందఱు కూలివాండ్రును అందున్నారు. యజమాని తమవైపు చూచినంతసేపే పని. ఆయన అటువంక మొగము త్రిప్పఁగానే కూలివాండ్రు మఱియొకవంక మొగము త్రిప్పి దిక్కులు చూచుచున్నారు. చేయఁబడిన వస్తువులకు వన్నెలు చిన్నెలువేసి సమ్మోహనము కూర్చునట్లు ఒక జపాను చిత్రము ఆ ప్రక్కనే అఱవదేశములోని ముఱికి యోడుచు నీళ్లు కాఱుచు కంపు గొట్టుచున్న చెఱుకు బెల్లపు యంత్రశాల.

లలితా మహాదేవి యీ చిత్రములనుజూచి యానందించెను. వెంటనే యైంద్రజాలికుడు "లలితా మహాదేవికి జయమగునుగాక యని హెచ్చరించెను. ఐదు మహాసముద్రపు పటములు గోడమీఁదికి వచ్చినవి. శరపరంపరలుగా నౌకలు అందు పోవుచున్నవి. ప్రతి నౌకయు వ్యాపార సామగ్రులతో నిండి రివ్వురివ్వున పోవుచున్నది. వీనిని సంరక్షించుటకై సముద్రములో నెల్లెడల నానా దేశముల యుద్ధనావలు సిద్ధముగా నున్నవి. సముద్ర మధ్యమునందలి జలచరములు సహి

తము ఏమో తీవ్రమైనపని యున్నట్లు విధి విరామములు లేకుండ సంచరించుచున్నవి. పైన వాయు విమానములు తపాలతో సంచారము చేయుచున్నవి. ఒక క్షణమైనను ఆలస్యము కారాదని అమెరికాదేశము వారు తంతిమీఁదనే మాటలాడి వ్యవహారములు జరుపుకొను చున్నారు. ఆప్రక్కనే ఆంధ్రదేశమున దీర్ఘనిద్ర. గోడనుండి మఱల నిద్రితుల భయంకరమైన గుఱ్ఱుశబ్దములు. ఒకఁడు ఒకనిద్రితుని లేపుచున్నాఁడు. వెంటనే ఆ నిద్రితుఁడులేచి తన్ను లేపినవానిని చావమోఁది మఱల పండుకొని గుఱ్ఱుపెట్టు చున్నాఁడు. అంతతో సరిపోయినది మఱల తెల్లనిగోడ.

అప్పటికా యింద్రజాలము ఆరంభమయి సరిగా రెండుగడియలైనది. తోడనే గడియారమును చూపుచు ఇంద్రజాలికుఁడు లలితా మహాదేవికి నమస్కరించి నిలువఁబడెను. రాణి యాతనికి ఒక బంగారు పళ్లెమునిండ వరహాలు పోసి యిచ్చినది. ఇంద్ర జాలికుఁడు దానిని స్వీకరింపలేదు మృదు వినయ భావములతో నాతఁడు సాష్టాంగమొనర్చి రాణి కిట్లనెను.

"మహాదేవీ! అభయమును వేఁడుచున్నాను. నేను ధనసంపాదనకు తమ దర్శనమునకు రాలేను. నావిద్య ప్రకటింపను నేను తలఁపలేను. ప్రకృతి శాస్త్రములు అపారములు; వానివలని లాభములు అనంతములు. ఈ పెద్దాపురమున ఏలిన వారి పోషణమున ప్రకృతి శాస్త్ర విద్యలు పెంపొందుటకు ఒక ప్రకృతి శాస్త్ర నిలయము స్థాపింపఁ బడవలెను. దాని నిర్వాహణమునకు నేను పూనుకొందును. అంధకారావృతమై

నిద్రావస్థలోనున్న యాంధ్రప్రతిభ యేలినవారి పోషణము వలన మేల్కొని లోకోత్తరమగుఁ గాక! లలితా మహాదేవి సంతోషముతో దీనికి అంగీకరించినది. పెద్దాపురమున ప్రకృతి లనియము స్థాపింపఁ నాజ్ఞ వెలువడినది.

# రెండవ ప్రకరణము.

పెద్దాపురమున ప్రకృతి నిలయము స్థాపింపఁబడిన నాఁటనుండియు లలితా మహాదేవి దుఃఖమును మఱచి యించుకించుక తేఱుకొనసాగెను. ఆమె మనస్సున మఱల సంతోషమును ఉత్సాహము జనింపఁజేయుటకై రామభద్రుఁడును ఐంద్రజాలికుఁడును సర్వ ప్రయత్నములును జేయుచుండిరి. రాజమందిరము విద్యుద్దీపములచేతను పంకాలచేతను నలంకరింపఁబడెను. శబ్దవాహినులు దూరదర్శనులు నిర్మింపఁబడెను. ఐంద్రజాలికున కిప్పుడు రాణిగారి సమ్ముఖమునకు రాకపోకలు సేయుచుండుటకు ఎట్టి యభ్యంతరములును లేవు. అప్పుడప్పుడు ఇంద్ర జాలములుచేసి యామెకు ఈశ్వర శాసనముల వలని యద్భుతములను బ్రదర్శించుచు రాజమందిరమును ప్రకృతి శాస్త్ర యంత్రములచే సర్వ చిత్రములకు నిలయము చేయుచు అతఁడు రాణిగారి హృదయమును ప్రకృతి శాస్త్రములందే నిరంతరోత్సాహముచెంది విలసిల్లున ట్లొనర్చెను. పెద్దాపురములోని పాండవ దుర్గముకడ వేయి యెకరముల

నేల ప్రకృతినిలయపు మందిరాదుల కొఱకుఁ గొనఁబడినది. రామ భద్రుని ప్రేరణచే ఏలేటిగట్టున వేయి యెకరముల పల్లపు భూమి దీని పోషణకై యేర్పఱుపఁ బడినది. ఈ భూముల పరిపాలనము ప్రకృతి నిలయమువారి పేరట సంస్థానము వారే చూచుకొనుచు వలసినప్పుడు ధనమును మాత్రము నిలయ మున కొసఁగుటకు కట్టుదిట్టములు చేయఁ బడినవి.

రెండేండ్లలో ఏలేటిభూములు ఫలసాయమునకు తేఁబడి నవి. నీటి పాఱుదలకు జలయంత్రము లమర్పఁ బడినవి. క్రమ క్రమముగా ప్రకృతినిలయపు భవనములకు లలితా మహా దేవియే శంఖస్థాపన మొనర్చెను. తరువాత దానియాదాయ మునుండి ఒక యేడాదిలో భవనములన్నియు సిద్ధమైనవి. రెండవయేటి యాదాయముతో యంత్రములు స్థాపింపఁ బడి నవి. పాశ్చాత్య దేశములలోని ప్రకృతి నిలయములకు పెద్దా పురపు నిలయముతోడి సఖ్యము బలిసినది. మూఁడవయేట వలసిన సిబ్బందియంతయు ఏర్పడినది. విద్యార్థులకు ఉచిత ముగా ప్రకృతి శాస్త్రములు నేర్పుట యారంభమైనది. నాలుగవయేట ఉత్తమ పుస్తక భాండాగార మొక్కటి వెలయింపఁబడినది. ఇట్లు సునాయాసముగా ఆఱేండ్లనాఁటికి ప్రకృతి నిలయము లోకోత్తరమైన మహా సంస్థయైనది. ఐంద్రజాలికుఁడు ఆర్ష యోగీంద్రుని శిష్యుఁడైన యార్షవిజ యుఁడను శాస్త్రవేత్త. ఈతఁడు ఐరోపా ఖండమున నందలి ప్రకృతి శాస్త్రములను గఱచి వానిని ఆంధ్రదేశమున వెల యింప సంకల్పించుకొన్న మహానుభావుఁడు. చేమనచాయ గల శరీరముతో ఆఱడుగుల పొడవుగల యున్నతాకార

ముతో, విశాలమైన నెన్నుదురుతో, తేజోవంతములైన నేత్రములతో ఈతఁడు ప్రకృతి శాస్త్రములే తన ప్రపంచముగా నిత్యమును తన్మగ్నుఁడై యుండును. తదేక ధ్యానముతో నిత్యమును ప్రకృతినే యుపాసించుచు కాలముపుచ్చు నీ విజ్ఞాన నిలయున కొక్కొక్కప్పుడు మహారాణివచ్చి తన యెదుట గడియసేపు నిలిచినను గూడఁ దెలియకుండును. అట్టి సమయమున లలితా మహాదేవి వినయముతోను సంతోషముతోను ఆ మహానుభావుని ఆలోకించుచు, నాతనికి తపోభంగము కావింపనొల్లక వచ్చినదారినే నిశ్శబ్దముగా వెడలిపోవుచుండును. ఆర్య విజయుని జూచినప్పుడు ఆమెకును మంత్రీంద్రునకును గలుగు నానంద మింతింతగాదు. ఒకనాఁడు రాణియు, మంత్రియు, ప్రకృతి నిలయాధ్యక్షుఁడగు నీ యార్య విజయుఁడును ముచ్చటించుకొను చుండఁగా తటాలున నార్య విజయుఁడు, "అమ్మా! కుబేరసంపద! కుబేరసంపద! ఈ సంపదయంతయు మీకే ఒసఁగుచున్నాను. ఇఁకమీఁద ఆకుబేరుఁడును మీకంటెకొక బిచ్చగాఁడగును" అని యఱచుచు గంతులు వేయసాఁగెను. మఱల ఆవేగుఁడై "అమ్మా! నాకుస్ఫురించినది! ఇప్పుడే స్ఫురించినది. లోకములో నెందెందు అమూల్య నిధానములు గలవో యవి యన్నియు పెద్దాపురపు రాజ్యమునకే చెందును. మీకే యిచ్చెదను. రాణిగారికే సమర్పించెదను. ఒక్కనిధానమును గూడ బైటికి పోనీయను. రాణిగారికే మన రాణిగారికే".

లలిత—సోదరా! కలగనుచుంటివా? ఏ లోకము నుండి నీవిట్లు మాటలాడు చున్నావు?

ఆర్ష వి—దేవీ! ఈ లోకమునుండియే మాటలాడు చున్నాను. ఇది కలగాదు నిక్కువము. ప్రపంచములోని అమూల్య నిధానములన్నియు ఏలినవారికే. వానిని మీకే మీకే యిచ్చున్నాను.

రామ—భూలోకములోని నిధానములు మాత్రమేనా, స్వర్గ పాతాళములలోనివి గూడనా? పాతాళములోని ప్రతి నాగేంద్రుని శిరస్సునను ఒక్కొక్కయమూల్యరత్న ముండునట!

అర్ష—ఈ యార్ష విజయుఁడెప్పుడును పరిహాసము లాడఁడు. ఆడుటకు ఆతనికి తీఱికయు లేదు. తమరును దేవిగారి వలెనే నేను కలగనుచున్నట్లు తలంచుచున్నారు. ఇది కలగాదు. నిక్కువము, నిక్కువముగా నీ భూలోకములోని యమూల్య నిధానములన్నియు దేవిగారి వశమొనర్చుచున్నాను.

రామ—అట్లయినయెడల మహారాణిగారికి కుబేరసంపత్తు కలుగఁగలదు.

అర్ష—కుబేరునికి తొమ్మిది నిధులుమాత్రమే గలవు. మహారాణిగారు అట్టివి వేయు, లక్ష, కోటి నిధులకుఁగూడ యజమానులు కాఁగలరు. అట్టిదే మనఫ్లుత మనోహరిణి.

రామ—ఆమె యెవ్వరు?

ఆర్ష—అదియొక యంత్రపు టంగీ. దానినిఁ దొడిగి కొని నీటమునిఁగి యొకటి రెండు దినములదాఁక జలగర్భమున నుండవచ్చును,

రామ—(నవ్వుచు) అట్లైన నేను దానిని దొడిగికొని మాయింటి నూతిలో దుమికెదను. రెండుదినముల తరువాత పైకి తేలుదును. వెంటనే రాణిగారికి కుబేరసంపద వచ్చును.

ఆర్య.—నూతనమునకు ప్రయోజనములేని మహా సముద్రములో మంచిలోతు చూచుకొని మునుకవలెను.

రామ.—నీట మునుఁగుటకు అంతదూరము పోనేల ?

ఆర్య.—సముద్రము భూమికంటె మూఁడింతలు పెద్దది కాదా ?

రామ.—కాఁబట్టి పెద్ద సముద్రములో మంచిలోతు చూచుకొని మునుకుట ప్రధాన మంత్రీంద్రుని గౌరవమునకు తగియుండును.

ఆర్య.—(కోపముతో)-మీకు నామాటలు, నవ్వుగా తోఁచుచున్నవి. మహా నిధానములు సముద్ర గర్భమునఁగాక మీ దొడ్డిలోని భావిలో పడియుండునా ?

రామ.—ఇప్పుడు తెలిసినది నడి సముద్రములో లోతుగా మునిఁగి అడుగునఁ బడియున్న రత్నములతో ఒడి నింపుకొని తెచ్చి మహారాణిగారి సమర్పింప వలసినది.

ఆర్య.—మీ నవ్వులకు పరిమితిలేదు. మీరిట్లు మాట లాడినయెడల ఈ రహస్యమును మీకుఁదెలియకుండ దేవి గారికే మనవి చేసెదను.

లలిత.—(నవ్వుచు) శాస్త్రజ్ఞుల మాటలు నవ్వులుగా సేరవు. ఇందులో ఏదో కిటుకు ఉన్నది. రామభద్రుని మాటల కేమి ? శ్రద్ధతో మీ మాటలు నేను వినియెదను.

ఆర్య.—దేవీ ! ఈ మంత్రీంద్రుఁ డెప్పుడును ఇట్టివాఁడే సంగతి గ్రహించు నేర్పెఱుఁగఁడు. స్వతమనోహారిణి ప్రకృతి శాసనముల నూతన వికాసము. జలాంతర్గామములు ఇదివఱకే మీ రెఱుఁగుదురు.

లలిత—అవును మీరుచెప్పిన పద్ధతిని కొన్ని జలాంత ర్గాములు కోరంగి రేవులో సిద్ధమై ఈ రెండేండ్లనుండియు సముద్రసంచారము కావించుచున్నవి.

ఆర్ష—అమ్మా! భూ ప్రదేశము ఆయా రాజుల సొత్తు. ఒకరి భూమిలో మఱియొకరు ప్రవేశించుటకు హక్కు లేదు ఎవ్వారి భూమిలోని నిధి నిధానములకు అవ్వారే యజమానులు.

లలిత—ఆమాట నిజము.

రామ—ఒకరి భూమిలోని నిధులను మఱియొకరు త్రవ్వుకొని పోవుటకు అధికారములేదు.

ఆర్ష—అదియే నేను చెప్పుమాట. మంత్రీంద్రుఁడిప్పటికి దారికి వచ్చుచున్నాఁడు భూములు అన్యాధీనములైనను సముద్ర గర్భములోని భూములుమాత్ర మింకను తీరమున కన్నులమూఁడుమైళ్ళపైన మానవాధీనములు కాలేదు.

రామ—మీాప్లుత మనోహరిణితో మనము వానిని జయించినయెడల జన సంఖ్య హెచ్చినప్పుడు ప్రజలను కొందఱను ఆ రాజ్యములోనికి త్రోసివేయవచ్చును.

ఆర్ష—అట్టికాలమును రావచ్చును. ప్రకృతిశాస్త్రముల ప్రభావమునకు పరిమితి లేదు. మానవుఁడు జలచరముగా జీవించుకాలము గూడ ఆనాఁటికి రాకపోదు కాని మన ప్రకృత విషయము నిధానములను గూర్చినది. భూమికి మూఁడురెట్లవైశాల్యముగల సముద్రభాగమున నెందెందు ఎట్టి యమూల్య నిధులుగలవో యెవ్వరెఱుఁగుదురు ?

లలిత—అవును ఎందెందు నిధులున్నవో యెవ్వరెఱుఁ

గుదురు? ముఖ్యముగా ఉత్తరదిశను నవ నిధానములున్న మాట శాస్త్ర సమ్మతమే. అదియే కుబేరుని పట్టణము. ఇది గాక సముద్రునకు రత్నాకరుఁడన్న నామము సార్థకము.

ఆర్య—జలాంతర్గాములతో సముద్రపుటడుగున సంచారములు చేయుచు ప్లుత మనోహారిణితో క్రిందికి దిగి శోధనలు కావించి త్వరలోనే ఎన్ని గనులనైన మనము కనిపెట్ట వచ్చును.

రామ—లేదా జీవిత కాలమంతయు శోధించి నొక్కగని నైన కనిపెట్టలేకయు నుండవచ్చును. తిమినక్రఝషాకులమైన యా గంభీరోదధిలోని యేజంతువునకైన ఆహారమేని కా వచ్చును.

ఆర్య—ప్రకృతి శాస్త్రానుసారముగా శోధనలు జరిగిన చో నట్టివి సంభవింపవు. జలములలో మునిఁగి యడుగున పని చేయుచు కూలివాండ్రు ఖనిజముల నెత్తి జలాంతర్గాములను నింపఁగలరు. ప్రకృతినిలయము అందుండి మీకు వెండి బంగా రములను రత్నరాసులను సమకూర్పఁగలదు.

రామ—మీరు చెప్పినది నిజమగుచో రెండవకంటికిఁ దెలియకుండ సముద్రపుటడుగున పట్టణములు నిర్మించి గనులు త్రవ్వింపవచ్చును.

ఆర్య—చేరెడు బియ్యపు నూకలకును, మూఁడు ప్రత్తి కాయలకును ఖండ ఖండాంతరములు వెదకి యెగుమతి చేయించి కొని యంత్రపు కూలివలన జనులు జీవించుచుండఁగా రెండవ కంటికిఁ దెలియకుండ వెండి బంగారములను వెలపొడుగు ఱాళ్లను వెదకి మూఁటగట్టుకొనుటకు తీఁపుతీసినదా? అట్లై

నచో సోమరితనమును అహంకారమును బలిసిన మీ యాంధ్ర దేశమునకు అంతేగతి.

లలిత—ప్రకృతిశాస్త్రపుయంత్రములు అసాధ్యమైనవి. నిజముగానిది సిద్ధించినయెడల కుబేరసంపద పరిహాస్యమే.

ఆర్ష—అట్టిదే జలదేవతా స్వరూపిణియగు మాహ్లత మనోహారిణి. ఈ బొంతను జూడుడు.

అర్ష విజయుఁడు పది యడుగులపొడుగును మూఁడడుగులవెడలుపును గల మానవాకారమగు నొక సుందరమైన యాఁడుదాని యాకారమును వారిముందుఁ బడవైచెను. కమ్మని కీల్జడతోను, నిద్దంపుమెఱుంగు మేనిచాయతోను, హస్తకంకణములతోను ఆభరణములతోను ప్రకృతి విరచితమైన మదనుని సాయకమో యనునట్లున్న యా సమ్మోహన రూపమునుగాంచి రాణియు హెగ్గడయు పులకిత దేహులైరి.

'' దేవీ ! ఇది యతిరహస్యమును పరమగోప్యమును నగు యంత్రము. ఈ గుట్టు కాపాడుకొన్నంతవఱకు భూలోకము మూఁడుపాళ్లకు మీదే సార్వభౌమత్వము. ఈ మంత్రమును ఇతరులు తెలిసికొనిరో మీరును మీ పెద్దాపురమునే మీకు మిగులఁగలయవి. '' అని పలుకుచు నధ్యక్షుఁడు ఈ కాళ్లలో కాళ్లను, చేతులలో చేతులను, తలలో తలను, దోఁపి సంచినిబంధించి మీ యిచ్చవచ్చినచోటికి పోవచ్చును. చూపులకు పెద్దవిగాని యీ కాలుసేతులును ఈ శరీరమును లోపలి మానవుఁడెట్లు కదల్చిననట్లు కదలును. శిరోభాగమున ద్రవీఘటితమైన ప్రాణవాయువు తిత్తిగలదు. అందుండి సూది మొనవంటి బెజ్జముగుండ మరతో వలయునంత ప్రాణవాయువును దీసికొన

వచ్చును. అందే యొకప్రక్కను ఉచ్ఛ్వాసమునుండి వచ్చు అంగారాది వాయువులను వెడలించు సాధనములును నత్ర జనపు తిత్తియు రాగిపెట్టెలలోనున్నవి. పాదములలో జలము నింపుకొను పాత్రములున్నవి. వానిని నింపి నీటముసుఁగవచ్చును. ఆ నీటిని వెడలించి పైకి తేలవచ్చును. నీట సంచారము చేయుటకు విద్యుచ్చక్రములును అర్లే వేఁటాడుటకు విద్యుద్బాణములును గలవు. పీడ్యమానమగు నీటిబలముతో తుపాకి నుండి విద్యుద్గర్భితమైన రాగిగుండ్లు వెడలి తిమింగిలములను గూడ ఒక్కతాఁకున చంపును. వానిని సంహరించు సంతటి శక్తి ఈ గుండ్లలోని కాచమధ్యమునందలి రాగి తీగలకుఁ గలదు. సముద్రపు టడుగున పై నీటి బరువునకు తల క్రుంగ కుండునట్లు యంత్ర శిరోభాగము రాగితోనే చేయఁబడినది. కాంతశిలల వలని ప్రమాదమును బాపుటకై యిందు ఇనుమును చేర్పలేదు. లోనీటి చీఁకటినిఁ బాపుటకు విద్యుద్దీపములును, కండ్ల కడభూత దర్పణములును నిందుఁగలవు. దీనికి వివిధ ప్రమాణములు గల నూరు జేబులున్నవి. అందు సమస్త పదార్థములను అప్రమాదముగ సేఁకరించి యుంచుకోవచ్చును. గుండుదెబ్బకు మారుమసలు చర్మముతో నిది చేయఁబడినది.''

యంత్ర మర్మముల నన్నింటిని పరిశీలించి తెలిసికొని రాణియు మంత్రియు నబ్బురపడిరి. తోడనే దానిని ధరించి ఆర్ష విజయుఁడు ఒక నూతదిగి గంటకాలము అందుండి పిమ్మట పైకివచ్చెను. ఒకనాఁడు అధ్యక్షునితోను మంత్రితోను పరిచారికలతోను ఉప్పాడ సముద్రపు టడుగున రాణిగారు రెండు దినములు నివసించి పిమ్మట పైకివచ్చిరి. ఆ సమయ

మున సముద్రపు టడుగున సర్వ్యశుఁడు వీరికొఱకు నాలుగు డేరాలను జలదుర్గమముగా నిర్మించెను. అందే వంటలును వినోదములును జరిగినవి. రాణిగారు అచ్చోట రెండుమైళ్ల లోతున నీటియడుగునను జలమధ్యమునను గూడ చెలికత్తెల తో సంచారములు చేయుచు వేఁటలాడుచు జలదేవతవలె విహ రింప సాఁగిరి.

ఇప్పుడు లలితా మహాదేవి పెద్దాపురములో నంతగా నిలుచుటలేదు. తూర్పు సముద్రములోని భయంకరములైన మొసళ్లను, చేఁపలను, విషసర్పములను వేఁటాడుటయుఁ జల విహారము చేయుటయు నామెకు సదా ప్రీతికరములయ్యెను. రాజ్య పాలనాకృత్యములు మంత్రీంద్రుఁడు నిర్వహించుచుం డెను. సముద్రపు టడుగున కొండలను పగులఁగొట్టు విద్యుద్భే దక యంత్రములను అర్క విజయుఁడు సమకూర్చెను. భూస్వ భావమును బట్టి గనులను ఆలోకించు యంత్రములును పద్ధతు లును ఆతఁడు కల్పించి విశిష్టము గావించెను. వీని సహాయ ముతో నాలుగు జలాంతర్గాములు శాంతమహా సముద్రము సొచ్చి యందలి పర్వతములను శోధించుచుండెను. లలితా మహాదేవి స్వయముగానే కోరంగి చుట్టుపట్ల తానును నిరం తర విహారములుగావించుచుండెను.

ఒకనాఁటి యుదయమున నీ జలదేవతలు కోరంగికడ సముద్రపు టడుగున ముప్పది యడుగుల లోతున ఏడడుగుల యెత్తుగల యొక గుట్టను దర్శించిరి. దాని పై భాగమంతయు ముత్యపు చిప్పలతో నిండి దేదీప్యమానముగా వెలుఁగుచుం డెను. అచ్చోట మహారాణి తానెన్నఁడును కనియు వినియు

నెఱుఁగని యచ్చమునైన యాణి ముత్తెములను రాసులు రాసులుగా పొడఁగాంచెను. ఇదియే సముద్ర గర్భమున నామెకు దొరకిన మొట్టమొదటిగని. పరిచారికలు ఆ ముత్తెములనుఁ బ్రోవుచేసి జలాంతర్గాములకెత్తిరి. ఎన్ని జలాంతర్గాములు నిండినను ముత్తెములగని యెప్పటియట్లే యుండెను. సముద్ర గర్భమునుండి గనులను త్రవ్వుపని మొట్టమొదట ఇందే యారంభమైనది. పెద్దాపురపు ప్రకృతినిలయము ఆణిముత్యములతో నిండిపోవుచుండెను.

ఆసమయమున ఆర్ష విజయుఁడు దేవిని సమీపించి "దేవీ! రహస్యము బట్టబయలగుచున్నది. ప్రజలకు ఈముత్తెములు దొరకుతావు తెలిసినచో పరరాజులతోడి మహాయుద్ధములు పొసఁగఁగలవు. రహస్యముగా వలసినంతవఱకే ముత్తెములు తెచ్చుకొనుచుండుట మేలు. నాలుగైదు మైళ్లలోతు ఉన్నచో సముద్రములో సర్వదా పనిచేయ వచ్చునుగాని ముత్యపుచిప్పలు పైనీటనే లభించును గదా."

దేవి—ఆమాట నిశ్చయము. ఈ ముత్తెములు ఇంత యుత్తమముగానేల ఉండవలెనో ?

ఆర్ష—ఇది యుత్తమోత్తమ జాతి గుల్లపురుగు. దీనికి తగిన ఆహారమిచ్చి పోషించినచో మనసముద్రపు పొలములలో ముత్యములు రత్నములు పండఁగలవు.

దేవి—వరిని, జొన్నలనువలెనే పొలములువేసి ముత్యములను గూడ పండింప వచ్చునా ?

ఆర్ష—ఆహా! సమస్త సముద్ర జలజంతువులను గూడ. ఈరత్నపు పురుగులను దోహదముచేసి త్రాటికాయ లంతలేసి

ముత్యములను గూడఁ గల్పింపవచ్చును. నేను తమకు సముద్రమునందు ముత్యపుఁ బొలములను పగడపు పొలములను నాఁటి యొసఁగఁగలను.

దేవి—ఆ పొలములను మీ యధీనము చేయుచున్నాను. సముద్రములో సారవంతమైన తావును వెదకి యందువిత్తనములను వేసెదరా ?

ఆర్య—తప్పక అట్లు చేసెదను. ఈ ముత్యములను జూడఁగా నిచ్చోట పనసకాయలను గుమ్మడికాయలను బోలిన పెద్ద ముత్యములు గూడఁగలవని స్పష్టమగు చున్నది. నేను ఏలినవారిని ఆ ప్రదేశమునకుఁ గూడఁ గొనిపోయెదను.

లలితయు అధ్యక్షుఁడును తారాభాయి కుమార్తెయగు ప్రేమవతియు ఒకనాఁడు సముద్రములోఁ బ్రవేశించిరి. ప్లుత మనోహరిణులతో ముత్తెపు పొలముల కడకేగిరి, అందు పెద్దగా పెరిగి అత్యంతారోగ్య స్థితియందున్న నూరు ముత్తెపు గుల్లపురువులను పట్టి అధ్యక్షుఁడు సమీపములోని పదియడుగుల యెత్తుగల యొక కొండచుట్టును వేయి చదరపు గజముల తీఁగనునాటి అందు వానిని బంధించెను.

దేవి—వీనినేల కారాబద్ధము చేయుచున్నారు ?

ఆర్య—మానవుఁడు స్వోపయోగము కొఱకై యీశ్వర సృష్టిని ఇష్టే బంధించి మచ్చిక చేసికొనును, ఈ వల నుండి యీ గుల్లలు వెడలలేవు. ఉత్తమోత్తమ జాతికి చేరిన యీ గుల్లలనుండి కొన్ని యంతకంటె పెద్ద గుల్లలు పుట్టును. వానిలో మఱల ఆరోగ్యవంతములగు వానిని ఏఱి బంధించి యందలి గొప్పజాతిని మఱల గ్రహింపవలెను. ఇట్లు కొన్ని తర

ములు దోహద క్రియ జరిగినవెనుక త్రాటికాయలంతేసి ము
త్యములు వచ్చు పాలములు వేయుటకు వి త్తనములు దొర
కును. ప్రత్యేకాహారాదులు ప్రకృతమున అవసరములేదు.

ప్రేమ—ఆ ప్రక్క కొండలోని గుహలోనికి గుల్లలు
రాకపోకలు సేయుచున్నవి. నేనా లోనికి అరిగితిని. అందు
రెండడుగుల వ్యాసముగల పెద్ద ముత్తెముమెఱయుచున్నది.
భయముచేత నేను దానిని తాఁకలేక పోయితిని.

ఆర్య—ప్లుతమనోహారిణిని ముత్తెపు గుల్లలేమి చేయఁ
గలవు. పోయి దానిని తీసికొనిరా.

ప్రేమవతి యొక కొండ ప్రాకారంగములో దూరెను. పది
పండ్రెండు మలుపులు తిరిగెను. అ తావునంతను సూర్యజ్యో
తులవలె నింపివేయుచున్న ఆ ముత్యమును ఎత్తెను. అంత
నొక ఘోరయుద్ధ మారంభమైనది. వందలకొలఁది ముత్యపు
పురుగులు ప్లుతమనోహారిణిని నఖ శిఖాపర్యంతము కొఱికి పట్టి
వ్రేలాడసాగెను. "నేనే ఉత్తమ క్షత్రియ బాలికనేని, పరా
క్రమ శీలయగు తారాభాయియే నాతల్లియేని, ఈ పురుగులు
నన్నేమిచేయఁగలవు" అనుచు నామె యా ముత్యమును నేలఁ
గొని అటువంకఁ జూచెను. కొంతదూరములో సొరకాయవలె
తేఱిన యంతకంటె పెద్ద ముత్యమొకటి కానవచ్చెను. ప్రేమవతి
ఆ ముత్యమును గూడ గ్రహించెను. రెండుచేతులలో రెండు
జ్యోతిస్స్వరూపములవలె ఆ ముత్యములు ఒప్పుచుండెను. అవలీల
గాఁ బరువెత్తుచు మఱుక్షణముననే ప్రేమవతి ఆముత్యములను
దేవిగారి చేతులలోనిడి భూమికి గజముఎత్తు నీటిలో ముప్పది
యడుగుల లోతున యామెకు సాష్టాంగ మొనర్చెను.

మఱునాఁడు ఆ ముత్యములు దేవిగారి సభా భవనపు సువర్ణ పీఠముల నధిష్ఠించి ధూపదీప నైవేద్యాదుల నందు చుండెను. ముప్పది యాఱంగుళముల వ్యాసముగల యుత్తమ జాతి ముత్యము ప్రపంచములో నొక్కటియే కలదు. అది నేఁడు లలితా మహాదేవి సొత్తై పెద్దాపురము నలంకరించుచున్నది. అట్లే రెండు మూళ్ల జేనెడు పొడుగుగల జాతి ముత్యమును ఒక్కటే ప్రపంచమునఁ గలదు. అదియు వత్సవాయి వంశ మువారి సొత్తై యీ పెద్దాపురములోనే యున్నది.

ప్రేమవతి తెచ్చిన యీ రత్నముల వలన రాణిగారికి అమితానందము కలిగినది. ఒకనాఁటి సాయం సమయమున అంతఃపుర కాంతలు శాస్త్రము లభ్యసించు రహస్య మందిర మున ప్రకృతి నిలయములో ప్రేమవతియు, రాణియు గురు వర్యుఁడును సంభాషించు చుండిరి

ఆర్షవి—ఈ ప్రేమవతి తను ఋణము తీర్చుకొన్నది. అమూల్య రత్నములను ఎప్పుడో వెదకి తమకు చూపఁదలంచి తిని. కాని నాకంటె ముందే యీబిడ్డ మీకు వానిని చేర్చినది.

ప్రేమ—పురుగులయందును ఆత్మ రక్షణ విధానము లుండుననని మీరు నేర్పితిరి. కాఁబట్టి పెద్ద రత్నములు మత్స్య ములు చొఱరాని కలుగులలో నుండవచ్చునని నే నూహించి శోధించితిని. నాయూహ నిజమైనది. యుద్ధమును జరిగినది.

ఆర్ష—దేవిగారి పెంపుడు కూఁతురవై నందుకు నీ ఋణమును తీర్చుకొన్నావు.

ప్రేమ—ఋణము తీర్చుకొని పోవువారిని దత్తు చేసికొను

వాఁడుక ఇంకను ఈలోకములో పుట్టలేదు. దత్తపుత్రికలు పాలక మాతల సొత్తులను మూఁటగట్టుకొని పోవనే తెంచువారలు. ఈ పేరుపెట్టి రాణిగారికిఁగల భావిబాధ్యతను తొలఁగింపఁ జూడకుఁడు.

లలిత—పిచ్చిపిల్లా! నీవు నాభాగ్యముల ఖనివి. నా నోములపంటవు. (అని కౌఁగిలించుకొని చెక్కిలినొక్కి ముద్దిడి) ముద్దుతల్లీ! నిన్నువిడిచి నా ప్రాణములు నిలుచునా?

ప్రేమ—అంతే ఈ గురువుగారు అడ్డుపుల్లలు వేయని యెడల—.

లలిత—నా బిడ్డను గురువుగారేమి చేయఁగలరు?

ఆర్ష—ప్రకృతి శాస్త్రములలో లోకులకు గురి కుదరలేదు. ఈశ్వరోద్దిష్టమగు మన యార్షమతమున కిఁక వ్యాప్తి పొసఁగుటెట్లని తమతో యోచింపఁదలఁచినాఁడను.

లలిత—అవును. ఆర్షయోగీంద్రులును అట్లే సెల విచ్చి యున్నారు.

ఆర్ష—ఇంతవఱకును ప్రకృతినిలయము విద్యార్థులకే వినియోగ మగుచున్నది. లోకమున ప్రకృతి శాసనముల ప్రభావమును వెలయించుపని యింకను నారంభము కాలేదు.

లలిత—అదియే నేనును యోచించుచున్నాను. ప్రకృతి నిలయమునకు ఆ బాధ్యత కలదు.

ఆర్ష—అద్భుతములైన యంత్రములు నిర్మించి ప్రకృతిదేవి మాహాత్మ్యమును లోకమున వెల్లడింపవలెను. ప్రకృతి శాసనములే జీవితాదర్శములన్న ఆర్షమతసత్యమునకు అప్పుడే వ్యాప్తిపొసఁగును.

లలిత——ఈ ముత్యపు గనులవలనను ప్రవాళపు గనుల వలనను మనకు అమితాదాయము వచ్చుచున్నది. ఈగనులను ఆర్ష సమాజము వశమొనర్చి, వ్యవహారములను సంస్థాన సంబంధములేకుండ విడఁదీయరాదా?

ప్రేమ——పెద్దల మాటలలో పసివాండ్రు చొఱరాదు. కాని నా కొక్కటి తోఁచుచున్నది.

లలిత—బుద్ధులు ముందుపుట్టి తరువాత నీవు పుట్టినావు.

ప్రేమ——నాకంటె ముందు మీ రిరువురును పుట్టినారు. కానిందు నాకుఁ దోఁచినది చెప్పనులెండు.

లలిత——నీకేమి తోఁచినది?

ప్రేమ——సంస్థానముపేర మీరు పాలించు మౌక్తిక ప్రవాళ సస్యములు పరాధీనము చేయుటకు మీకు అధికారములేదు. అది సంస్థానపు భావిభాగధేయులకు అన్యాయమొనర్చిన ట్లగును.

లలిత——అది నిజమే. కాని ఐహికాముష్మికములకు ప్రకృతి శాస్త్రసిద్ధాంతములే పరమవేదములన్న అర్షమతమునకు వ్యాప్తి పొసఁగుట యెట్లు?

ప్రేమ——అది ఆర్ష యోగీంద్రుల యేర్పాటులలోను ప్రకృతి నిలయమువారి సానుభూతిలోను నున్నది.

ఆర్ష—నిర్ధనులైన యార్షతీర్థులవా రేమి చేయఁగలరు?

ప్రేమ——ఇదివఱకు సంపాదించినవి సంస్థానమునకు చెందినయెడల ముందు సంపాదించు గనులు ఆర్ష సమాజము వారికేల చెందరాదు? ఆర్షసమాజము నూతనముగా గనుల నేల సంపాదించి పాలించుకొనరాదు?

లలిత—(ప్రేమవతిని ముద్దిడికొని) చక్కనియుక్తి.

ప్రేమ—సంస్థానము నేఁటిదాఁక పంపిన జలాంతర్గ్రామములవలని ఫలితముసంస్థానమునకే చెందును. సమాజమువారుస్వతంత్రముగా భావి సంపాదనను గావించుకొను నను వు చూడుఁడు.

ఆర్య—సమాజమునకు సంపాదనకు మూలధన మక్కఱలేదా ?

ప్రేమ—పెద్దాపురపు సంస్థానమువారి ప్రేమకు నాకు హక్కుకలదు. నాపేర కొన్ని జలాంతర్గ్రామములను, కొంత ధనమును (శ్రీ)వారు దయచేసినయెడల నేను వానితో సమాజముకొఱకై ముత్తెపు పొలములను పగడపుఁ బొలములను కూర్చుకొందును.

లలిత—తల్లీ ! నీకు నా శరీరమునుకోసి యిమ్మన్నను ఇచ్చివేసెదను.

ప్రేమ—జలాంతర్గ్రామములతో క్రొత్త గనులను కనిపెట్టెదను. ఒక్కమాటకు క్షమింపుఁడు. గర్వమని తలంపకుఁడు. సెలవైనచో ఆ మాటకూడ చెప్పివైచెదను.

ఆర్య—నిశ్చయముగా నీవు అమూల్య నిధానములను సంపాదింపఁ గలవు. అవి సమాజమునకుఁ జెందును. అటువెనుక.

ప్రేమ—వెనుక కేమున్నది ? వెనుకను లేదు ముందును లేదు. నా సొంత సంపాదనను నేను ఆర్యమత ప్రచారమునకొసఁగెదను. దాని పరిపాలనకు వలసిన యధికారములు కొన్ని నేను వహించెదను. కొన్ని యధికారములను తల్లిగారు నాకొఱకై పరిపాలింపఁగలరు.

లలిత—నీవేమి చేయుమన్నను నేను సిద్ధముగా నున్నాను.

ప్రేమ—ప్రకృతి నిలయమువారు నాకు వలసిన యంత్రాదికములను శాస్త్రజ్ఞుల సహాయమును దయచేయుచుండవలెను. వాని వ్యయము నేనే భరింతును.

ఆర్య—ఇది యెంతపాటిపని? తప్పక జరుగును.

ప్రేమ—నేను భాగ్యవంతురాల నైతినేని నా ధనమునుండి దేవిగారు సమాజముపేర నానారాష్ట్రములకు ప్రచారకులను బంపుచు తమ రాజ్ఞీత్వము మెఱయునట్లు పెద్దాపురము సంస్థానముపేర సమస్త రాజేంద్రులతోను మైత్రి కలిగించుకొను చుండవలెను. రాజులకంపు కట్నములును కానుకలును సమాజమువారి కర్చున నుండవలెను.

లలిత—నేను నీవు చెప్పినట్లే చేయఁగలను. ఇంతకును ధనమేది? గనులేవి?

ప్రేమ—నన్నుఁ బంపినయెడల క్షణకాలములో మీకు అమూల్య ధనములను కూర్పఁగలను.

లలిత—తల్లీ! నిన్ను వదలి ఒక్క క్షణమైనను నేను ఉండలేను.

ప్రేమ—కాని—నేను గనులను వెదకుటకు సముద్రములలోఁబడి పోకమానను.

# మూడవ ప్రకరణము.

పెద్ద ముత్తెములు దొరికినా నాఁటనుండియు లలితా మహాదేవికి మనోదుఃఖములు నివారణమయినవి. కొలఁదిదినములలో నామె కొఱకు పెద్ద పగడ మొక్కటిగూడ ప్రేమవతిచే సముద్రములోని ప్రవాళ పర్వతములనుండి యెత్తఁబడినది. భూ ప్రదేశమునుండి మామిడితోఁటలును పనస ద్రాక్షాదివనరాజములును ఆమెకు అనంతఫలముల నొసఁగుచుండఁగా నామెనాఁటిన సముద్రములోని తోఁటలు ఆణి ముత్తెములను మేలి పగడములను అవ్వారిగా పండుచుండెను. ఆర్య విజయుని దోహదమువలన సముద్రములోని కొన్ని జంతువులు గూడ వికసించి నూతన జీవముతో విరాజిల్లినవి. ప్రేమవతియు తన పేరకొన్ని సముద్రపు తోఁటలను నాఁటి, రాణిగారితోఁటలకు, మించిన ముక్తాఫలములను ప్రవాళములను పండించుచుండెను. ప్రేమవతి తోటలోఁబండునవి ముత్యపు బొండములును పగడపు బొండములును గాని వట్టి ముత్తెములును పగడములునుగావు. ఇవి యార్యసమాజమున కొసఁగఁ బడుచుండెను.

ప్రేమవతీద్వితియుయై పెద్దాపురమున నొకనాఁడు తన యుద్యానములో లలితా మహాదేవి యొకగున్నమామిడి నీడను గూరుచుండి ఆర్యమత రహస్యములను ఆకళింపు చేసికొనుచుండఁగా నార్యవిజయుఁ డచ్చోటికి విచ్చేసెను. దేవియు ప్రేమవతియు నాతనికి నమస్కరించి నిలిచిరి.

ఆర్ష—ప్రేమవతీ! నీకొకమంచి భర్తను సంపాదించి తిని ఏ మందువు?

ప్రేమ—పెద్దవారికి పసివాండ్రన్న ఎప్పుడును పరి యాచకమే! భర్తనే సంపాదించిన తరువాత అడుగఁబనియే మున్నది?

ఆర్ష—ఆభర్తనిన్ను ముల్లోకములను త్రిప్పి మూఁటలు కూర్పఁగలఁడు.

ప్రేమ—త్రిప్పినచో తిరిగెదను; మూఁటలను మోసె దను.

లలిత—ప్రేమవతి అల్లరిపిల్ల. దీనిని బాగుగా వంపగల భర్త కావలెను. ఇదినేర్చిన విద్యలు ఎవ్వరును నేర్వరు.

ఆర్ష—మహనీయ కీర్తిగుణో పేతయగు నీమెతల్లి తారాభాయికి మంత్రీంద్రుఁడు వాగ్దానము చేసెనఁట.

లలిత—ఏమని?

ఆర్ష—ఉత్తమ క్షత్రియ బాలకున కీకన్యనిచ్చి వివా హముచేయుమని. మంత్రీంద్రుఁ డీసంగతిని ఆర్షయోగీం ద్రులకుఁ దెలుపఁగా వారు వరాన్వేషణకు నా కాజ్ఞాపించిరి. యోగీంద్రులు తమతోను ఈ విషయమై ముచ్చటించిరఁట!

లలిత—అవును అట్టివరుఁడు లభించినాఁడా?

ఆర్ష—ఇది తారాభాయి కన్నబిడ్డ, ఏలినవారి దత్త పుత్రిక, ఆర్ష యోగీంద్రునిగారాబు భక్తురాలు, నాప్రియ శిష్య—ఇట్టి మన ప్రేమవతికి తగినవరుఁడు దొరకుట దుర్ల భమా?

లలిత—అట్లయిన యెడల ఈ పిల్లను తీసికొనిపోయి

ఆ పిల్లవానికి వెంటనే ముడివేయుఁడు ప్రేమవతీ! ఇటురా గురువుగారు నీకు మగనిని తెచ్చినారు ఆయనతో వెళ్లిపో.

ప్రేమ—(కోపముతో) రాణిగారికిని పరియాచక మేనా? ఆ మగనిని గురువుగారికే యిచ్చి పెండ్లిసేయుఁడు.

ఆర్ష—మగఁడన్న అంత తేలికగానున్నాఁడా? ఈఁపటి నుండి ఆయన వంచినట్లు వంగవలెను. ఆయన సేవలోనే ఆఱి తేఱవలెను. వేగముగా రా.

ప్రేమ—నాకు మగఁడు అక్కఱలేదు?పొండు మీరిరువురును మంచివారు కారు. నాతో మాటాడవద్దు.

లలిత—పిల్లవాఁడు అక్షరాస్యుఁడేనా?

ఆర్ష—ఆస్యము మాత్రమే కాదు. అతఁడు అక్షరస్వరూపుఁడు.

ప్రేమ—అతని కెంత వయస్సు?

ఆర్ష—మునిమనుమలకు మునిమనుమలనుగూడ ఎత్తినాఁడు. కాని నేఁటికిని పసివాఁడే. నాకాతఁడు ఎప్పటికిని పసివాఁడే.

లలిత—అట్లయిన యెడల నా దత్త పుత్రికకు ముసలి మగనిని కట్టిపెట్టుదురా?

ఆర్ష—వానికున్నంత భాగ్యము జగత్తులో ఎవ్వరికిని లేదు. వాఁడు ముసలివాఁడెట్లగును?

లలిత—ప్రేమవతీ! ఇటురా ముసలిమగనిని పెండ్లి చేసికొందువా?

ప్రేమ—(కోపముతో లలితను వీఁపున మెల్లగా కొట్టి పాఱిపోవును.)

లలిత—(పరువెత్తి పట్టుకొని లాగుకొనివచ్చి) ఇది పాఱిపోవును శీఘ్రముగా ముడివేయుఁడు.

ప్రేమ—(లాగికొని తప్పించుకొనఁ జూచుచు) నాకు పెండ్లివద్దు. పొండు.

లలిత—అమ్మవుకాదా ? ముసలివాఁడైననేమి ? అదృష్టము ప్రధానము. ఇంతకును గురువర్యా ! పెండ్లి కుమారునిది ముదివయస్సంటిరే. ఇంకను మతియున్నదా పోయినదా ?

ఆర్ష—ఆయనకు ఎప్పుడును మతిలేదు. చేయునవి యెప్పుడును చెఱుపన చేటుపనులే. కాని మెలఁకువ యెఱిఁగి మసలుకొన్నచో నట్టి మగనివలన నొక శబ్బరకలుగదు అష్టైశ్వర్యములును ఇష్టభోగములును సమకూరును.

లలిత-అమ్మా ! ప్రేమా వింటివా యీమాట ? ముసలి వాఁడఁట ! మతిలేదఁట ! చేయునవి చెఱుపనచేటు పనులఁట ! ఇంతకంటె మంచి మగడు ఎందైన దొరకునా ? గురువర్యా ! ఆలస్యము చేసెదరేమి ? వెంటనే ముడిపెట్టుఁడు.

ప్రేమ—అమ్మా ! మీరెంత దొంగలు ! మీమాట నాకుఁ దెలిసినది ! మీరు పంచభూతాత్మకమైన ఈ భౌతిక ప్రపంచమునుగూర్చి మాటాడుచున్నారు !

ఆర్ష—గడుసుపిల్ల ! గండ్రతనముగూడ నున్నది. నా మాటలకు ఈ యర్థమెట్లు పొసఁగును ?

ప్రేమ—అక్షర స్వరూపుఁడు, ఎప్పటికిని పసిదనమే, జగత్తులో అద్వితీయమైన భాగ్యము, తనకు మతిలేదు, కాని

మనము మెలఁకువతో వర్తించినచో ఇష్టభోగములు-ఇట్టిది ప్రకృతిగాక మఱియెవ్వరు ?

లలిత—తెలివిగల బిడ్డ. ఇది మనమాటల నెట్లు త్రిప్పి సమన్వయించు చున్నదో !

ప్రేమ—అంతమాత్రమే కాదు. ఈ ప్రకృతిశోధనకై జలాంతర్గాములలో పోయి మహా సముద్రములలో గనులు కనిపెట్టుదునని నేను నిరంతరము మిమ్ము వేఁడుటలేదా ? గురువర్యులు తెచ్చిన యీ భర్త నేను స్వయముగా వరించిన యీ భర్తయే. (అని తలవంచుకొను చున్నది.)

లలిత—సంభాషణ అడ్డముగా త్రిప్పివైచినది. (పిల్లను ముద్దిడికొని) కాని తల్లీ నిన్నువదలి నేను ఉండలేను. ప్రకృతి దేవతనే నీవు సదా సేవించుచు గురువర్యుని శిష్య బృందము నందు అగ్రేసర వగుటచే ఇట్లు భాషించితివి ?

ప్రేమ—కానిండు. సామాన్య పండితులందఱు సప్త సముద్రములు శోధించి గనులనుండి యమూల్య ధనమును మీకుఁ గూర్చుచున్నప్పుడు ఎన్నో నూతనోపకరణములను సృష్టించిన నాకు మాత్రము మీరు సెలవొసఁగరాదా ?

లలిత—తల్లీ ! వారు సంపాదింతురు. ఆ ధనమున కంతకు నీవు మహారాణివి. ఉత్తరాధికారిణివి.

ప్రేమ—ఎవ్వరో సంపాదించినది వేఱెవ్వరో యనుభవించుటలో నిజమైన మానవులకు ఆనందము లేదు. స్వయం కృషివలన లబ్ధమైన కించిద్విజయమును మహదానంద ప్రదాయకము.

ఆర్య—దేవీ! పత్రములు తెచ్చితిని. ప్రేమవతి సంతకములే కావలసి యున్నవి.

లలిత—పిల్లా! ఈ కాగిదముల మీఁద వ్రాలు చేయుము. నీ సముద్రపు పొలముల లెక్కలను ప్రకృతి నిలయమువారు కొని తెచ్చినారు.

ప్రేమ—ఇప్పుడు నాపేర ఎంతసొమ్ము నిలువయున్నది.

ఆర్య—ఒక జలాంతర్గామియు ఆఱుప్లుత మనోహరిణులు పోఁగా మూఁడువేల నిష్కములు నీపేర నున్నవి. ఇవి కాక రెండుపుట్ల ముత్యములును అఱుపుట్ల పగడములును విక్రయమునకు సిద్ధముగా నున్నవి.

ప్రేమ—ఆహారపు డబ్బా లెన్నియున్నవి.

ఆర్య—అన్నియుచేరి నాలుగువేల నిష్కములగును. ఉలాందా వారును పరాసు వారును స్వదేశములోనే ఈ పద్ధతిని అవలంబించినారు.

ప్రేమ—మంచుగడ్డల స్థితి యెట్లున్నది?

ఆర్య—మీకు స్వంతనౌకలు లేనందున వ్యాపారమంతయు మందముగానే యున్నది.

ప్రేమ—ఒకపెద్ద యోడను నిర్మించుటకు ఈ ధనము చాలదా?

లలిత—ఎంత ధనమైనను నేను ఒసఁగెదను.

ప్రేమ—సంస్థానపుసొమ్ము ఇందు చేరినచో మున్ముందు సమాజపు హక్కులకు భంగము రావచ్చును.

లలిత—నాసొంత సొమ్మును నా కూఁతునకు ఇచ్చు కోరాదా?

ప్రేమ—ఆ కూఁతురు మూర్ఖురాలై వలదన్నప్పుడు?

లలిత—మా వత్సవాయి వారింటి యాఁడుబిడ్డ లెప్పుడును మూర్ఖురాండ్రు గారు.

ప్రేమ—దేవిగారు ఆత్మస్తుతి యెప్పుడు నేర్చుకొన్నారు? కాని అమ్మా! ఈ ముత్యపు పాలములతో నెప్పటికి ఆర్షతీర్థులవారి యాశయము నెఱవేఱును? జలాంతర్గామిలో నేఁడైన నన్ను పోనిండు. సముద్ర గర్భమునందలి సువర్ణములను రత్నములను సమాజమునకు కూర్చెదను.

లలిత—బిడ్డా? నిన్ను వదలి జీవింపలేను.

ప్రేమ—అట్లయిన నీ కౌఁగిదములలో నేను చేవ్రాలు చేయను.

ఆర్ష—నీ చేవ్రాలు లేనంత మాత్రమున నెవ్వరికిని నష్టములేదు. మా పనులు నిలిచిపోవు.

ప్రేమ—అట్లయిన యెడల నన్ను శాంతమహా సముద్రములోనికి పోనిండు.

లలిత—ముక్కు పచ్చలాఱని పసిబిడ్డవు; ఆఁడుదానవు. నిన్ను దేశాంతరములకు పోనిత్తుమా?

ప్రేమ—దేశాంతరములకు కాదు. ఉదధిగర్భములకు; రత్నాకరుని ధనాగారములకు?

లలిత—నీ వెన్నఁడును దూర ప్రయాణములు చేసి యెఱుఁగవు.

ప్రేమ—దూర ప్రయాణములు చేయనియెడల వానిని ఎఱుఁగుటయు నెన్నటికిని రానేరదు. నేఁడు మీచేత ముందు

చిన్న దూర ప్రయాణము చేయించెదను. తరువాత పెద్ద దూరమునకు నన్ను వదలివేయుఁడు.

లలిత—ఎంత చిన్నదూరము ?

ప్రేమ—నావంటి పసిబిడ్డలు ఆడుకొను బొమ్మలు పోవునంత చిన్నదూరము. ఈ బొమ్మను నేను చేసితిని. ఒక్కసారి చూడుఁడు.

అచ్చోట నొక పొదలో ఉత్తుంగమైన యాకారముగల చక్కని గరుడపక్షి ప్రతిమయొక్కటి యుండెను. అది ప్రేమవతిచేత నిర్మింపఁ బడినది. లలితా మహాదేవి ఆప్రతిమను జూచి యానందించినది.

లలిత—లోహము కఱఁగించి యీ బొమ్మను ఎప్పుడు పోఁత పోసితివి ?

ప్రేమ—నేఁటి యుదయమునకు ఇది సిద్ధమైనది.

లలిత—ఇది యంత్రపు విహంగమైన నెంత బాగుగ నుండును ?

ప్రేమ—అప్పుడు మహాలక్ష్మివలె మీరు గరుడారూఢులై ఆకాశ సంచారముకూడ చేయవచ్చును.

ఆర్ష—ఆకాశమున కెగురునట్లు చేయుట కష్టము లోనిది గాదు. వాయు విమానమును విహంగాకృతిగాఁ జేసిన యెడల—

ప్రేమ—భూమ్యుపరిభాగమున ఝంఝానిలములు వీచినప్పుడు ఆపక్షి ఆ గాలికి కొట్టుకొని పోవదా ?

ఆర్ష—తన్ను ఉడికించినానని నామీఁద పగతీర్చు

కొను చున్నది. నూరుమైళ్ల వేగముతో ఎదురుగాలి వీచినను నేను నిర్మించు యంత్రమునకు ప్రమాదము కలుగదు.

ప్రేమ—కాని యెత్తున కెగిరినప్పుడు ఉక్కిరి బిక్కిరి. అమ్మా! ఈపక్షిని మీ రొక్కసారి అధిరోహింపుఁడు. మీ వెనుక నేనును కూరుచుండెదను. చిన్నదూరము పోయివత్తము.

ఆర్య—ఒక మాసములో విహంగాకృతి గల విమానమును నేను మీకు సమర్పింపఁ గలను. ఈ పక్షిని అధిరోహించి చూడుఁడు.

ప్రేమవతియు రాణియు ఆ పక్షిపై కెక్కిరి. అందలి హౌదాలో రాణి సుఖావిష్ట యయ్యెను. తోడనే ప్రేమవతి యొక మీటనొక్కెను. పక్షి ఆకసమునకు ఎగిరిపోయినది.

ప్రేమ—అమ్మా! గురువర్యుఁడు ఎప్పుడో నిర్మింతు నను చున్నాఁడు. నేను ఇప్పుడే దీనిని నిర్మించితిని.

లలిత—ఇంత పిల్లవైనందుకు నాకు సంతోషముగా నున్నది. కాని ప్రమాదములు రావచ్చును. వెంటనే క్రిందికి దింపుము.

ప్రేమ—జలమధ్యముననే మీరు విహారములుచేసితిరి గాని వాయు మధ్యమున ఎన్నఁడును విహరింపలేదు. కొంచెము సేఁపు స్వారి వెడలుదము. ఈ యంత్రములో ప్రమాదమునకు చోటులేదు.

లలిత—దేశములు దాఁటిపోవు చున్నాము. అ కాన వచ్చునది తునిలోని శాల జగపతి భవనము.

ప్రేమ—వాల్మీకి ఆకాశ మార్గమున ఆఱు బాటలను వర్ణించినాఁడు. అందు భూమికి అత్యంత సమీపస్థమగు బా

టను ధాన్య జీవినులగు పక్షులు సంచరించును. పండ్లనుకాయ
లను దిను బలి భోజనములు అంతకెత్తైన బాటను పోఁగలవు.

లలిత—మనమిప్పుడు ఏ బాటను పోవుచున్నాము ?

ప్రేమ—క్రౌంచములు సంచరించెడు మూఁడవ బా
టలో నున్నాము. ఇదె నాలుగవ మార్గమున కేగుచున్నాను.

లలిత—హద్దు లేక దుండగములు చాల చేయు
చున్నావు. మహారాణితోనే పరిహాసములా ? ఇఁక చాలును.
ఇంటికి మఱలింపుము.

ప్రేమ—ఇది నాలుగవ మార్గము. ఇందు డేగలు
సంచరించును. మనలను జూచి ఆ పక్షులెట్లు పాఱిపోవు
చున్నవో ?

లలిత—ఇంతవఱకు చాలును. ఇంటికి మఱల్పుము.

ప్రేమ—ఇంక కొంచెముసేఁపు. పోవుచున్నామే గాని
కుదుపైన ఇందులేదు. వాయు విహారము ఎంత వినోదకరము?
ఆక్రింది అడవులును కొండలును ఎంత రమ్యముగా నున్నవి ?
అమ్మా ? ఇప్పుడు మనమేగుచున్నది అయిదవ పథము. ఇందు
గ్రద్దలు సంచరించును.

లలిత—నాకు కండ్లు తిరుగుచున్నవి. కడుపులో ఆం
దోళనము పుట్టుచున్నది. ఇంటికిపద. ఎంత దుష్టురాలవైతివి ?

ప్రేమ—ఇది ఆఱవపంథ. ఇందు వైనతేయములు
సంచరించును. వాల్మీకి యింతవఱకే చెప్పినాఁడు. నేను ఏడవ
పంథకును ఎగురుచున్నాను. ఇప్పుడు మనము భూమికి నాలుగు
మైళ్ల యెత్తున నున్నాము.

లలిత—అఱచేతులలో ప్రాణములు పెట్టుకొని ఏల

యీ యాగడము. నిన్ను కారాగృహమున వేయించెదను చూడుము.

ప్రేమ— అట్లయినయెడల నన్ను క్షమింపుఁడు. బాల్య చాపల్యముచే చెప్పకుండ మీకు అద్భుతమునుగూర్చ నారాట పడితిని. మీరు ఆ వరాండాలో నించుక విశ్రమింపుఁడు. త్వర లోనే యింటికి పోవుదము.

అని ప్రేమవతి యొక మీట నొక్కెను. వెంటనే యచ్చోట నొక గదియేర్పడెను. విమానము ఏడవపంథను పోవుచునే యుండెను. ప్రేమవతి ఆగదిలో రాణికి పడకయమర్చి మధురములైన ఫలములను ఆమె కొసఁగెను.

లలిత—ఇవియేమిటి? ఈ మోసమునకు తోడు విందులు గూడనా ? ఇట్టి దుష్టురాలిచేత నేను తినను.

ప్రేమ—సర్వలక్షణ సమన్వితమై శాస్త్రసిద్ధమై అప్ర మాదమై ఆనంద పూరితమగు యంత్రమును రహస్యముగా నిర్మించి జల విహారమునకుఁ బ్రతిగా వాయు విహారమును గూడ మీకు సమకూర్చి మెప్పందఁదలఁచితినిగాని ఆకస్మిక ముగా మిమ్ము అంతరిక్షమునకు ఎత్తుకొని పోవుటవలని మాన సికవ్యధను గూర్చి నాకు తట్టలేదు. అయినను నా చేతులతో నేను చేసిన యీ యంత్రమునకు ఆనందించి ఒక్క మెప్పు మాటను పలికినచో ఎంత సంతోషింతును ? దయచేసి ఈ యాహారమును స్వీకరింపుఁడు.

లలిత—ఇంతటి తెలివియు సమర్థతయు నిజముగా మె చ్చఁదగినవియే. దీనికి నేను కొండయెక్కుదును. కాని ప్రమా దములు వచ్చునని భయము. ఇప్పటికిని నీపిల్లచేష్టలుపోలేదు.

కొంచెము సేపటికి మహారాణికి భయముతీఱెను. దేవతామూర్తివలె ఆమె ఆకసమునుండి భూలోకమును విలోకింప సాగినది. ఇప్పుడు ఆమెకు కండ్లు తిరుగుట లేదు. అంతకంతకు ఈదృశ్యము ఆమెను ఆనందపూరితను గావించెను పర్వతములును మహా వృక్షములును నలకలవలె కానవచ్చుచుండెను. నదులును ఏళ్లును చాఱికలవలె నయ్యెను. జివ్వు జివ్వున విమానము పోవుచుండెను. చక్కని యీ గాలిచేతను విమానపు వేగముచేతను శ్రాంతయై దేవి నిదురించెను. కొంత సేపటికి మేల్కొని ఇప్పుడు మనమెచ్చట నున్నాము?

లలిత—ఇంకనైన ఇంటికి చేర్పుము.

ప్రేమ—వాయు సముద్రములో నాలుగుమైళ్ల ఎత్తున. కొలత యంత్రమును జూడుఁడు. నీటిలోని లోతువలెనే వాయువులోని ఎత్తును దీనివలనఁ దెలియును.

లలిత—ఇప్పుడీ విమానము ఎంత వేగముతో నడచుచున్నది.

ప్రేమ—గంటకు నూరుమైళ్ల చొప్పున. అయినను నడచుచున్నట్లే లేదు. దిగువను జూచునప్పుడు మాత్రమే నూరుమైళ్ల వేగముతో భూదేవి పరిగెత్తుకొని పోవుచున్నట్లు కానఁబడును.

లలిత—ఇంకనైన విమానమును ఇంటికి మఱలింపుము. నేను క్రిందికి చూడలేను. భయమగుచున్నది.

ప్రేమ—ఇచ్చట దిగి ఈశ్వరుని సేవించి పోవుదము. విమానము క్రిందికి దిగుచున్నది.

లలిత—ఏ యీశ్వరుఁడు.

ప్రేమ—జగన్నాథము లోని మొండిజగ్గడు. మన మిప్పుడు జగన్నాథము చేరినాము.

లలిత—నీ కెట్లు తెలియును ?

ప్రేమ—ఈ దిక్సూచనివలన. విమానమిప్పుడు నేలను సమీపించినది. స్వామి యాలయమున కెదుట దీనిని దింపుచున్నాను.

లలిత—దేవునకు కానుక లేవియు మనము తేలేదే ?

ప్రేమ—నేను తెచ్చితిని. అమూల్యములైన దక్షిణావర్త శంఖములును ముత్యములును పవడములు నాకడనున్నవి.

జగన్నాథములోని దేవాలయము నెదుట గరుడపక్షి నేలకు వ్రాలినది. విమానము అచ్చట దిగఁగానే యందలి వారలకు అద్భుతముకలిగెను. ప్రత్యక్ష నిదర్శనముగా దేవలోకమునుండి దేవతలు స్వామి యారాధనకు దయచేసిరని వారు తలంచిరి. లలితయు ప్రేమవతియు కానుకలు చేఁబూని యా విమానము దిగిరి. ప్రేక్షకులు వారికి సాష్టాంగ మొనర్చిరి. ఇంట నిదురించుచున్న గుడి పూజారి ఆత్రముతో పరువెత్తి వచ్చెను. గరుడ విమానమును జూచి పూజారి భయముతో వారికి సాష్టాంగమొనర్చి వారు విష్ణులోకమగు వైకుంఠమునుండి యచ్చటకువచ్చిన దేవతలే యని తలంచి "వైకుంఠవాసులకు స్వాగతము" అని పలికెను. ఒకటి రెండు గంటల సేఁపు అచ్చటి పవిత్రప్రదేశము లన్నింటిని తిలకించి తాము తెచ్చిన యమూల్య రత్నములను స్వామికి సమర్పించి, మరల విమానారూఢలై లలితా ప్రేమవతులు నాఁటి సాయం

కాలము అయిదుగంటలకు తిరిగి పెద్దాపురములోని ఆ యుద్యాన వనమును జేరిరి.

ఆర్య విజయుఁడు ఆ ప్రదేశముననే హాహారావములు చేసిచేసి మూర్ఛితుఁడై పడియుండెను. దేవి రాఁగానే యాత నికి స్మృతివచ్చినది. వెంటనే దేవి యాతనిని సమీపించి "దుండగపుపిల్ల! కొంటెతనము హెచ్చినది. నిర్మించిన యం త్రమును ఒక్క సారియైన పరీక్షింపక మహారాణితోనే సాహ సమునకు తెగించినది." అని పలికెను.

హీనస్వరముతో ఆర్యవిజయుఁడు "బాలిక కావున చపలతకు క్షమింపవలెను. ప్రకృతి శాస్త్రమర్మము లన్నియు జీర్ణమై యీపిల్ల గర్భమునందున్నవి. ప్రకృతియందైనలోపము కలుగవచ్చునుగాని యీమె నిర్మాణములందు అట్టివి యుండ లేవు. మనకండ్ల కిది పసిబిడ్డగాని నిజముగా నీమె భూలోకము నుద్ధరింప నవతరించిన ఈశ్వరుని జ్ఞానలేశము." అని పలికెను.

లలిత—ఈబిడ్డ ప్రతిభ నాకుఁ దెలియును. కాని దీనియంత్ర నిర్మాణమునకు నా కిదియే ప్రథమానుభవము. క్షణములో జగన్నాథయాత్ర చేసివచ్చితిమి." అని పలుకుచు మహారాణి దేవతా ప్రసాదమును గురువుగారికి ఒసఁగి ప్రేమ వతిని గాఢముగాఁ గౌఁగిలించుకొని ముద్దిడుకొని "బిడ్డా! ఇట్టి దుండగము లెన్నఁడును చేయవుగదా."

ప్రేమవతి "నాకొక్క కోరికగలదు. తమరు దానికి అంగీకరింపవలెను.

లలిత—సముద్రములలోఁ బడి గనులు వెదకుటకా?

ప్రేమ—కాదు. మఱియొక చిన్నదూరము పోవలె

నని యున్నది. తేఁపటి యుదయమున కాశికిపోయి గంగా స్నానముచేసి, పిమ్మట ప్రయాగలో త్రివేణీ స్నానముగావించుకొని పిమ్మట గయలో ఫల్గునీ స్నానమాచరించి పితృక్రియలు నిర్వర్తించి మధ్యాహ్నమునకు తిరిగివత్తము. నా తల్లిదండ్రులకు తిలోదకములు విడువవలెనని నాకు కోరికగలదు.

లలిత—ఈశ్వరానుగ్రహముచేత నేఁటికి ప్రమాదము లేకుండ బయటఁ బడితిమి. ఇట్టి చిన్న దూరములిఁక చాలును. నాకు రాజ్య వ్యవహారములు లేవా?

ప్రేమ—గురువర్యునిచే యంత్రపరీక్ష చేయింతుఁడు. మీకు ధైర్యము కలిగిననే యీ యాత్ర చేయవచ్చును. మంత్రీంద్రుఁ డున్నాఁడు. ఇంతలో మునిఁగిపోయెడు నాకు తెలియని రాజ్యతంత్రము లేవియు లేదు.

అర్క విజయుఁడా యంత్రముగు బరీక్షించి మెచ్చుకొనెను.

అర్క—నేనుగూడ మీతో వచ్చెదను. నేను ఎన్నఁడును తలంపని శాస్త్ర మర్మములుగూడ ఇందు సిద్ధించినవి. లోకములో నెన్నఁడును సిద్ధింపఁగూడని ప్రమాదములకుఁ గూడ నిందు ప్రతిసాధనము లమరినవి.

ప్రేమ—పురోహితులను, పరిచారికలను కానుకలను ఆహారాదులను గూడఁ వెంటనే చేర్చుకోవలెను.

అర్క— ఇందు అంత చోటెక్కడ నున్నది?

ప్రేమ—ఈ విహంగముమీఁద మున్నూరు మందికి తావు గలదు. ఆ తేఁకులను అమర్చి అందు రాణిగారికిని తమకును ఒక్కొక్క కూటమును, అట్లే యితరులకు తగువసతిని

భూమ్యాకర్షణశక్తి లోనుగాకుండ అప్రమాదముగా కల్పింప వచ్చును. పుష్పక విమానమువలె నెందఱెక్కినను ఒక్కరి కింకను తావుండునట్లు మున్నూర్గురు యాత్రికులకు దీనిని ఉద్దే శించితిని.

ఆర్య— తెల్లవాఱక మునుపే ప్రయాణమునకు కూర్చు కొనుటకు వ్యవధి కలదా ?

ప్రేమ— నేను ముందే అన్నింటిని అమర్చి పెట్టు కొంటిని. ఆ భయములేదు. పురోహితుని పరిచారికలను దెచ్చుట్ట మీవంతు. కానుకలతోఁగూడ మిగిలినదంతయు నావంతు.

ఆర్య— మనము ఎన్నిగంటలకు బయలుదేఱవలెను ?

ప్రేమ— తెల్లవాఱు జాముస శుక్రోదయము వేళకు.

లలిత— కాశీపట్టణము ఎప్పుడు చేరఁగలము ?

ప్రేమ— ఉదయము ఎనిమిది గంటలకు. అందు పంచ గంగలు తీర్చుకొని విశ్వేశ్వరాదులను దర్శించి తొమ్మిది గంటలన్నరకు ప్రయాగ చేరుదుము. అందు త్రివేణీ స్నాన మును బిందుమాధవ దర్శనమును చేసి పదునొకండు గంట లకు గయ చేరుదుము. మూఁడు గంటలకు గయలో బయలు దేఱి ఏడుగంటలకు తిరిగి యిచ్చటికి చేరఁ గలము.

ఆర్య— ప్రతిచోట తీర్థశ్రాద్ధములు గూడఁ బెట్టవలదా?

ప్రేమ— ప్రతిదినమును గూడ శ్రాద్ధము పెట్టవచ్చును. శాస్త్రమున కేమి లోపము ! కాని గయాశ్రాద్ధ మొక్కటియే నేను ఊహించినది. లేనిచో ఈ ప్రయాణము మూఁడునా ళ్లగును.

లలిత—ఇప్పటికి గయాశ్రాద్ధముతో సరిపుత్తము. శాస్త్రోక్తముగా వ్యవహరింప వలయునేని ఒక్క కాశిలోనే తొమ్మిది నెలల తొమ్మిది దినముల, తొమ్మిది గడియల, తొమ్మిది విగడియ లుండవలెను.

ఇట్లు లలితాదేవి వాయు విహారములనుగూడఁ బ్రారంభించెను. ఒక్కనాఁడు బదరికాశ్రమ ప్రాంతభూములు వీరు సేవించిరి. బదరి, కేదారము, గంగోత్రి, యమునోత్తరి, పంచ ప్రయాగలు, కైలాసమును ఒక్కదినములో ముగిసినవి. ఒక నాఁడు కాశికేగి గంగను తెచ్చి నాఁటి పొద్దున తొమ్మిది గంటలకు రామేశ్వరమున రామలింగస్వామికి అభిషేకముచేసి సాయంకాలమునకు మఱల ఊరుచేరిరి. ఇట్లు సమస్తయాత్ర లును వీరు సేవించిరి. ఇంతలో ఆర్షవిజయుఁడు తలపెట్టిన విమానము దేవికి చేరెను. కాని ప్రేమవతి నిర్మించిన విమాన పు టలవును అందమును దానికి పొసఁగలేదు.

ప్రేమ—దేవీ! తమకొక విమానము సిద్ధమైనదిగావున నా విమానమును ప్రజల కిచ్చివేసెదను.

లలిత—ఎవ్వరికి ఒసఁగుదువు.

ప్రేమ—హరిద్వారమునుండి హిమాలయ యాత్రలు చేయువారు చాలకష్టములు పడుచున్నారు. తమరొక వైమాని కుని దయచేసినయెడల ఈ విమానము సర్వదా యాత్రికుల కొఱకు వినియోగించెదను.

లలిత—ఆట్లేచేసెదను మఱి నీకీ విమానమక్కఱలేదా.

ప్రేమ—అనుభవము గలిగినది కావున నింతకంటె మంచి విమానమునే నేను నిర్మించుకొనఁ గలను.

లలిత—ఎట్టి విమానమును నిర్మింతువు ?

ప్రేమ—విహంగ గర్భమునందలి స్థలమంతయు వ్యర్థముగా పోవుచున్నది. కాబట్టి పక్షి కడుపులోనే మనము ఉండునట్లు చేయఁదలఁచితిని. మఱియు నేలఁబడినను ప్రమాదము పొఱయకుండునట్లు దానిచుట్టును ఘాత నిరోధకములగు తీగెల నిర్మింతును.

లలిత—జలమందును స్థలమందును గూడ విహరింపఁ గల యేకయంత్రమును నిర్మింపలేవా ?

ప్రేమ—దానికేమి కష్టము ? కాని ఒక్క నిబంధనము నకు మీరు అంగీకరింపవలెను మీ కట్టి యంత్రమును నేనే చేసిపెట్టుదును—నాకు గనులను గనిపెట్టుటకు అనుజ్ఞ నొసగిన యెడల.

లలిత—ఎన్నటికిని నీ పట్టుదలను మానవుగదా ?

ప్రేమ—యంత్రమును చూచియైన నా సమర్థతను ఒప్పుకొని అనుజ్ఞనిండు.

లలిత—యంత్రమును నిర్మింపుము. తరువాతి మాట చూచుకొందము.

ప్రేమ—మీ రెప్పుడును ఇంతే. పసివాండ్రమ ముచ్చట తీర్చుదమన్న కోరిక మీకులేదు. పోనిండు. యంత్రమును చేసి ఇత్తును లెండు.

దినములు గడచిపోవు చుండెను. జల గర్భమునను వాయు మధ్యమునను గూడ సంచారము చేయఁగల యంత్రమును రాణికి నిర్మించుటయందు ప్రేమవతి నిమగ్నయై యుండెను. ఒకనాఁడు మహారాణి ప్రేమవతితోఁ గూడ

ప్రకృతి నిలయములోని స్త్రీశాఖను దర్శించి బహుమతు లొసఁగు చుండెను. అప్పుడొక బాలిక రాణి యొసఁగిన బహు మానము తన కక్కఱ లేదని నిరాకరించెను.

లలిత—ఈ బహుమతిని నిరాకరింపుమని నీ కెవ్వరు బోధించినారు?

బాలిక—ఎవ్వరును బోధింప నక్కఱలేదు. ఇది తీసి కొనరాదని నాకే తెలియును.

లలిత—ఎందువలన?

బాలిక—ఇది ప్రకృతి నిలయము. మానవోపయుక్త ములై సూక్ష్మములో మోక్షమ్మును గూర్చు సద్భుతోప కరణములను మాకిచ్చుట సమంజసము.

లలిత—ఇట్టి సమయమున నీవిట్లు మసలుట అవిధే యత గాదా!

బాలిక—ఆమాట నిజమే. కాని ఏలినవారి దర్శనము లభించుటకు పేద బాలికలకు ఇంతకంటె సమయమెట్లు దొరకును?

ప్రేమ—నా నూతన విమానమందు అట్టి వెన్నిటినో నిర్మించి యుంచితిని. వానినిగూడ దేవిగారు ఈ బాలికలకు పంచిపెట్టవలెను.

బాలిక—ప్రకృతి రహస్యములు మానవోప యోగ ములగుపద్ధతినే వానిని చేసితిరా?

ప్రేమ—పరీక్షించి చూచుకొమ్ము నీ కిష్టమువచ్చిన దానినే తీసికొనుము.

బాలిక—మహాభాగ్యము.

ప్రేమ—(పదార్థములు తెప్పించి)-బాలికా! నీకు రాణిగారు అగ్ర బహుమానము నిచ్చుచున్నారు ఇది వన్నెల విసనకఱ్ఱ.

బాలిక—దీని ప్రయోజనమేమి ?

ప్రేమ—ఇప్పుడిది విసనకఱ్ఱ. విడఁదీసినయెడల అన్ని గృహోపకరణములు ఇందున్నవి. సూదులు, కత్తులు, బట్టలు అలవేసికొను, తీఁగలు, ఆకుఱాయి, సుత్తె, ఆడకత్తెర, కత్తెర, అంపము, ఉలి, కొలబద్ద, కదురు, కండె, గాలము, వండుకొను ప్రొయ్యి, విల్లు, అమ్ములు, వింటినారి, శూలము మున్నగునవి యిందు చాలఁగలవు. దీనితో వేటాడవచ్చును. బట్టలు నేయవచ్చును. వడ్రము, కమ్మరము, కంసాలిపని చేయవచ్చును శత్రువులతో యుద్ధము నొనరింపవచ్చును. ఒక్కదీనిని కొనిపోతిమేని ఇది దృఢమైన నలుబదినాల్గు పరికరముల పెట్టు.

బాలిక దానిని వందనములతో నంగీకరించెను, "కాని ఉత్తమ శాస్త్రజ్ఞానము ఇందు వినియోగింపఁ బడలేదు."

ప్రేమ—పని బాలికలకు ఇంతకంటె అర్థమగునది యెట్టిదై యుండవలెను ?

బాలిక—మా బహుమతులను చూచిన వారందఱును ప్రకృతిదేవి యుపాసనకు పూనుకొనురీతి ఉద్బోధము కలిగించునవి కావలెను. ప్రకృతి నిలయమున కిది విధి (అని వెడలిపోయెను,)

ప్రేమ—పోనిమ్ము ఈ పటమునుగూడఁ దీసికొమ్ము ఇందైన కొంచెము శాస్త్రసారము ఉన్నదా ?

బాలిక—(చూచి) నావంటి వారికి ఇందలి జ్ఞానము చాలును. ఇప్పుడు ముప్పదులు, ఏఁబదులు పోసి పాకయంత్రములు కొను వ్యామోహములోఁబడి యున్నవారి కిది చక్కని యంత్రము. పెద్దగిన్నెలో అడుగున నీరుపోసి, ఏ బాణలినో, ఏ గిన్నెనో బరువుగా దాని పైన బోరగించినయెడల, మసలుచున్న నీటి ఆవిరి వెడలిపోవ దారిలేక ఆ గిన్నెలోనే చుట్టు తిరుగుచుండును. అందు ఒకపెద్దగిన్నెలో బియ్యము, ఒకదాన పప్పు, ఒకదానిలో కూర—వేసి ఇట్లు ఎన్నింటిని వండఁదలఁతురో అన్నింటికి అన్నిగిన్నెలలో చేర్చి మూసినయెడల లోపల చుట్టుచున్న యావిరికి అన్నియు ఉడుకును. బియ్యపు గిన్నెలోని బియ్యమునకు మూఁడుపాళ్లు నీళ్లు చేర్చినయెడల అత్తెసరగును. కూరలుడుటకు నీళ్లక్కఱలేదు. ఈ కిటుకు తెలియని మనవారి నుండి పాకయంత్రమని పేరుపెట్టి పరులు ధనమును పెరుకుకొని పోవుచున్నారు. పెద్దగిన్నెలో ఇముడు చిన్నగిన్నెలు లేని యిల్లు ఈలోకములో లేదు. ఇదిమంచి బహుమానమే.

ప్రేమవతి యెన్నెన్ని బహుమానములనో రాణిచేత బాలికలకు ఇప్పించినది. మా పాఠకుల కిదియే యొకసమస్య లోకోప యుక్తములగు నెట్టి పదార్థములు అట్లు సృష్టింపఁబడి యుండునో బుద్ధిమంతులు తామే ఊహించుకొందురు గాక,

బహుమానములు ముగిసినవి. ప్రేమవతి నీటను గాలిలోనుగూడ సంచరింపఁగల విమాన జలాంతర్గామినిని రాణిగారికై నిర్మించుటయందు నిమగ్నమైయుండెను. ఒకనాఁడు రాణియు, ఆర్య విజయుఁడును ప్రజలలో నొక్కసారిగా గుప్పున

ప్రేమ—(పదార్థములు తెప్పించి)-బాలికా! నీకు రాణిగారు అగ్ర బహుమానము నిచ్చుచున్నారు ఇది వన్నెల విసనకఱ్ఱ.

బాలిక—దీని ప్రయోజనమేమి?

ప్రేమ—ఇప్పుడిది విసనకఱ్ఱ. విడఁదీసినయెడల అన్ని గృహోపకరణములు ఇందున్నవి. సూదులు, కత్తులు, బట్టలు ఆఱవేసికొను, తీఁగలు, ఆకుఱాయి, సుత్తె, ఆడకత్తెర, కత్తెర, ఱంపము, ఉలి, కొలబద్ద, కదురు, కండె, గాలము, వండుకొను ప్రొయ్యి, విల్లు, అమ్ములు, వింటినారి, శూలము మున్నగునవి యిందు చాలఁగలవు. దీనితో వేటాడవచ్చును. బట్టలు నేయవచ్చును. వడ్రము, కమ్మరము, కంసాలిపని చేయవచ్చును శత్రువులతో యుద్ధము నొనరింపవచ్చును. ఒక్కదీనిని కొనిపోతిమేని ఇది దృఢమైన నలుబదినాల్గు పరికరములపెట్టు.

బాలిక దానిని వందనములతో నంగీకరించెను, "కాని ఉత్తమ శాస్త్రజ్ఞానము ఇందు వినియోగింపఁ బడలేదు."

ప్రేమ—పని బాలికలకు ఇంతకంటె అర్థమగునది యెట్టిదై యుండవలెను?

బాలిక—మా బహుమతులను చూచిన వారందఱును ప్రకృతిదేవి యుపాసనకు పూనుకొనురీతి ఉద్బోధము కలిగించునవి కావలెను. ప్రకృతి నిలయమున కిది విధి (అని వెడలిపోయెను,)

ప్రేమ—పోనిమ్ము ఈ పటమునుగూడఁ దీసికొమ్ము ఇందైన కొంచెము శాస్త్రసారము ఉన్నదా?

బాలిక—(చూచి) నావంటి వారికి ఇందలి జ్ఞానము చాలును. ఇప్పుడు ముప్పదులు, ఏఁబదులు పోసి పాకయంత్రములు కొను వ్యామోహములోఁబడి యున్నవారి కిది చక్కని యంత్రము. పెద్దగిన్నెలో అడుగున నీరుపోసి, ఏ బాణలినో, ఏ గిన్నెనో బరువుగా దాని పైన బోరగించినయెడల, మసలుచున్న నీటి ఆవిరి వెడలిపోవ దారిలేక ఆ గిన్నెలోనే చుట్టు తిరుగుచుండును. అందు ఒకపెద్దగిన్నెలో బియ్యము, ఒకదాన పప్పు, ఒకదానిలో కూర—వేసి ఇట్లు ఎన్నింటిని వండఁదలఁతురో అన్నింటికి అన్నిగిన్నెలలో చేర్చి మూసినయెడల లోపల చుట్టుచున్న యావిరికి అన్నియు ఉడుకును. బియ్యపు గిన్నెలోని బియ్యమునకు మూఁడుపాళ్లు నీళ్లు చేర్చినయెడల అత్తిసరగును. కూరలుడుటకు నీళ్లక్కఱలేదు. ఈ కిటుకు తెలియని మనవారి నుండి పాకయంత్రమని పేరుపెట్టి పరులు ధనమును పెరుకుకొని పోవుచున్నారు. పెద్దగిన్నెలో ఇముడు చిన్నగిన్నెలు లేని యిల్లు ఈ లోకములో లేదు. ఇదిమంచి బహుమానమే.

ప్రేమవతి యెన్నెన్ని బహుమానములనో రాణిచేత బాలికలకు ఇప్పించినది. మా పాఠకుల కిదియే యొకసమస్యలోకోప యుక్తములగు నెట్టి పదార్థములు అట్లు సృష్టింపఁబడి యుండునో బుద్ధిమంతులు తామే ఊహించుకొందురు గాక,

బహుమానములు ముగిసినవి. ప్రేమవతి నీటను గాలిలోనుగూడ సంచరింపఁగల విమాన జలాంతర్గామినిని రాణిగారికై నిర్మించుటయందు నిమగ్నమైయుండెను. ఒకనాఁడు రాణియు, ఆర్ష విజయుఁడును ప్రజలలో నొక్కసారిగా గుప్పున

ప్రకృతి శాస్త్రములపై ఉత్సాహము చెలరేఁగుటకు పెద్ద యాందోళనము గావింపవలయుననియు, తద్విధానములు నిర్ణయింపవలెననియు దేశమునంతను ప్రకృతిచర్చా సముద్ర తరంగములలో ముంచి వేయుటకు సాధనములను గనిపెట్టవలెననియు ప్రసంగించుచుండఁగా ప్రతీహారియొక్కఁడు ప్రవేశించి.

"మహారాణి గారికి జయమగునుగాక! ప్రేమవతిగారు నలువురు చెలికత్తెలతో సముద్ర విహారముచేయుచు నందు మునిఁగిపోయినారు. రెండునాళ్లనుండి కానవచ్చుటలేదు." అని పిడుగువంటి యొక వార్తను వెల్లడించెను.

ఆర్య విజ—ఎప్పుడు?

ప్రతీహారి—రెండు దినములైనది. ప్లుత మనోహారిణులతో నీట మునిఁగినవారు మఱల తేలలేదు. ఏ యూబిలో పూడికొని పోయిరో, ఏ సొఱచేఁపలచే కబళింపఁబడిరో తెలియకున్నది.

ఆర్య వి—వారిని వెదకు ప్రయత్నములు జరుగలేదా?

ప్రతీ—మన జలాంతర్గాములును ప్లుత యంత్రములును చుట్టుపట్ల ఇన్నూరుమైళ్లదాక సముద్రమంతయు గాలించెను. ఎందును వారిజాడ గానరాలేదు.

ఆర్య వి—వాయు సంచారము చేయుచున్నారేమో?

ప్రతీ—వాయు విమానములన్నియు అందేయున్నవి. మొన్నటికి విమానజలాంతర్గామిని పూర్తియైనది. దానిని రాణి గారికి సమర్పింప ప్రేమవతిగారు ఆరాటపడుచుండిరి.

"హా! పరమేశ్వరా?" యని లలితా మహాదేవి మూర్ఛితయై నేలఁబడి పోయెను.

# నాలుగవ ప్రకరణము.

## ఆర్ష తీర్థుని సిద్ధాంతము.

ఆర్ష శకాత్పూర్వము 18-1-117 సంవత్సరమున ఆర్షుల పూర్వ జగద్గురువగు ఆర్ష తీర్థుఁడు ప్రపంచమున కొకనూతన సిద్ధాంతమున వెల్లడించెను. ప్రజలలో ప్రకృతి శాస్త్రములనే ఐహికాముష్మిక ధర్మములుగాఁ జేయుట యాతనిపని. అందు లకై అతి విప్లవ హేతువులవలన విస్తార జననష్టములేనిచో ప్రపంచములోని జనసంఖ్య నూరేండ్లలో రెట్టింపుగా పెరిగిపోవు నని ఆతఁడు ఒక సిద్ధాంతమును బోధింప నారంభించెను. దానికి పండితోత్తముఁడగు నిశ్శంకయోగి ఇట్లు వ్యాఖ్యా నము చేసెను.:—

ఆది మానవులుగా స్వాయంభువుమనువును నాతని భార్యయు పరమాత్మచే మేరుపర్వత ప్రాంతములందలి యిలా వృత వర్షమున సృజింపఁబడిరని—ఆర్ష తీర్థులవారి మతాను సారముగా వారి సంతతి యిట్లు పెరిగినదని :—

| | | సంఖ్య |
|---|---|---|
| (1) | మొదటి మానవులు (ఆలును మగఁడును) | $2^1 = 2$ |
| (2) | 100 ఏండ్లకు $100 \times 1 =$ | $2 \times 2 = 2^2 = 4$ |
| (3) | 200 ఏండ్లకు $= 100 \times 2 =$ | $2 \times 2 \times 2 = 2^3 = 8$ |
| (4) | 300 ఏండ్లకు $= 100 \times 3 =$ | $2 \times 2 \times 2 \times 2 = 2^4 = 16$ |
| (5) | 400 ఏండ్లకు$=100 \times 4=$ | $2^5=32$ |
| (6) | 500 ఏండ్లకు$=100 \times 5 =$ | $2^6=64.$ |

ప్రకృతపు జనాభా లెక్కలనుబట్టి ప్రపంచములోని జనసంఖ్య తెలిసినచో మానవోత్పత్తి కాలము నిర్ణయింపఁబడనగునని.

నిశ్శంక యోగీంద్రుని వ్యాఖ్యానమును దుశ్శంక గురువర్యుఁడు తీవ్రముగా ఖండించెను: అతివిప్లవ హేతువులను నిశ్శంక యోగీంద్రుఁడు గమనింపలేదని.

"సూర్యునిలోని మచ్చలు పండ్రెండేండ్ల కొకసారి మాఱును. ధ్రువ ప్రాంతములోని విద్యుద్రేఖలు పండ్రెండేండ్ల కొకసారి మాఱును. భరతవర్షములో పండ్రెండేండ్ల కొకసారి కఱవుల వలన అత్యంత జన విప్లవము సంభవించును. యుద్ధములు, మహామారివంటి వ్యాధులు, భూ కంపములు, మున్నగునవి లేనిచో నిశ్శంకుని లెక్కలు సరియగునుగాని, లేనిచో కానేరవు. కాఁబట్టి నిశ్శంకుఁడు పదేండ్లలో సిద్ధించు నను దానిని మనము వేయియేండ్లలో సిద్ధించు ననుకొన్నను తప్పులేదు."

వ్యాఖ్యానములపై వ్యాఖ్యానములు పెరిగిపోయినవి. ఆర్ష తీర్థుని జనసంఖ్య సిద్ధాంతము లోకమంతటను వ్యాపించినది. తోడనే బుద్ధిమంతుల హృదయములందు ఆందోళనము హెచ్చెను—ఎన్నఁడో ఒకనాఁడు ఉన్న భూమి యంతయు మనుష్యాకీర్ణమైనచో నింక పొలములకును పంటలకును తావెక్కడనని? అన్ని దేశములందును నిది యేఁవిచారణీయాంశ మయ్యెను: తుదకు మనజాతి యొకనాఁడు తిండికిలేక మరణించునని. కోటానుకోట్ల యేండ్ల పిమ్మట రానున్న ఈ దుర్గతిని నివా

రించుటకై యిప్పుడే ఆలోచనలు ఆరంభమైనవి. మనుష్య జాతి యెప్పుడును అతిజాగరూకత కలదిగదా.

ఏలేశ్వరోపాధ్యాయుల వారు ఇట్లు ప్రకటించిరి:—ప్రళయము శాస్త్రదృష్టము. శాస్త్రములు ప్రళయకాల మొక్కటి వచ్చుననుట కిదియే నాని యాధారము. దీనికి తిరుగులేదు. మానవ జాతి ఆనాఁడు ప్రమగ్గి పోవలసినదే.

ఈ వ్రాఁతలకు హిందూమత సంస్కార సమాజము వారు కోపించిరి. మన పూర్వులకు ఏమియుం దెలియదు. వారు ద్వాదశాదిత్యులను, ఏకాదశ రుద్రులను, ప్రళయాగ్నులను, బడబమనెడి ఉప్పు నీటిగుఱ్ఱపుం బిల్లను—వేనిని వేనినోసృష్టించుకొనిరిగాని ఆర్షతీర్థుల సిద్ధాంతము వారికి తెలియనే తెలియదు. ఆదికాలమున ఫలాహారమే నైజముగాఁ గల మానవ జాతి కొన్నాళ్లకు శాకాహారియైనది. తరువాత పైరుపంటలు లేని ఎడారులలోను, అడవులలోను, శీతలదేశములలోను బడి జంతు భక్షణ కారంభించినది. పంటలులేక ఆఁకలిపోక ఆత్మారాముఁడు అల్లాడునప్పుడు ఆపద్ధర్మములు లేవా? బలవంతులచేత బలహీనులు నశింతురు. జెరుసలేము ముట్టడిలోనేమి జరిగినది? విశ్వామిత్రుఁడు కఱవు కాలమున నేమాపద్ధర్మ మవలంబించెనో మనకుఁ దెలియదా.''

నాగర భజనసంఘమువారి కీవ్రాఁత భయంకరముగా తోఁచెను. ''ముందు ముందు మనుజులు మనుజులనే భ్రమింగెదు రాక్షసులగుదురను మాట సత్యమే. దాని లక్షణములు నేఁడును కానవచ్చుచున్నవి. బలహీనులు బలవంతులచే నశించుచున్నారు. కాఁబట్టి జనాభివృద్ధిని నిరోధించుచు, ధర్మ

పథము చెడకుండునట్లు ఇప్పుడే తగిన కట్టుబాట్లు చేయ వలెను.''

పోతులూరి వీరబ్రహ్మ యోగీంద్రులు దీని నామోదించి యిట్లువ్రాసిరి. ''జనాభివృద్ధిని నిరోధించుట, ధర్మ పథము నిలుపుట-ఇవి చక్కని మాటలే. భరతవర్షములో ఊహల కేమి తక్కువ! సముద్ర తీరమున ఇసుక రేణువులున్నవి; సముద్రములో అసంఖ్యాకములైన జలకణములున్నవి. భరతవర్షములో శుష్కములైన యూహలు ఉన్నవి. కాని కార్యమునకు దిగినచో తోడుపడు నాథులు మనకు సున్న. తప్పులు మాత్రమే ఎన్ని కార్యనాశముచేసి సంతసించువారు తండోప తండములు. భరతవర్షము వారు బుద్ధివిశాలురు, కాని శుద్ధ భీరువులు, అన్యోన్య నాశమును గూర్చుటలో ప్రబుద్ధులు. ఈ దేశము సత్ప్రయత్నములకు మారణభూమి! స్వనాశ సర్వనాశ సూత్రములకు ఆయువుపట్టు! అయ్యో! ఈ భరతవర్షమా! తగుమనని యిట్టి సమస్యలను విచారింప దొరకొనుట ! ఆ వీరభోగవసంతరాయలవారు అవతరించుదాఁక మనగతి యింతే.''

ఈ వ్రాఁతలకు కోపించి దాష్టీక పంతులు ప్రహసన మొక్కటి యాడెను. శరభ సాళ్వలవారు సింహమువలె గర్జించిరి. పరంజ్యోతి ప్రభువు ఇట్టి పలుకుల నెవ్వరును వ్యాపింప రాదని పలుకుచు తీవ్ర ప్రచారమారంభించెను. ఆ వెనుక కొంత కాలమునకు తీవ్రత యణఁగినది. శాంతముగా నాలోచించి జనవృద్ధి నిరోధక మార్గములు సూచించు దశవచ్చినది. పెద్ద లొక్కొక్కరే తమతమ యభిప్రాయములను వచింప సాగిరి.

చిదానంద యోగి—ఎల్లరును ముప్పదేండ్లు రాఁగానే

సన్యసింప వలెను. పిమ్మట పురుషులందఱును దండకారణ్యము నకును స్త్రీలందఱును ఆఁడు మళయాళమునకును బోవలెను.

వంశవర్ధన తీర్థులు—ముప్పదేండ్లు కాదు. ఒక్క కుమారునిఁ గని సన్యాసము.

రాజయోగి—ఒక్క కుమారుని కనిన పిమ్మట యోగియై గృహమున నుండవచ్చును. సన్యసింప నక్కఱలేదు. దృఢహృదయులయి బ్రహ్మచర్య వ్రతము నవలంబింప వలెను.

ఏక వివాహారాధ్యుఁడు—అంతదూర మనవసరము. స్త్రీలకుఁగాని పురుషులకుఁగాని ఒక్క వివాహమే శాస్త్రీయము. పునర్వివాహములు సర్వత్ర త్యాజ్యములు. ఇదియే జన సంఖ్యను తగ్గించును.

రాజసప్రధాని—అతి బాల్య వివాహములు మనకు ఇది వఱకే యున్నవి. క్రమక్రమముగా బలహీనతపెరిగి భరతవర్షీయులకు అవి స్వర్గముకూర్చును. ఇఁక సంఖ్యాభివృద్ధివలని భయము మనకేల ?

వేదాంత భట్టు—ఎప్పటి చావునకో ఇప్పుడే యేడు పెందులకు ? "అవశ్య మనుభోక్తవ్యం." అంత సంఖ్య పెరిగి నప్పుడు భూదేవి విష్ణుమూర్తిని వేఁడును. భూభారమును దీర్చుటకును అధర్మమును ఆపుటకును అప్పుడు కలియుగ రామాయణము పుట్టును.

ఘోటక బ్రహ్మచారి—నిర్బంధ బ్రహ్మచర్యాశ్రమములను నిలిపి వివాహితుల సంఖ్యను తగ్గింపుఁడు.

మళయాళభోగి-జ్యేష్ఠపుత్త్రుఁడే వివాహార్హుఁడు. తక్కిన స్త్రీ పురుషుల కెల్లరకు వివాహయోగ్యత మాత్రము లేదు.

కాపాలిక తంత్రసారుఁడు—క్రోధమును హెచ్చించి యుద్ధములు కల్పించి జననాశమును గూర్పవలెను.

ప్రకృతి భిక్షార్థి—భూమి నిండిపోయినచో సముద్రమున తెప్పలలో నివసించి సాముద్రిక జీవన మవలంబింపవచ్చును. కాశ్మీరములో నేమిచేయుచున్నారు ?

జాలంధర యోగి—జలాంతర్గాముల సహాయమున నీటిలోఁ గూడ జీవింపవచ్చును.

జాలవిద్యాచార్యుఁడు—వాయు విమానములలో పట్టణముల్ను నిర్మించి గాలి జీవనము చేయవచ్చును.

విశ్వకర్మ సన్యాసి—భూమిని సాఁగఁగొట్టి నీటిలోనికి లాగవచ్చును. ఆర్ష మతస్థుల జలాంతర్గాములను వాయు విమానములను తాఁకినచో పాపము వచ్చును.

అద్వైత కేసరి—ఈ ప్రపంచమే మిధ్య. అంతయు స్వప్నము. ఎందుకీ శోకము ?

బుద్ధాగముఁడు—శూన్యమునుండి జగములు వచ్చినవి. శూన్యమగుటకు జగములు పెరుగుచున్నది. అదియే మోక్షము. అదియే నిర్వాణము. దాని నరికట్టుట పునర్జన్మ హేతువు.

శంఖ ప్రబోధుఁడు—భోం భోం భోం భోం భోం భోం భోం—అర్జునునివంటి మానవులే జీవింపఁ దగ్గవారు. బలహీనులు బ్రదుకవలసిన పని లేదు. తమంత తాము చావక పోయినచో ప్రకృతి దేవత అట్టివారిని బలవంతులచే చంపించును. అదియే జనాభివృద్ధి తగ్గుటకు సత్యసాధనము.

నిట్టల ప్రకాశదాసు—శ్రీ కృష్ణులును అర్జునులును మాత్రమే జీవయోగ్యులు. పొట్టకై పరిదేవనము చేయునధమ

మానవులు ఉండియేమి ? మండియేమి ? అట్టి చెత్తను తగులఁ బెట్టుటకే ప్రళయములును, కల్క్యవతారములును వచ్చుచున్నవి. కాలగర్భములో ధర్మసంస్థాపనకు బీజములు కలవు. ఎందుకీ యాందోళనము. శాంతముగా ఎవరి పోఁగాలమును వారు కనిపెట్టుకొని యుండవలెను. ఆ రాముని మహిమ.

దేశమున నిట్లు అశాంతి ప్రబలినది. కలవరము హెచ్చినది. జనులందఱును ఈ బెంగచేతనే తల్లడిల్లుచుండిరి. అప్పుడు ఆర్ష సమాజపు కార్యదర్శియగు అమోఘవర్షుఁడు ఆంధ్రము ఆంగ్లము ఉరుసుభాషలలో నూరుపుటల యొక పత్రికలో నిట్లు ప్రకటించెను.

“ఆర్ష తీర్థులవారి జనాభివృద్ధినిఁ గూర్చిన సిద్ధాంతము మా ప్రకృతి నిలయ కార్యాలయమున శోధింపఁ బడినది. ప్రపంచ చరిత్రలవలన లభ్యములైన రెండువేల యేండ్ల జనాభా లెక్కలను మేము సమకూర్చి విచారించితిమి. యోగీంద్రుని సిద్ధాంతములోని ప్రత్యక్షరమును అమోఘమైన సత్యమునే సూచించుచున్నది. నానాఁటికి జనసంఖ్య హెచ్చి ఎప్పుడో ఒకనాఁడు ఆహారము లేని కొఱఁత మన జాతికి వచ్చుట ముమ్మాటికిని సత్యము. అందువలన మా నిలయము వారు అట్టి దుర్గతిని తొలఁగించుటకై శాస్త్రజ్ఞానము నంతను వినియోగించి అత్యంత కష్టతరములైన అపూర్వ శోధనలను ఎన్నింటినో గావించిరి. అమోఘములైన శాస్త్రీయ మార్గముల వలన నీ సమస్య భేదింపఁబడినది. మానవజాతికి ఎట్టి ప్రమాదమును రాదు. ఆహారసమస్య కలుగనే కలుగదు. ప్రకృతి శాస్త్ర సంబంధములై పరమ సత్యములై నిపుణము

లైన మార్గములవలన నీ ప్రమాదము నివారణ మగుటయే కాక ఈభూమియు సూర్యచంద్ర గ్రహాదులును ఎంతకాలము నిలుచునో అంతకాలమును మన మానవజాతియు సుఖముగా సంతోషముగా. అప్రమాదముగా ఉత్తరోత్తరాభి వృద్ధిగా నొప్పారఁగలదు. శ్రీముఖనామ సంవత్సర శ్రావణ బహుళ అమావాస్యా సోమవారమున కేతుగ్రస్త సూర్యోపరాగ సమయమున బెజవాడలోని కృష్ణాతీరమున వలసిన సమస్త యంత్రములతోను మా యధ్యక్షులు ఈ విషయమై మాటాడఁగలరు గావున ఆ బాలవృద్ధముగా నెల్లరును ఆ సమయమునకు ఆ ప్రదేశమునకు ఆహ్వానింపఁ బడుచున్నారు. భక్తులు ఉపన్యాసానంతరమున అధ్యక్షులవారి చేతినుండి తీర్థము గ్రహించి ఉచితరీతిని మా ప్రకృతి నిలయమును ఆదరింతురుగాక.

పెద్దాపురము.
శ్రీముఖ ఆషాఢ బ॥ ౨
ఆదిత్యవారము

ఇట్లు
షట్ఛాస్త్ర మహోదధి బిరుదాంచితుఁడు
అమోఘ వర్షోప ధ్యాయుఁడు,
ప్రకృతినిలయ కార్యదర్శి.”

షరా—1 ఈ పత్రిక విక్రయమువలన వచ్చు ధనమంతయు ప్రకృతి నిలయమునకు ఒసఁగఁబడును.

# ఆయిదవ ప్రకరణము.

## అధ్యక్షుని యుపన్యాసము.

అది బెజవాడలోని కృష్ణా పుష్కరముల సమయము.

పై ప్రకటనముగల పత్రికలు ఎనిమిది లక్షలు ముద్రితములై ఈ సమయమునకు బెజవాడకు కొనిరాఁబడినవి. వచ్చెడి ప్రతి బండిమీఁదను వందలకొలఁది యాత్రికులు బెజవాడ చేరుచుండిరి. సమీప ప్రదేశములనుండి ఎడ్లబండ్ల మీఁదను, మోటారుల మీఁదను, కాలినడకను, అన్య విధములను బెజవాడ చేరినవారి సంఖ్య ఎన్ని లక్షలైయుండునో ఎవ్వరును చెప్ప లేరు. అతి కష్టముమీఁద మొదట నొకపత్రిక రు 0-4-0 లకు అమ్మఁబడినది. అందలి విషయసూచిక యీక్రిందిరీతి నుండెను.

పుష్కర విషయములును ప్రకృతి నిలయమువారి వ్యాసములును గూడ సమగ్రముగా నుండుటచే నాలుగైదు పత్రికలమ్మఁబడిన తరువాత నొక పాఠకుఁడు అందలి ప్రకృతి నిలయము వారి ప్రకటనమును జనువఁ దటస్థించెను. లోక ప్రసిద్ధమైన ప్రకృతి నిలయమును ఎఱుఁగని వారెవ్వరు? విక్రయము ఒకట్లనుండి పదులైనది. పదులు నూరులైనది; వేలైనది; లక్షలైనది. నారదభ్రాతలును హరయోగ ప్రచారకులును వెంటనే భరతవర్ష మంతటను ఈ ప్రకటనను వెల్లడి చేసిరి. నాఁటి మధ్యాహ్నమున కీవార్త ప్రపంచములోని ప్రధాన పత్రికల కన్నింటికి చేరెను. పండ్రెండు దినములలో ఎనిమిదిలక్షల పత్రికలు విక్రయమయ్యెను, మంత్ర తంత్రములకు కొందఱును పుష్కర విషయములకు కొందఱును, త్రివర్ణ చిత్రములకు కొందఱును,—ఇట్టివారు పది పండ్రెండు వేలమంది యుందురు. తక్కిన వారందఱును సశాస్త్రీయములైన ప్రకృత నిలయమువారి విజ్ఞాన ప్రదములగు విషయములకే దీనినిఁ గొనుట సంభవించెను.

ప్రకటనము శాస్త్రజ్ఞుల నెల్లరను ఆకర్షించెను. భరతవర్షములోని విద్యా శాలలనుండియు, ఆస్థానములనుండియు ప్రధాన ప్రకృతిశాస్త్ర బోధకులు పెక్కండ్రు అమావాస్య నాఁటికి బెజవాడలో దిగిరి. పత్రికాధిపతులు ప్రత్యేక విలేఖకుల నంపిరి. ఛాయా పటములఁ దీయువారు కృష్ణ పొడుగు

నను దమ యంత్రముల నమర్చి యుంచిరి. చక్కని దృశ్యమును ప్రదర్శించుటకై కొన్ని ఛాయా యంత్రములు ఇంద్రకీలాద్రి శిఖరముపై నమర్పఁబడెను.

శాస్త్రజ్ఞుల సంభాషణలు సామాన్య జనులలో నుత్సాహమును పెంచెను. బెజవాడలోని యిఱుకు సందులలోఁగూడ నీ యుత్సాహము ప్రవేశించినది. ఊరంతియు జావుటాలతోను అఱటి కంబములచే నిర్మింపఁబడిన ద్వారములతోను అలంకరింపఁబడి యీ యుత్సాహమును ఇనుమడింపఁ జేసినది. "ప్రకృతి నిలయమునకు జై" "ప్రకృతి నిలయాధ్యక్షునకు జై" "స్వాగతము." "బెజవాడ పౌరులు ప్రకృతి నిలయాధ్యక్షునికి స్వాగత మొసఁగుచున్నారు"— ఇట్టి రీతివాక్యములు వన్నెవన్నెల పెద్ద యక్షరములతో ద్వారములపై చిత్రింపఁబడి యుండెను. పూల తోరణములు మామిడాకు తోరణములు, రంగు కాగిదముల తోరణములు ఊరంతటను అమర్పఁబడి యుండెను. విస్ఫుటాక్షరములతో ప్రకటన పత్రములు గోడలం దెల్లెడల ప్రకృతి నిలయము వారి యత్నములను వెల్లడించుచుండెను, ఇఁక కృష్ణాతీరము నందలి యలంకారములను చెప్పుటకును భాషచాలదు. నదీ తీరము నందలి యొక యావరణములో మూఁడు చిన్నధూమ నౌకల కొక రేవు ఏర్పఱుపఁబడెను. ఆనాఁడు అఱువది రెండడుగుల లోతుగలదై నది వాయువేగముతో ప్రవహించుచుండెను. నేఁటి ఆనకట్టకు ఎగువను నదిలో లంగరు వేయఁబడిన యొక పెద్దయోడయున్నది.అందు ప్రకృతి నిలయమువారి ముప్పదిమూఁడు దూరదర్శక యంత్రములు సూర్యుని దిక్కు

మొగముగా సమర్పఁబడి యుండెను. ప్రకృతి ఎంత ప్రళయా కారముగా గర్జించినను ప్రకృతి శాస్త్రము దానిని లొంగఁ దీయు ననుటకు తార్కాణముగా నా ప్రవాహ మధ్యమున ఆ యోడ పట్టపగలే ఆకాశమున నక్షత్రములను జూపుచున్నది. నదీతీరమున నొక చిన్న విద్యుద్యంత్రము పనిచేయుచున్నది. దాని సమీపమున నిరువది యడుగుల పొడుగుగల రెండు ఉక్కు స్తంభములు పాఁతబడినవి. ఈ స్తంభములు రెండును శిఖరముననను నేలనుగూడ ఇనుప కజ్జీలచే చేర్పఁబడినవి. ఈ నాలుగు ఇనుపకజ్జీల నడుమను భూమికి పదియడుగుల యెత్తున ఏ యాధారమును లేకయే ఉక్కుతోఁ జేయఁబడిన యొక యుపన్యాస వేదిక అలంకృతమై అంతరాళమున పక్షివలె నిలిచియుండెను. గట్టున నొక వాయువిమానము ప్రవాహము పైన ఎగురుటకు సిద్ధముగానున్నది.

ఊరంతటను కొన్ని పత్రికలు పంచిపెట్టఁబడినవి. భూమికిని సూర్యునకును నడుమ చంద్రుఁడు అడ్డమువచ్చుట చే నీ సూర్యగ్రహణము కలిగెననియు ఈ దృశ్యమే ఆకసమున దుర్భిణి యంత్రముతోఁ జూడవచ్చుననియు ఆయాయి వినోద ములను చూచుటకు ఈ క్రింది రేట్లు నిర్ణయింపఁ బడినవనియు నందుఁ సమగ్రవర్ణనలతో ప్రకటనలు ఉండెను.

| | |
|---|---|
| 1. వాయు విమానముమీఁద నెక్కి యంత్రముల యోడకు పోయివచ్చుటకు | రేట్లు 2-0-0 |
| 2. ధూమ నౌకలమీఁద నచ్చటికేగి వచ్చుటకు | 1-0-0 |

3. సుస్నాతులైన హరిజనులవలన కృష్ణానదినుండి

రజతపాత్రలలోఁ దేఁబడి ఆర్ష తీర్థులవారిచే సువర్ణ
పాత్రలతో అభిషేకము చేయఁబడిన తీర్థ సేవకు 0-1-0

షరా :—గ్రహణ కాలమున పై రేట్లు రెట్టింపగును.

లక్షలాది జనులు నదీతీరమునకు వచ్చియుండిరి. తడవకు ముప్పదిమంది మాత్రమే దూరదర్శక యంత్రముకడకు కొని పోఁబడుచుండిరి. వాయువిమానారోహకులు అప్రమాదములైన కుర్చీలలో కప్పీలమీఁద ఓడలోనికి దింపఁబడుచుండిరి. దిగువను భయంకరముగా కృష్ణాస్రవంతి ఇరుదరులను ఒరసికొని పూర్ణ ప్రవాహముతో మృత్యుదేవతాస్వరూపముదాల్చి ప్రవహించు చుండెను. ప్రేక్షకులు ఆనాఁడు ఉదయమునుండియు నిర్మలాకాశములో యంత్ర సహాయమున చంద్రదర్శన మొనర్చు చుండిరి. ముప్పదిమూఁడు యంత్రముల కేమిలెక్క ? ముప్పది వేల యంత్రములను దెచ్చినను ఆనాఁటి ప్రేక్షకుల కవి చాలవు.

నదీతీరమున మఱియొక యావరణమున ప్రకృతి శాస్త్రపు టద్భుతములు యంత్ర సహాయమునఁ జూపఁబడు చుండెను.

అమాసనాఁటి యుదయమున తొమ్మిదిగంట లగునప్పటికి కృష్ణాతీరమంతయు నిసుకచల్లిన నేలఁబడనంత దట్టముగా జనాకీర్ణమైయుండెను. ప్రదేశమంతటను శబ్దవాహినీ యంత్రములు అమర్చఁబడియుండెను.

గడియారము తొమ్మిది కొట్టినది. వెంటనే ఆర్ష విజయుఁడను నార్ష యోగీంద్ర శిష్యుఁడు ఒక కొయ్యనిచ్చెన నెక్కి అంతరాళమున నిరాధారముగా నిలిచియున్న తన

పీఠమునధిష్ఠించెను. పదిలక్షల నోళ్లనుండి జయజయ నినాదములు మింటికెగసెను. ఉపన్యాసకుఁడొక్కసారి నలుదెసల పరికించిచూచెను. పిమ్మట తన పీఠమునుండి లేచి నిలిచెను.

ఎల్లర చూడ్కులును ఉపన్యాస వేదికపైఁ బ్రాకినవి. నదీతీరమంతయు నిశ్శబ్దమైనది. కృష్ణాతరంగిణి హోరుమాత్రమే యప్పుడు పైకి రాఁజాలినది. శబ్దవాహులు పీఠమునుండి వెలువడు ప్రతిశబ్దమును ఎల్లెడలను సుస్పష్టముగా వెదఁజల్లుటకై కాచుకొని యున్నవి. మేఘగంభీర భాషణములతో నార్షవిజయుఁడిట్లు ఉపన్యసించెను:-

"అస్మద్దేయులగు సహృదయులారా! సోదరీ సోదరులారా!"

ప్రత్యక్షరమును నదీతీరమున లక్షలాదిజనులకు శ్రావ్యముగా వినవచ్చినది.

"ఆర్ష తీర్థులవారి జనాభివృద్ధినిఁగూర్చిన సిద్ధాంతము కొన్ని సంవత్సరములనుండి లోకమును తల్లడిల్లఁ జేయుచున్న మాట ఎల్లరకును దెలియును. కాని విపన్నివారణకు సరియైన మార్గము నేఁటివఱకును ఎందుండియు వెలువడలేదు. క్రోధమునకు దోహదముచేసి యుద్ధములు పెంచుట మేలని కొందఱును, కామమును జయించి యోగిపదవి నందుమనికొందఱును, రాక్షసవృత్తి వహించి పశుబలముచే బలహీనుల వధింపుమని కొందఱును సంతాన నిరోధ మార్గములను వ్యాపింపఁజేయుమని కొందఱును—ఇట్టిరీతి సిద్ధాంతములు మనము విని విని విసివి విసివి యున్నాము. సంతాననిరోధమార్గముల కించుకేనియు అవసరములేదు.

సభ్యులలో కొందఱు-(తమలో)ఆ పన్నివారణకు అన్ని మార్గములును అనుష్ఠేయములే.

"అన్నలారా! అందులకే ఈసభ కూర్పఁబడినది. నేఁ డీనదీతీరమున కూర్పఁబడిన ప్రకృతి యంత్రములే శాస్త్ర బలమును మీకు ప్రదర్శించుచున్నవి. వాయువునందు సంచారముచేయు మా నిలయమువారి ఈ విమానమును, ప్రళయ భీకరముగా ప్రవహించుచున్న ఈ నదీమధ్యమున కదలక మెదలక దృఢస్థాయియై వినోదించుచున్న యీ యోడయు, కోట్ల కొలఁది యోజనముల దూరముననున్న అగోచర వస్తువులను గూడ మీకు నాలుగుబారల దూరమున నిలిపి చూపుచున్న ఈ దూరదర్శక యంత్రములును, ఇదేశమున మనకు పదివేల మైళ్లదూరమున ఎడింబరో నగరమున విశ్వవిద్యాలయ సభా భవనమున మా నిలయ సభ్యుఁడొసగుచున్న యాంధ్రోపన్యాసమును ఆ యావరణములోని వారికి వినఁబడునట్లు చేయుచున్న దూరశ్రవణ యంత్రమును, అంతరాళమున నిలిచియున్న ఈ యుపన్యాస వేదికయు ప్రకృతిశాస్త్రముల మహా మహిమమును మీకు ప్రత్యక్షము చేయుటలేదా?

"వీనికన్నింటికి ఆధార భూతురాలైన పెద్దాపురపురాణి లలితా మహాదేవిగారికి జయమగుఁగాక!"

ఆనందభరితులై ద్విగుణీకృతమైన శ్రద్ధతో నెల్లరును చెవులునిక్కించి ఈ యుపన్యాసమును వినుచుండిరి.

"ఈ ప్రకృతి శాస్త్రములు మనకు ఛాయాపటముల నిచ్చినవి; జల యంత్రములు కల్పించినవి, ; విద్యుత్తంత్రుల చే వార్తలనంపనేర్పినవి; జలాంతర్గాములను నిర్మించినవి;

తంతులు లేకుండనే నేఁడు శబ్దవాహకములను ఏర్పాటుచేసినవి. మనకేమి కొదువ? పంచభూతాత్మకమైన ఈ ప్రపంచమునకు మానవుఁడు రాజు. ఈ పంచభూతములును మనకు దాసానుదాసులు. నేర్పెఱిఁగి పని పుచ్చుకొన్నచో ఈ ప్రపంచము వలన మనకు లభింపని దెయ్యది? ప్రకృతిశక్తులు బంటులను బోలె మనలను సేవించుచున్నవి. ఒక మర పిండికొట్టఁగా మఱియొకమర బట్టలు నేయుచున్నది. ఒకమర బండి లాగుచుండఁగా మఱియొకమర మనకు వింజామరలు వీచుచున్నది. దీనివలననే పుట్టెడు పండు భూమి నేఁడు నాలుగుపుట్లు పండుచున్నది. సేరుపాలను నొసఁగునావు నేఁడు పదిసేరుల పాలను పిదుకుచున్నది. కాని—"

మొదటివరుస ప్రేక్షకులలో ఒకఁడు—పండించుటకు భూములే దొరకనప్పుడు పంటలెక్కడివి?

మఱియొకఁడు-సద్దు–సైలెన్స్–పురార్నకో–కమోష్.

ఇంకొకఁడు "కాని భూమియంతయు జనాకీర్ణమైనప్పుడు లండను నగరములోని బాటలవలె భూగర్భమున పొలములు కల్పింపవలయునా॥"

"మిత్రమా! అప్పుడు ఏమి కావలయునను నదియే నేఁటిసమస్య. శ్రద్ధతో నా వాక్యములను మీరు వినఁగోరుచున్నాను.

"ప్రకృతిశాస్త్రములు ప్రత్యక్ష ప్రమాణములు. అవియే పరమేశ్వరుని నిరతవర్తిత శాసనములను క్రోడీకరించి యునిచిన వేద వేదాంగాదులు. నిత్య జీవనమునకు ఈ ప్రకృతి శాస్త్రములే పరమ ప్రమాణములు. ప్రకృతి శాస్త్రములను

మీఁటి చరించువారు అధోగతిని చెందుదురు. వానిని అనుసరించి-చరించువారికి సర్వ కామార్థసిద్ధులు సద్యస్సంభవములు.

"సర్వశాస్త్రములును ప్రకృతి శాస్త్రములకు లోఁకువ. అన్ని సదాచారములును ప్రకృతి శాస్త్రనియమములకు తార్కాణములు. ఆర్షమత వ్యాప్తివలన మూఢాచారములును, మూఢ సిద్ధాంతములును నశించిపోవును. ప్రకృతి శాస్త్ర సారమే మానవుని నిత్యజీవనమునకు ఆవశ్యకములైన నూతనాచార వ్యవహారాదులను లోకోత్తర రీతిని ప్రసాదించును. అట్టి యార్షసంఘమే భవిష్యన్మానవ సంఘము. అట్టి ప్రకృతి శాస్త్ర సహాయమువలన నార్ష యోగీంద్రుఁడే తన జనాభివృద్ధి సిద్ధాంతమున కనువగు భవిష్యత్ప్రపంచ జీవిన రహస్యములను వెల్లడించియున్నాఁడు.

'పంచాకోటి భూమండల'మని పామరులు అనెడి మాటను మీరు వినియున్నారా? ఈ భూమండలములో కొన్ని భాగములు జనాకీర్ణములై క్రిక్కిఱిసి యుండఁగా మఱికొన్ని ప్రదేశములు నిర్మానుష్యములై యున్న సంగతి మీ రెఱుఁగుదురా? యంత్ర నౌకల మీఁదను, వాయు విమానముల మీఁదను, వీలైనచో శకటముల మీఁదనుపోయి ఆ నిర్మానుష్య ప్రదేశములను మనము ఆక్రమింతము. నేఁడే మీరు బయలుదేరి ఏయే సముద్రములలో నేయే దీవులు మానవ నివాసయోగ్యములో పరీక్షింపుఁడు. సమస్త పరికరములతో ఆస్థలములను నేఁటినుండియు మనము అరికట్టి యుంచుకొందము. ఇది కడుపులోని చల్ల కదలకుండునట్లు మూలమూలల నొదిగి కూరుచుండు కాలముకాదు. దేశ సంచారవ్రతము ఆర్షాచారములకు అను

శ్రేయము. జనాభివృద్ధివలన మన యూళ్లు నిండినయెడల నిర్మా నుష్యములైన యడవులు, ద్వీపములు, మనతల్లి, పృథ్వీదేవి, మన కనుగ్రహించియే యున్నది. కుటుంబములు పెరిగినప్పుడు గృహసంఖ్య పెరుగదా? ఆర్ష తీర్థులవారి లెక్కల ప్రకార ముగా నీ నిర్మానుష్య ప్రదేశములన్నియు మానవాకీర్ణములగు టకు నూరువేల యేండ్లకు మించును.

భూభాగములు నిండిన తరువాత.

"కాశ్మీర దేశమునందు తటాకములలో జలమధ్యమున పడవలమీఁద గృహములు నిర్మించుకొని, ఇండ్లతోను వాఁకిండ్ల తోను సంచారము చేయుచుండు మానవకోటిని మీ రెఱుఁగు దురా? ఈ భూమండలమున భూభాగముకంటె జలభాగము నా లుగురెట్లు అధికమని యతఃరాస్త్రుల కెల్లఱకును దెలియును. నిర్మానుష్య భూభాగములు జనాకీర్ణములైనప్పుడు సముద్ర ములున్నవి. నౌకా గృహములమీఁద మహాసముద్ర మధ్య మునందును మనము సంచరింపవచ్చును. నిర్మానుష్యములైన ద్వీపములును, ద్వీపాంతరములును, ధృవ ప్రాంతములలోని యపార భూఖండములును గూడ జనాకీర్ణములైనప్పుడు, మానవ నిర్మితములగు నౌకా రాష్ట్రములును పట్టణములును పల్లెలును, ప్రత్యేకములైన నౌకాగృహములును యంత్రసహా యమున వెలయఁగలవు. సముద్రములన్నియు నిట్లు జనాకీర్ణ ములయినను గూడ మనకు భయములేదు. ఆర్ష యోగీంద్రుని లెక్కల ప్రకారముగా నిట్టిస్థితి వచ్చుటకు ఇంకను కోటియేం డ్లకు మించును.

భూములు సముద్రములు జనాకీర్ణములైన వెనుక.

"ఆపిమ్మట ఏమి కావలయుననునదియే యనంతర సమస్య. శ్రద్ధతో నా వాక్యములను మీరు వినఁగోరుచున్నాను. నేఁడు మన కీసూర్యగ్రహణమును గూర్చుచున్న యీ చంద్రుని మీరెఱుఁగుదురా! ఆ తారాధిపతిని, ఆ కలువలఱేని, ఆనిశానాథుని, ఆ యమృతాంశుని, ఆ చలువలచెలువుని ఆ చంద్రుని మీలో నెఱుంగని వారెవ్వరు? మనభూమిని ఆశ్రయించుకొని బంటువలె ప్రదక్షిణములుచేయుచు భూజనుల నెల్లరను అనుసరించుకొని వారికి సంతోషమగునట్లు చల్లని తెలి వెన్నెలల నొసఁగుచు, మనకత్యంత సమీపముననున్న ఆ చంద్రమండలము ఎంతనివాసయోగ్యమైనది! ఆ చంద్రుని నేను మీయధీనము చేయఁగలను. అద్భుతములైన శాస్త్ర సిద్ధాంతముల మార్గమున నేను మిమ్మందఱను ఆ చంద్రునిలోనికిఁ గొనిపోఁగలను. భూమినుండి చంద్రలోకమునకును, అదియు నిండినచో గురు శుక్రాంగారకాది లోకములకును నేను మిమ్ము అవలీలగాఁ గొనిపోఁగలను. ఆ చంద్రలోకమును జయించి మన యాంధ్రరాష్ట్రములోని పరగణాలకు నేను చేర్పఁగలను. ఓఢ్రులు మన జిల్లాల నపహరించినను, కర్ణాటకులు మన సీమలను ఎత్తుకొని పోయినను, నదులు గర్జించినను, సముద్రములు ఘోషించినను గూడ చంద్రలోకము ఆంధ్రరాష్ట్రములోని యొక భాగము కాకమానదు. చంద్రమండలాధిదేవతకు జయమగుఁగాక! ఆంధ్ర ప్రతిభ దిగంతములదాఁక వ్యాపించి లోకకల్యాణమును గూర్చుఁగాక."

సభ్యులలోని కరతాళ ధ్వనులు చంద్ర మండలమును దాఁటి ఆకసము నంటినవి.

"చంద్రలోకమును గూర్చి ప్రకృతి శాస్త్రములు చక్కగా నెఱుఁగును. దానివైశాల్యము, దాని ఒడ్డు పొడుగులు, దాని తూనిక, దాని గమనము, దాని యుపరిభాగపు టాకారము, దానికిని మనకును గల దూరము, దాని ఘనమానము,—దాని నైసర్గిక స్వభావము—వీని నన్నింటిని ప్రకృతి శాస్త్రములు మనకు సంపూర్ణముగా తెలిపినవి. మన భూలోకమునకు వలెనే చంద్రుని లోని ప్రతి భాగమునకును పటములు వ్రాయఁబడినవి. జోతిశ్శాస్త్రమును, గణితశాస్త్రమును, భూతత్వ శాస్త్రమును, ఎల్ల శాస్త్రములును చంద్రమండలమును శోధించిశోధించి నిస్సంశయము, సమగ్రము, ఉపయుక్తమునగు జ్ఞానమునే మన కొసఁగియున్నవి, కాని నేఁటివఱకును చంద్ర లోకమునకును భూలోకమునకును రాకపోకలు కల్పింపఁ బడలేదు. ఆ గౌరవము మీకు లభించును గాక"

సభ్యులు చెవులు నిక్కించి, నేత్రములు విరళముచేసి, హృదయమును ఏకాగ్రమొనర్చి యుపన్యాసమును వినుచుండిరి.

"చంద్రలోకమును గూర్చిన చరిత్రము నొకించుక మీకుఁ దెలుపనిండు. మన ప్రాచీన గ్రంథములలో చంద్రలోకము పరిగణింపఁ బడినది. యజ్ఞాదుల నాచరించిన జీవుఁడు సూర్యచంద్రాహో శుక్లపక్షాభి మాన్యాది లోకముల మీఁదుగా నూర్ధ్వగతులఁ జెందునని మనపెద్దలు చెప్పుదురు. కాని

యిది చచ్చినవారి మాటగాని జీవించియున్న వారి సంగతి కాదు. సూర్యనాడి యనియు చంద్రనాడి యనియు మన శ్వాసము విభజింపఁ బడినవి. కాని యివియు పౌరాణికము లేగాని ప్రకృతి శాస్త్రసంబంధ మైనవి కావు. సశరీరులమై చంద్రలోకమున కేగువారము మనము. చచ్చినవారిని చక్కఁ బెట్టుపని పురోహితులది."

ఒకడు—పురోహితులన్న మీకంత కంటకమా?

"కంటకమో గింటకమో ఆపనిని తిరుగుబోతులకు వదలివేయుదము. రెండువేల యేండ్లకుమునుపు ఆంధ్రుఁడైన ఆర్యభటుఁడు ఆకర్షణ సిద్ధాంతమును (Universal Gravitation) నిర్వచించి గణిత సూత్రములు పన్ని గ్రహణములకు కాల నిర్ణయము పొసఁగించినప్పుడు పురోహితు లాతనిని బహిష్కరించిరి.

ఒక యాంధ్రుఁడు—(ముందుకు దుమికి) ఆంధ్రుని బహిష్కరింప గుండెకలమగవాఁ డెవ్వఁడో నాయెదుటకు రానిండు.

"సీమకుఁ బోయినంతనే బహిష్కార పత్రము లంపుచున్న యీ కులపెద్దలు మనలను ప్రాణములతో చంద్రలోకమునకు అరుగనిత్తురా? ఇట్టి శుష్కనిరోధములు ఈ యాకర్షకమువారిని అరికట్టలేవు. చంద్రలోకములో విశాలములైన బయళ్లు, శీతలవారి పూరములైన నదీనదములు, సుక్షేత్రములైన భూములు, స్వర్ణాది ధాతుమయములైన సానువులు, మధురతయు నారోగ్యమును గలిగి యమృతత్వ మిచ్చు దివ్యతరములగు నాహార వస్తువులు—అన్నియు వెలసి భూలోకవాసులకు దేవత్వాపాదకములగునని ప్రతి చంద్రగ్రహణ కాలమునందలి శోధనలును నిస్సంశయముగా మనకుఁ దెలిపినవి. అచ్చ

టకుఁ బోవుటకు దారియే యొకటియున్నచో చంద్రమండలము ఏనాఁడో మానవాక్రాంతమై యుండి యుండును. కార్యసాధన నిపుణులైన యాంధ్రుల విజ్ఞానము ఆ పనిని నేఁడు సాధించి నది. తేలికగా ధృవముగా, అప్రమాదముగా, నేను మిమ్ము అచ్చట చేర్పఁగలను. ఈ రెండు లోకములకును రాకపోక లకు నేను సాధనములను అమర్పఁగలను. రండు! ఆ యమృ తాంశుని లోనికి మనమెల్లరమును పోయివత్తము రండు. కర తాళ ధ్వనులచే మీ సంసిద్ధతను వెల్లడింపుఁడు. ''

ఈ వాక్యమునకు మిన్నుమిన్ను ఏకమగునట్లు కరతాళ శబ్దములు చెలరేఁగెను. కొంతసద్దు అణఁగిన వెనుక మన యుపన్యాసకుఁడు మఱల లేచెను.

''సహృదయులారా! అసాధ్య మనునది ప్రకృతికి విపరీతమైనది. ప్రకృతి సిద్ధాంతములు ఎంతవఱకు వర్తించునో అంతవఱకు అసాధ్యమను పలుకు అసత్యము; అచింత్యము. మానవులను నమ్మికొని చేసెడి పనులకు అపజయములు రా వచ్చునుగాని, నిరత వర్తితములగు ప్రకృతి ధర్మములను నమ్మికొని జరుపు పనులకు ఎన్నటికిని విఘాతము రాదు. అప జయము లేదు.

''మా ప్రకృతి నిలయమున ఇదివఱకే సమస్త శోధ నలును జరిగినవి. వలసిన యంత్రముల బలము, ఆకారము, వానికగు వ్యయము, జయింపఁ బడవలసిన భూమ్యాద్యాకర్ష ణశక్తుల విస్తారము, అవాంతర నిరోధములను జయించుచు ముందు భూలోకమునంతను ఆక్రమించుటకును, ఆ వెనుక అవసరము కలుగునప్పుడు సూటిగా చంద్రునిలో అప్రమాద

ముగా దిగుటకును వలసిన ప్రారంభ విశేషములు, ఆ యాయి శక్తుల స్వరూప స్వభావములు అన్నియు మా నిలయమున నిదివఱకే సంశోధింపఁ బడినవి. యంత్ర శకటమువలె, విద్యుద్యంత్రమువలె, ఆకాశ విమానమువలె నిరాఘాటముగా భూమ్యాకాశముల నడుమ వాయురహిత ప్రదేశములలోఁ గూడ సంచార మొనర్పఁగల మార్గమును మేము గని పెట్టితిమి. మాప్రకృతి నిలయములోని విద్వద్వరేణ్యులు ఇట్లు నిశ్చయమనస్కులై యీ పుణ్యోపరాగ కాలమున లోకాభిప్రాయమునకై యీ విషయమును మీకు వినయపూర్వకముగా విన్నవించుచు మీ సానుభూతిని కోరుచున్నారు. మన్నుదిన్న పాములవలె పడిపోయియుండక, ఉత్సాహముతో, ఆవేగముతో, భయమును వర్జించి, పూనికను ద్విగుణిత మొనర్చి ఒక్కసారి ఈ సమస్త మానవలోకమును, ఈయావద్భూ ప్రపంచమును కండ్లార తిలకించి, యాంధ్రులు వికసిత హృదయులగు కాలము వచ్చినది. ఆర్ష యోగీంద్రులకు జయమగుఁగాత.

" ప్రకృతి నిలయమువారి యీ ప్రయత్నమునకు సానుభూతి చూపువారు కరతాళ ధ్వనులచే తమ యంగీకారమును దెలుపఁ బ్రార్థించుచున్నాను."

సభయందలి కరతాళధ్వనులు మిన్నుముట్టెను.

నాఁటి సాయంకాలమునకు ప్రకృతి నిలయ సభ్యుల సంఖ్య 28, 643 ఆయెను.

# ఆఱవ ప్రకరణము.

ప్రకృతి నిలయమువారు పెద్దాపురము తిరిగి చేరిన తరువాత వారి పుష్కరపు లెక్కలు పరీక్షింపఁబడినవి. లెక్క ఇట్లు తేలినది.

| | |
|---|---|
| పత్రిక విక్రయమువలన | 200,000- 0-0 |
| వాయు విమానములవలన | 24000- 0-0 |
| ధూమ నౌకలవలన | 28,000- 0-0 |
| యంత్ర ప్రదర్శనాదులవలన | 53,274-12-0 |
| హరిజనులు తెచ్చిన తీర్థ పారణవలన | 9,861-15-0 |
| నూతన సభ్యులవలన 8,303 | 1-వ తరగతి రు (5-0-0) 41,515-0-0 |
| 15,040 | 2-వ తరగతి రు (1-0-0) 15,040-0-0 |
| 5,300 | 3-వ తరగతి రు (0-4-0) 1,325-0-0 |
| విరాళములు | 128-5-5 |
| మొత్తము— | 373,145-0-5 |

పుష్కర యాత్రకైన కర్చునంతను బొంబాయి వర్తకుఁడగు సేటు మురళీ ధరదాస్ పుంపుర్ వాలాగారు భరించినందున మూఁడులక్షల డెబ్బదిమూఁడువేల నూట నలువది యైదు రూపాయల-అణాలుపూజ్యము-అయిదు దమ్మిడీలు నిలువలాభము తేలినది. ప్రకృతి నిలయమువారి కార్యా

లోచన సభ్యులు ఈ ధనముతో వెంటనే పని ప్రారంభింప నిశ్చయించి ఆంధ్రదేశములోని ప్రకృతి శాస్త్రవేత్తలకు ఈ క్రిందిలేఖను వ్రాసిరి:—

ప్రకృతి నిలయము.
పెద్దాపురము.
15-11-1800

మహాశయా, నమస్తే.

ఆర్ష యోగీంద్రుని జనాభివృద్ధి సిద్ధాంతమును గూర్చియు కృష్ణాపుష్కర సమయమున బెజవాడయందు జరిగిన యనంతర సంఘటనలను గూర్చియు మీకు తెలిసియే యుండును. జనసంఖ్య హెచ్చినప్పుడు మానవాక్రమణమునకు అన్య ప్రదేశయాత్రలు తప్పవు. అందువలన భూమండలమునంతను మున్నొకసారి గాలించిచూచి, అటువెనుక జలమధ్య నివాసమునకును, చంద్రాది గోళయాత్రలకును పూనుకొనవలసియున్నది. ఈ విషయమున ఎట్లు కార్యారంభము చేయవలయునో సందిగ్ధముగా నుండుటచే తమ యాలోచనమును అర్థించుచున్నాము. వచ్చిన ప్రత్యుత్తరములు శ్రీముఖనామ సంవత్సర కార్తికశుద్ధ పంచమి సోమవారమునాఁటి మాకార్యాలోచన సభవారి యెదుట నునుపఁబడును.

ప్రకృతి విద్యానిపుణులైన తమ వంటివారి సానుభూతి నపేక్షించుచున్నాను.

ఇట్లు,
తమ విధేయుఁడు
(ఆర్ష విద్యావినోది) విజ్ఞాన చక్షువు,
సంయుక్త కార్యదర్శి.

వడ్డీ నష్టములేకుండుటకై ఈ ధనము అంతవఱకును పెద్దా పురములోని టీకా సాహేబు నాతికి దక్షిణమునసున్న యింట ప్రతిష్ఠింపబడిన ఆర్ష నిధియందు సంవత్సరమునకు నూటికి రెండు రూపాయల వడ్డీమీఁద నిలువ చేయఁబడినది.

శ్రీముఖ నామ సంవత్సరపు ఆర్ష సమాజపు వర్ధంతి తత్సంఘము స్థాపింపఁబడిన పందొమ్మిదవ విజయదశమినాఁడు జరిగినది. ఆనాఁటికే చాల ప్రదేశములనుండి ప్రత్యుత్తరములు వచ్చినవి. ముందుగా ధనము వెచ్చింపరాదనియు, ధనము, ఉత్సాహము, ప్రకృతిశాస్త్ర పరిచయము కలవారు జట్టులు జట్టులుగా బయలుదేరి ముందొకసారి భూ ప్రపంచమును, సముద్రములను చుట్టి రావలెననియు పెక్కండ్రు విద్వాంసులు ప్రత్యుత్తరములు వ్రాసిరి. ఆర్ష వర్థంతినాఁడు ఈ విషయము ఆర్ష యోగీంద్రులే ప్రస్తావవశమున వెలువఱిచిరి. లంకాపురి చిచ్చువలె ఈవార్త ఆంధ్రలోక మెల్లెడలను వ్యాపించెను.

కాకినాడలోని వంతెన ప్రక్కనున్న గంట స్తంభము కడ నిరువురు యువకులు ఒకనాటి సాయంకాలమున నిట్లు ముచ్చటించు కొనుచుండిరి.

మొదటి యువకుడు—ఇందు అసాధ్య మేదియు లేదు. ఆర్ష విజయులవారు నౌకాగృహములను, నౌకా పట్టణములను మాత్రమే చెప్పినారుగాని విమానగృహములను, విమానపురములను విశదీకరింపలేదు. పడవలుతోఁ చేర్చి బిగించి ఊళ్లుకట్టి సముద్రవిహారము పొసఁగించుట సాధ్యమేని, జన

సంఖ్య హెచ్చినప్పుడు వాయువిమానముల మీఁద గృహము లను, ఊళ్లనుకూడ ఏల నిర్మింపరాదు?

రెండవవాఁడు—కాదని ఎవ్వరన్నారు? చిన్న యుప న్యాసములో ఇన్నియు సాధ్యమగునా? ఒకటి చెప్పినచో తక్కినవన్నియు నట్టివేకావా?

మొద—నాయూహ యింకను వ్యాపించుచున్నది. సము ద్రముమీఁదను విమానముల మీఁదను నౌకాపట్టణములు నిర్మించినప్పుడు ఆ యూళ్లలో పొలములు తోఁటలుకూడ—

రెండ—అవును. భూమిని పొఱలు పొఱలుగా త్రవ్వి అట్టి యంత్రపు గ్రామములలోనికి చేర్చి పొలములను సహి తము జేయవచ్చును.

మొద—ఒక గజములోతు మట్టి చేరినయెడల సామా న్యపు పైరులన్నియు నందే పండఁగలవు.

రెండ—పొలములకు నీ రెచట దొరకును?

మొదటి—ప్రపంచములో ప్రతిదినమును నెక్కడనో ఒక తావున వర్షమో వర్షమేఘములో ఉండకతీఱదు. వాయు భారమాన యంత్రసహాయమున విమాన గ్రామములు అట్టి తావులను తెలిసికొని యచ్చోట తేమను కూర్చుకోవచ్చును.

రాజమహేంద్ర వరములోని గోదావరిగట్టున కొందఱు యువకులు ఇట్లు సంభాషించు కొనుచుండిరి.

ఒకఁడు—ఏనాఁడు విదేశయాత్రలు కట్టువడినవో ఆ నాఁడే భరతవర్షమునకు అధోగతి యారంభమైనది. సముద్ర యాన నిషేధమునకు తాత్కాలిక సమస్యలు కారణములగుఁ గాక. కాని ఎల్లకాల—

మఱియొకఁడు—మన రామమూర్తి నేఁడు దేశనాయకునివలె మాటలాడుచున్నాఁడే?

ఇంకొకఁడు—ఓహో! విశ్వనాథముగారికి ఎప్పుడును రంధ్రాన్వేషణమే పని. నేఁటి ప్రపంచ పరిస్థితులైన ఒకసారి చూడరాదా. అమెరికా ఐరోపాఖండములు ఆర్థిక సమస్యలలో చిక్కువడి ఈ ప్రపంచసమస్య నెదుర్కొనుట కెట్టి ప్రయత్నములు చేయుచున్నవో పత్రికలు తెలుపుటలేదా?

విశ్వ—ఓహో! వెంకటేశ్వరుఁడుగారా? పాఠశాల కవ్వాలి విషయములలో విద్యార్థులు పాల్గొనరాదని నీ వెఱుఁగవా? పెద్దవాండ్రమైన తరువాత వానికి కాలము రాఁగలదు. పరీక్షలువదలి ఈ ప్రసంగము—

రామ—విద్యావిషయములనే పాటించితిమి. చరిత్ర గ్రంథములలో బాబిలోనియావారు నిరంతర సముద్రయానములుచేయుచు పాశ్చాత్యదేశపు సరకులను ఇండియాకును, మన సరకులను ఆ దేశములకును గొనిపోవుచు తాము భాగ్యవంతులై లోకమునకును ఎట్టి సుఖ సంపదల నొసఁగిరో ఆ విషయముగాని, ఫొయెనీషియనులును, ఈజిప్టు వారును—

విశ్వ—ఆ చాల్డియాలును ఆ బాబిలోనియాలును ఇప్పుడేమయినవి? "భూమిపై పేరైనం గలదే?"

రామ—పెద్దపులికి మేఁక యాహారమగునుగాని సింహము ఆహారమగునా? ఆ పులియు, ఆ సింహమును, వేఁటకాని గుటికి ఆస్పదములే కదా? కడవంత గుమ్మడికాయయు కత్తిపీటకులోకువ. ప్రపంచము జ్ఞానాభివృద్ధి నందుచున్నప్పుడు వెనుకఁబడిపోయి ముందడుగు వేయనేరనివారు ఏమగుదురు?

వేంక—"పుత్రాదిచ్ఛేత్ పరాజయమ్"

రామ—జ్ఞానములో వెనుకఁబడిన రాజ్యములు జ్ఞాన పూర్ణములైన రాజ్యములకు పాలికాఁపులగును.

వేంక—ప్రకృతి శాస్త్రజ్ఞానమే నిజమైన జ్ఞానము. అది దిన దిన ప్రవర్ధమానము. ఇప్పుడీ ప్రకృతి శాస్త్రజ్ఞానము గంట గంటకును ప్రతి నిమేషమునకును గూడ ప్రపంచ పరిస్థితులను మార్చి వేయుచున్నది.

పెద్దాపురములోని ఈంద్ర పెద్దసన్యాసిగారి మామిడితోఁటకడ నిద్దఱు యువకులు ఆకస్మికముగా కలిసికొనిరి.

ఒకఁడు—ఓహో వీరభద్రుఁడా-ఎదుటివారు నీకు కానవచ్చుటలేదు. ఏమో దీర్ఘాలోచనమీఁద నున్నావే.

వీర—ఓహో! రామ భద్రుఁడా? అవును. దీర్ఘాలోచన మీఁదనేయున్నాను, ఈమాయా ప్రకృతి పాశ్చాత్య దేశముల వారికి బంటువనె నుపచరించుచున్నది. ఈ ప్రకృతియే అడుగడుగునకును మనలను సంహారకాలము చేయుచున్నది. సముద్రయానము నిషేధింపఁబడినది. ప్రాచీన శాస్త్రేతరమైన జ్ఞానము అప్రామాణికమైనది. క్రూరప్రకృతి సర్వనాశ మొనర్చుచున్నది.

వామ—ప్రకృతికి మనపైని అధికార మిచ్చినచో నది మనకు నాశమునే గూర్చును. అదనెఱిఁగి ప్రకృతిని ఆజ్ఞాపించినచో అది మనకాలిక్రింది బంటై సేవలుచేయును. రాతునుబట్టి గుట్టము పోవునని నీ వెఱుఁగవా?

వీర—కాఁబట్టి ప్రకృతి శాస్త్రజ్ఞానమును—

రామ—జ్ఞాన సంపాదన మాత్రముతో మనపని తెల్ల

వాఁడు. అనువెతిఁగి యా జ్ఞానమును మననిత్యజీవనముతో ననుసంధింపవలెను.

వీర—అనఁగా ప్రకృతి శాస్త్రజ్ఞానము ఉపయోగించి మనము సుఖము, సంతోషము, నిరంతరాభివృద్ధి వీనిని చెందవలెను. ఆర్షమతము మానవాచారముల కన్నింటికి ప్రకృతి జ్ఞానమే ప్రామాణికమని శాసించుటచే నేఁటి మతము లన్నింటిలో నదియే యుత్తమ మతమని నా నమ్మకము.

రామ—ఐహిక విషయములలో నదియట్లే. ఆముష్మికమునకును నదియే సాధనము.

రామ—మానవాభివృద్ధికి తోడైన నాగార్జున, చరకాచార్య ఆర్యభటాదులు. ఋషితుల్యులు. అట్లే శంకరుఁడు, రామానుజుఁడు, మధ్వాచార్యుఁడు, బుద్ధుఁడు, క్రీస్తు మున్నగువారు దేవతాస్వరూపులైన లోకోత్తర పురుషులు; ఒకరు చేసినదాని ఫలమును అనుభవించుటకు మాత్రమే యోగ్యతకల పురుషుఁడు హీనభావుఁడగు మానవుఁడు. ఎవ్వనివలన లోకములు సముద్ధరణము గాంచునో వాఁడే పురుషోత్తముఁడు.

దినములు గడచిపోవుచుండెను. లోకములో ఎవరి శక్తికి చాలినట్లు వారు ఆలోచనలు చేయుచుండిరి. ఇంతలో శ్రీముఖ నామ సంవత్సర కార్తికశుద్ధ పంచమీ సోమవారము వచ్చినది. ఆనాఁడు ప్రకృతి నిలయమువారి కార్యనిర్వాహక సభ జరిగినది. మూలధనమును వెచ్చింపరాదనియు, ప్రకృతి శాస్త్రజ్ఞానము విఱివిగా వర్ధిల్లు దేశములకు ఆంధ్రులుపోయి యచ్చటి శాస్త్రాలయములను దర్శించి యుత్తమవిద్యలనంది

రావలెననియు పెక్కండ్రు విద్వాంసులు ప్రత్యుత్తరములు వ్రాయుటచే పెద్దాపురములోని ప్రకృతి నిలయమువారు అట్లే తీర్మానించిరి. మూలధనమంతయు ఆర్షనిధియందు నూటికి సంవత్సరమునకు ఆఱురూపాయల వడ్డీమీఁద నిలువఁజేయు నట్లు నిశ్చయింపఁబడినది. ఒక్క సంవత్సరములో దానిమీఁద రు. 22,396-0-0 వడ్డీ రాఁగలదు. ఈ వడ్డీతో లోకసంచార మొనర్పఁజాలు నొక యంత్రమును నిర్మించుటకు సభ్యులు అంగీకరించిరి. జ్యేష్ఠమాసమునాఁటికి ఆఱునెలలవడ్డీ అనఁగా రు 11,198-0-0 రాఁగలదు. యంత్రమెట్టిదో నిర్ణయించుటకు ఒక నెలదినములును, దాని నిర్మాణమునకు వలసిన పరికర ములను ఏర్పాటుచేయుటకు మఱియొక నెలయు, పైదేశములకు వ్రాసి మరలనుపోయించి తెప్పించుటకు రెండుమూఁడు నెలలును కావచ్చును. ఎట్లైన భావనామసంవత్సర వైశాఖశుద్ధ సప్తమి నాఁటికి పరికరములు కొరఁగి రేవులోదిగు ప్రయత్నములు చేయవలసి యున్నది. ఇందులకొక యుపసంఘమును ఏర్పాటు గావించి ప్రకృతి నిలయమువారు ఆనాఁటి సభను చాలించిరి.

---

# ఏడవ ప్రకరణము.

శ్రీముఖనామ సంవత్సర కార్తికశుద్ధ దశమీ శని వారమునాఁడు పెద్దాపురములోని ఆర్ష నిధి భవనములో ప్రకృతి నిలయమువారి యుపసంఘపు మొదటిసభ జరిగినది. అధ్యక్షుఁ డిట్లు సభను ప్రారంభించెను.

అధ్యక్షుఁడు—మిత్రులారా! లోకమునకంతకు అద్భుతమును గూర్చు పనులు చేయవలసిన మన సంఘము కోట్ల కొలఁది సువర్ణములను వెచ్చించి అద్వితీయములైన యంత్రములను నిర్మింపవలసి యుండఁగా ఇరువది రెండువేల రజత ముద్రలు మనకిచ్చి మనవారు ప్రపంచమున కంతకును ఆశాభంగము కూర్చినారు. స్వల్ప ధనముతోనే మనము లోకాతీతములుగాఁ దోఁచు నాదర్శ యంత్రమును నిర్మించి జగత్తును మోహవిభ్రాంత మొనర్పవలసియున్నది. దీనికేమి సాధనము?

నాగార్జునుఁడు—పక్షివలె ఆకాశమున కెగిరి ప్రపంచములోని నిర్మనుష్య ప్రదేశములలో వ్రాలు యంత్రమును నిర్మింపరాదా?

విజయమోహనుఁడు—నీట మునిఁగినప్పుడు జలాంతర్గామి; పైని తేలినచో సామాన్యపునౌక; మీఁదికెగిరినచో వాయు విమానము. గుణత్రయాత్మకమైన యిట్టి యంత్రమును జర్మనులు నిర్మించిరని నేను వినియున్నాను. అట్టి యంత్రము నొకదానిని మనము నిర్మించినచో?

వినయశీలుఁడు—అట్టి యంత్రనిర్మాణమునకు లక్షల కొలఁది ధనము కావలసియున్నది. అధ్యక్షులగు విజ్ఞానచక్షులవారి యభిప్రాయమెట్లో—?

విజ్ఞాన—ఒకరు చేసినపనినే మనమును చేయుట ప్రకృతి నిలయమువారి కొక ప్రతిష్ఠయా? శ్రీరాములవారికి విభీషణుఁ డొసఁగిన పుష్పకవిమానము వంటి దొకటి—ఎందఱెక్కినను ఇంకను ఒక్కనికి తావు మిగుల్చునట్టిది మనమేల నిర్మింపరాదు?

శాంతశీలుఁడు—ఇంతకును మనకుఁగల ధనము మిక్కిలి స్వల్పము. ఈ ధనముతో పరదేశములందు యంత్రములను పోఁత పోయించుటకు వలనుపడదు. ప్రకృతమున సీమ యినుము వెల బారువకు రు 152-0-0. సీమరాగి బారువకు 179-0-0 స్వదేశవర్తకుల ధరలు ఇంతకంటె సరసముగా నుండును. లోహములను తెప్పించి మనమే పోఁతపోసి కొనుట శ్రేయస్కరమని నాతలంపు.

నాగార్జు—అదియే యుత్తమమైన మార్గముగా తోఁచుచున్నది. నేలబొగ్గునుగూడ తెప్పించి పాండవులవారి మెట్ట కడ యంత్రనిర్మాణము నొనర్పవచ్చును.

విజ్ఞాన—అట్లయినచో మహా మంత్రీంద్రులవారికి ఒక విన్నపము నంపి నూరు ఎకరములనేలను అడుగుదము. లోహకుల సంఘమువారికి వ్రాసి మనకు ప్రత్యేకధరలకు లోహముల నడుగుదము. మఱియు వైశాఖమాసములో ఆఱువేల రూప్యములను, తరువాతి కార్తికమున పదివేలరూప్యములను చెల్లించునట్లును, సామగ్రినిమాత్రము ముందుగానే మనకు పంపునట్లును వారితో ఏర్పాటు చేసికొందము.

శాంతశీ—అంతకంటె మార్గాంతరము లేదు. ఇనుమును రాగియు మనకు చేరుటకు అధమము రెండుమాసములు పట్టును. ఈలోపుగా నెట్టి యంత్రమును నిర్మింపవలెనో యోచించుటకు కొంత వ్యవధియు మనకు ఉండును. కార్యారంభమున కొక నాలుగువేల రూపాయలను ప్రకృతి నిలయము వారు ముందుగా నొసఁగి వైశాఖమాసమున సంవత్సరాంతమున లెక్క చూచుకొన్నచో చాల మేలగును.

ఈవిధముగా మొదటిసభ ముగిసెను. మహారాణిగారు సంతోషముతో నూరు ఎకరముల నేలను ఒసఁగిరి. లోహకుల సంఘమువారు టన్నుకు రు 118-0-0 చొప్పున నూటయిరువది టన్నుల యినుమును టన్నుకు రు 153-8-0 చొప్పున పది టన్నుల రాగిని పంపించిరి. సింగరేణినుండి ప్రశస్తమైన నేల బొగ్గు పంపఁబడెను. ప్రకృతి నిలయమువారు రు 4,000-0-0 అప్పుగా ముందే ఒసఁగిరి. ప్రజలలో ఆశాభంగము కలుగకుండుటకై విషయములు రహస్యముగా నునుపఁబడెను. ఉప సంఘమునకు కార్యాచరణము పట్ల సర్వాధికారములును ఒసఁగఁబడెను.

పెద్దాపురములోని పశ్చిమ భాగమున రాజమహేంద్ర నగరమునకేగు రహదారి రోడ్డునకు ఉత్తరపు వైపునందలి మైదానములో తూర్పు కనుమలని పిలువఁ బడెడి పర్వత రాజికి చేరిన కొండలవరుస యొకటి యున్నది. ఈ వరుసనే పాండవులవారి మెట్టయని యిచ్చటివారు వ్యవహరింతురు. ద్వాపరయుగమున వనవాసకాలములో పాండవులు కొంత కాలమీ గుట్టలమీఁద వసించినట్లు ఈ పేరువలన నూహింపఁ దగియున్నది. ఈ కొండలలో దేవరహస్యములు చాల కలవని యు, ఇందలి యొక గుహనుండి రాజమహేంద్రవరములోని గోదావరీ గర్భములోనికి ఒక రహస్యమార్గము కలదనియు, ఒకనాఁ డొక గొల్లవాని మేఁకలు ఆ గుహనుండి రాజ మహేంద్రవరము పోయెననియు, వానిని వెదకుచు నేగినవాని యజమానికి ఈ దారి తెలిసినందున దేవతలు ఆగుహ నడుమ

నొకజాతిని అడ్డమువైచి దేవరహస్యములను గాపాడుకొని రనియు నొకస్థలపురాణగాథ కలదు.

ఈ కొండకు తూర్పుననున్న నూరు ఎకరముల మైదానమును పురపాలక సంఘమువారు ప్రకృతినిలయమున కిచ్చివేసినందున లోహకులు పంపిన యినుము అంతయు ఇందు చేర్పఁబడెను. ఇనుమును కఱగించుటకు ఇటుకలతో పెద్దమూసలు ఇందు నిర్మింపఁ బడినవి. ఉపసంఘము వారు రేయుం బవళ్లు ఇచ్చటనే వసించుచు వలసిన పరికరములను సమకూర్చుకొనుచుండిరి.

ఉపసంఘపు సభలలోని విషయములు పరమరహస్యములుగా నుండుటచే వారీ యినుముతోను రాగితోను ఏమి చేయనున్నారో జగమెఱుఁగదు. కాని లోకోత్తరమో లోకాతీతమో యగు నద్భుతయంత్ర నిర్మాణమిందు జరుగునను వార్త మాత్రము ప్రపంచ మంతటను వ్యాపించినది. ఎల్లవారును అనంతోత్సాహముతో వీరి కార్యసిద్ధికి ఎదురుచూచుచుండిరి. శ్రీముఖ నామ సంవత్సర పుష్యశుద్ధ దశమీ మంగళవారము నాఁడు కొంత యినుము మూసలకెక్కింపఁబడి కఱఁగి పోఁతకు సిద్ధముగా నుండెను. మీఁటలువదలి పోఁతగొట్టములను ఆ యినుముతో నింపఁబోవు సమయమున నొక విచిత్రసంఘటనము సిద్ధించినది. దాని చరిత్రమెట్టిదన :

పెద్దాపురవాసులగు వీరభద్రమును రామభద్రమును అన్నదమ్ములు. వారికి ప్రకృతిశాస్త్రముల యం దత్యంతాభిమానము కలదు. మఱియు నార్ష మతావలంబకు లగుటచే భవిష్యత్ప్రపంచ ధర్మమునకు ప్రకృతి శాస్త్రములే వేదవే

దాంగములని వారికిఁ దెలియును. లక్షాధికారులగు నీ యువ
కులు ప్రపంచము నంతను నొకసారి చుట్టిరావలెనని సంకల్పించు
కొని ఆర్యతీర్థుల వారితో నీవిషయమై ప్రసంగవశమున
ముచ్చటించిరి. గురువులవారు దీనికెంతయు సంతసించి మార్గ
మధ్యమున ఓడల కెట్టి యపాంతరములు సంభవించినను
వీరి కాపదరాకుండుటు నట్లొకయంత్రము సృజింపఁదలంచి
తన్నిర్మాణ విధానమును విశదీకరించిరి. అట్టి యంత్రములు
రెండింటిని నిర్మించుటకు ఇరువదివేల రూపాయలగును. యువ
కులీ వ్యయమును దాము భరింతుమనిరి. ఆనాఁడే ప్రకృతి నిల
యమువారి కార్యాలోచన సభ జరుగును. అందువలన శ్రీగురు
వులవారు నిలయాధ్యక్షున కొక శ్రీముఖము నంపించిరి.

వీరభద్రమును రామభద్రమును చేరి యిరువదివేల
రూపాయల నొసఁగుచురనియు ఆధనముతో ఉపసంఘము
వారు రెండు యంత్రములను నిర్మించిన యెడల చాల ధన
లాభము కలుగుననియు, కావున ప్రకృతి నిలయమువారు
తమ యుపసంఘము నీ పనికి ముందు నియమింపవలయునని
యు నందుండెను.

ఆరాత్రి జరిగిన ప్రకృతి నిలయమువారి కార్యనిర్వా
హక సభలో విజ్ఞాన చక్షుయోగి జగద్గురువులవారి శ్రీముఖ
మును గూర్చి తెలిపి తద్విషయమై వెంటనే చర్చింప ననుజ్ఞ
వేఁడెను. సభ్యులా శ్రీముఖమును ఆ మూలాగ్రముగా
చదివిరి.

విజ్ఞానచక్షువు—ఒక గంటకుముందే నాకీ యాజ్ఞా
పత్రము చేరినది. అందువలన నేఁటి చర్చనీయాంశములలో

నిది చేర్పఁబడి యుండలేదు. అయినను విషయ గౌరవమును బట్టి మనము దీనిని చర్చింపక తీఱదని తోఁచుచున్నది.

వినయశీలుఁడు—ఆర్ష పీఠము జగద్గురువులది. ప్రకృతి శాస్త్రములే ప్రమాణములుగా జగమునకై హికాముష్మిక ధర్మములను వెలయించు జగద్గురువుల యాజ్ఞ యనుల్లంఘ నీయము. వారి శ్రీముఖమే నేఁటి సభాకార్య క్రమమున మొదటి విచారణీయాంశముగాఁ జేయవలసినదని నామనవి.

విజయ మోహనుఁడు—శ్రీముఖములోని విషయము లోకోద్ధరణ హేతువు. చిరకాలమునుండి నా కీప్సితముగా నెసఁగిన కార్యమే జగద్గురువుల యాదేశమగుటచే నిది మన కును లోకములకునుగూడ సుదినము. అదియే ప్రథమమున విచారణీయాంశ మగుఁగాక.

శాంతశీలుఁడు—మన కార్యక్రమ పట్టికయందు మార్పు చేయరాదు. ఆకర్షణశక్తి, మున్నగు ప్రకృతిలోని శక్తి సూత్రములెట్లు అలంఘ్యములో మానవుని కార్యాచరణ సూత్రములును అట్లే యనుల్లంఘ్యములు. మన నిర్దిష్టకార్య చర్చ యయిన వెనుక కాలవ్యవధియున్నచో జగద్గురువుల వారి శ్రీముఖమును—

నాగార్జునుఁడు—సాధు! సాధు! ప్రచండ బలము నెదుట అల్పబలమువలె ప్రకృతిశాస్త్ర మతాచార్యులయెదుట అన్యములు నీరసములు. ముందు శ్రీముఖమును చర్చించి కాలము చాలనియెడల మన నిర్దిష్ట కార్య విషయములు మఱి యొకనాఁటికి త్రోసివేయుదము.

శాంతశీలుఁడు తప్ప తక్కినవారందఱును వెంటనే యార్య గురువుల శ్రీముఖమును చర్చింప నంగీకరించిరి.

విజయ మోహనుఁడు—ఱేఁపటి యుదయమునకు నూరు టన్నుల తూనికఁగల యినుము పోఁత చక్రములలోనికి పోవుటకు సిద్ధమైయుండును. అందు నలువదిటన్నుల యినుము జగద్గురువులవారు ఆదేశించిన పనికి మిగుల్చుటవలన నెట్టి ప్రమాదమునులేదు. పనియు వెంటనే యారంభ మగును.

నాగా—కాని క్రొత్తదిమ్మలు చేయుటకు వ్యవధిలేదు. అట్టి పోఁతచక్రములులేకుండ ధృతరాష్ట్రి యంత్రమెట్లు సిద్ధింపఁగలదు?

వినయ—మట్టితో యంత్రాకారముగా తూములుచేసి ఱేఁపటి సాయంకాలమునకు నేను మీకు చక్రముల నొసఁగఁగలను.

శాంత—ఉపసంఘము వారుగూడ నిర్దిష్ట కార్యక్రమ విఘాతమున కొడిగట్టవలెనా?

విజ్ఞాన—అది మనకే లాభకరమైనది. 20,000 రూపాయలు మన వ్యయమునకు దొరకునప్పుడును ఇట్టి శంకలేల? సిరి వచ్చునప్పుడు మోఁకా లొడ్డువారు ఉందురా?

శాంత—ఈ ఉద్దిష్టకార్య భంగమువలన మన కెట్టి ధనలాభము కలదు?

ఆర్య విజయుఁడు—పదివేలు లాభము; అయిదువేలు సామగ్రికి; అయిదువేలు కూలి నాలి మున్నగు వానికి.

విజయ—అనఁగా 22,396 రూపాయలు ప్రకృతి నిల

యము వారు మనకు ఈయఁగా మఱియొక పదివేలు జగద్గు రువుల వారు మనకు ప్రసాదించినారు.

శాంత—శ్రీముఖ విషయములు స్పష్టముగా లేవు. నీట మునుఁగుట, గాలిలో నెగురుట, సముద్రమున తేలుట; తిమి తిమింగిలములు మ్రింగినను ఛేదించుకొని వెలుపడుట; కొన్ని దినములకు చాలిన ప్రాణవాయువు ఆహారము, వస్త్రము లు, శుద్ధ జలమును నందుండుట—గొంతెమ్మకోరికలు!

విజ్ఞాన—సద్దు! సద్దు.

విజయ—క్షమార్పణము! క్షమార్పణము!

శాంత—మాట జాఱినది! ఆర్ష తీర్థులవారికి పదివేల నమస్కారములు. వారి యెడల గౌరవ లుబ్ధుఁడనై మాటలా డుటలేదు. కార్య క్రమ గౌరవము సర్వదా వందనీయము. ప్రకృతి శాస్త్రములే వేదములై మనకు విచిత్రమైన సంఘట నలతో యంత్ర నిర్మాణము సృష్టింపఁ బడవలసి—

వినయ—శాంతశీలునికి అసంభవములు ఎందును ఉండవు.

శాంత—అవి ప్రకృతి సూత్రములకు అవిరుద్ధములు కానిచో.

విజయ—జగద్గురువుల వారిచే నాపాదింపఁ బడినప్పుడు ప్రకృతి సూత్రములకు అది విరుద్ధముగా నుండదు?

శాంత—తిమి తిమింగిలములు మ్రింగినను ఛేదించికొని.

ఆర్ష వి—విద్యుద్యంత్రరక్షితములగు ముండ్లును,మీాట త్రొక్కినచో ఛేదింపఁ దొరకొనెడి అంపములును నూతులు త్రవ్వ గొట్టములునుయంత్రపు పై చర్మమున నమర్పఁ బడి

నవో తిమి తిమింగిలాదులే కాదు. మహాపర్వతములు గూడ విచ్ఛిన్నములగును. ఊాతిని దొలుచు యంత్రపు గొట్టములు గూడ నందుండవలెను.

ఈరీతిగా నూతన యంత్రమునకు పై యాకారము నిర్ణయింపఁబడినది. లోపల నొకవిద్యుద్యంత్ర మమర్ప నిశ్చయింపఁ బడినది. ఆ యంత్రమునకు మీటలు నొక్కినచో వలసిన రీతిని పనులు జరుగఁగలవు. విధానమంతయుపరిశీలించి సుసాధ్యమని యంగీకరించి కార్య నిర్వాహక వర్గమువారు వెంటనే యుపసంఘమునకు ఆజ్ఞా పత్రమును బంపించిరి. పుష్య శుద్ధ దశమినాఁడు మీటలు వదల్చి పోఁత గొట్టములోనికి కఱఁగిన యినుమును వదలువేళకు సిద్ధించిన విచిత్ర సంఘటనము ఇదియే.

# ఎనిమిదవ ప్రకరణము.

## విహంగ నిర్మాణము.

పాశ్చాత్య దేశములందు గుఱ్ఱములు ఎక్కువగానుండుటచే నచ్చటి యంత్రములు నూరు గుఱ్ఱములశక్తిని, వేయి గుఱ్ఱముల శక్తిని పదివేల గుఱ్ఱములశక్తినిఁ గలిగియుండునట్లు నిర్మింతురు. యంత్రముల బలము గుఱ్ఱముల లెక్కను నిర్ణయింపఁ బడును. 1320 మణుగుల బరువును ఒక సెకనులో ఒక అడుగుఎత్తునకు లేవఁ దీయుబలము ఒక గుఱ్ఱపు

బలమని ఆ దేశపు యంత్రములకు ఏర్పడిన లెక్క. గుఱ్ఱము కంటె బలిష్ఠములైన యేనుఁగులే భరతవర్షమున చిరకాలము నుండియు పనిపాటలకు ఉపయోగింపఁ బడుచుండుటచేత ప్రకృతి నిలయమువారు ఏనుఁగుబలమే మన లెక్కలకు సంప్రదాయ సిద్ధమైన గణనగా తీర్మానించిరి. భారతములోని భీమ, శల్య, కీచక సుయోధనాదులు వేయియేనుఁగుల బలము కలవారని వ్యాసులవారే వచించియుండిరి. ఆ లెక్కనే ధృతరాష్ట్రుఁడు పదివేల యేనుఁగుల బలముగలవాఁడు. గుఱ్ఱమున కంటె పదిరెట్లు అధికబలము ఏనుఁగునకు ఉండునని ఆర్య శాస్త్రము. అందువలన పదివేల యేనుఁగుల బలముగల విద్యుద్యంత్రమును విహంగ గర్భమున నిముడ్చుటకు తీర్మానింపఁ బడినది. అనఁగా గ్రుడ్డివాఁడైన యొక యంత్రపు ధృతరాష్ట్రుఁడు పెద్దాపురమున పాండవదుర్గముకడ వెలయఁబోవుచున్నాఁడు.

మానవ శిరస్సులోని మెదడునుండి నరములు శరీరములోని ప్రతిభాగమునకును ఎట్లు వ్యాపించునో అట్లే యీవిద్యుద్యంత్రమునుండి రాగితీఁగలు ఈ నూతన నిర్మాణములోని నియమిత ప్రదేశములకు వ్యాపించును. అంపములును, కఠిన శిలలలోఁగూడ కన్నములు త్రవ్వ గొట్టములును, పక్షులు తమ ఱెక్కలను అల్లార్చునట్లు దేనినైనను పైకిని క్రిందికిని ఆడించు మీటలును దీపములను వెలిగించు తీగలును, నిప్పు పుట్టించు తీగలును, చక్రములను దిర్దిర త్రిప్పుకీళ్లును ఇట్టి వెన్నియో యం దమర్పఁబడినవి.

యంత్రమునకు అడుగున రెండు కాళ్లుండును. ఈకాళ్ల మీఁద నది చక్కఁగా నిలువఁ బడఁగలదు. ఆకాళ్లను ఎత్తుచు దింపుచు పక్షివలె నాయంత్రము నడువఁగలదు. కాళ్లకు అయి దేసి వ్రేళ్లుకలవు. ఈ వ్రేళ్లయందు మరలు అమర్పఁబడి పాద గమనమునకు అనుకూలమగును. ఒకమీట నొక్కినయెడల లోనుండి రెండు చక్రములు పాదములక్రిందికి దిగును. ఈచక్ర ములతో నీయంత్రము మోటారుబండివలె పరుగెత్తఁగలదు. ఒక చుక్కాని యీ చక్రములను సరియైనదారిని నడిపింపఁ గలదు. అవసరము పట్టునేని మెడక్రింద భాగమునుండి మఱి యొక రెండుకాళ్లు క్రిందికి దిగఁగలవు. అప్పుడు ఈ ద్విపాదియం త్రము చతుష్పాత్తు కాఁగలదు. అట్లే యీ నాలుగు కాళ్లను లోనికీడ్చుటకు మఱియొక మీట కలదు. అప్పుడీ యంత్రము పాదరహితమై పొట్టమీఁదనే దేకి పోఁగలదు. ఒక మీట నొక్కినయెడల పక్షిఱెక్కలవంటి రెండు పెద్ద ఱెక్కలు పైకి రాఁగలవు. ఆఱెక్కలు యంత్రసహాయమున కదలుచు నీనిర్మా ణమును ఆకాశ విహారమునకు దగినట్లు చేయును. మఱియొక మీటనొక్కిన యెడల నీ ఱెక్కలు రెండు పెద్ద చక్రములుగా మాఱిపోయి గిఱగిఱ తిరుగఁ గలవు. అప్పుడిది పొగయోడవలె మహా సముద్రమధ్యమున సంచరింపఁ గలదు.

పక్షి మెడవంటి మెడయు నం దిరుప్రక్కల రెండు కండ్లును పెద్ద పొడుగైన మూతియు దీనికిఁ గలవు. గుండు దెబ్బ తగిలినను భేదింపఁ బడని మిశ్రలోహముతో యంత్రపు పై భాగమంతయు నాలుగు పొఱలుగా నిర్మింపఁ బడవలెను.

పొఱ పొఱకును నడుమ ప్రకృతి ప్రాపకగుణముగల లోహ వల్లికలు అమర్పఁబడి యుండును.

ఇట్టి యీ యంత్రము చూచుటకు పక్షివలె నుండు టచే విహంగ యంత్రమని పిలువఁబడఁ దగియున్నది.

కార్య నిర్వాహక వర్గమువారి సభ జరిగిన నాఁటి రాత్రియే ఉపసంఘమునకుఁ జేరిన యందలి సభ్యులు మఱునాఁటి తమ పనికి వలసిన పన్నాగములను యోచించిరి. గుండు దెబ్బకు సహితము తాళఁగల దిటవు తాము ఆనాఁడు కఱఁగించుచున్న యినుమునకు లేదు. లోపలి ఱేకులు, గొట్టములు, పోఁత పాత్రలు మున్నగువానికి మాత్రమే నాఁడు కఱఁగుచున్న యినుము ఉపయోగించును. ఇట్లు నాఁడు పోఁత పోయవలసిన వస్తువులను ఎవరికి తోఁచినట్లు వారు ఆరాత్రియే యోచించి ఆకారములు వ్రాసి పెట్టుకొని మఱునాఁటి యుదయమున ఎనిమిదిగంటలకు కొలుములలో అడుగున కొంత యినుము మిగిలి యుండునట్లుగా పై మీటలను మాత్రము సడల్చిరి. మొదట తలపెట్టిన పనిప్రకారముగా కఱఁగిన యినుము పోఁత పాత్రలలోనికి పోవుచున్నది. దానిని పరిశీలనము చేయుచు, విహంగ యంత్రమునకు తామా రాత్రి సంకల్పించుకొన్న పటములయు పరికరములయు పట్టికలను గూర్చి ఒండొరులతో కూడఁబలికికొనుచు నిశ్చితములైన నూతన యంత్రభాగముల పోఁతకై వినయశీలుఁడు వెంటనే చట్టములను అమర్చుచుండెను. కార్బన్ డై సల్ఫైడు అను చమురుతో మట్టిని పదునుచేసి దిమ్మలుచేయుటవలన, పోఁతకు వలసిన ప్రతి దిమ్మయు నిర్మితమైన క్షణముననే యాఱిపోయి

బిగిసికొని జాయివలె నగుచుండెను. మధ్యాహ్నము మూఁడు గంటలకు దిమ్మలును చట్రములును సిద్ధమైనవి. నాలుగుగంటలకు కొలిములలో నుండి యీ చట్రములలోనికి ఇనుము ప్రవహింప నారంభించినది. అయిదు గంటలకు విహంగములోని లోభాగమునకు వలసిన మేకులు, దిమ్మలు, జేకులు, చక్రములు, మున్నగున వన్నియు ఆకారము తాల్చినవి. కొలిమిలో అడుగున మిగిలిన యినుమునకు బొగ్గును చేర్చి దానిని పది వేల యేనుఁగుల బలముతో యంత్రసహాయమున నదిమిపెట్టి ఉపసంఘమువారు ఆనాఁటి పనిని చాలించిరి.

# తొమ్మిదవ ప్రకరణము.

శ్రీముఖనామ సంవత్సర పుష్య శుద్ధ ఏకాదశీ బుధవారమునాఁడు రామభద్రుఁడును వీరభద్రుఁడును చెఱియొక పదివేల రూపాయలకును ఆర్షనిధి మీఁద చెక్కులు వ్రాసి ఉపసంఘాధ్యక్షునకు ఒసఁగిరి. గురువారమునాఁడు ఆసొమ్ము ఉపసంఘపు లెక్కలలో జమకట్టఁబడినది. తోడనే సంఘాధ్యక్షుఁడు పరదేశముల నుండి రప్పింపవలసిన పదార్థములకు వాయు విమానముల మీఁద నొక లేఖను పంపించెను. శ్రీముఖనామ సంవత్సర మాఘ బహుళ పంచమీ సోమవారము నాఁటికి పదార్థములు పెద్దాపురము చేరినవి.

శివరాత్రి నాఁటికి విహంగము సిద్ధమై పండ్రెండుసారులు కొలఁది ప్రయాణములుకూడ చేసినది. యంత్రరహస్యముల

నన్నింటిని వీరరామ భద్రులకుఁ దెలిపి, శివరాత్రినాఁటి యుద
యమున నుపసంఘమువారావిహంగములను వారి పరము
చేయుచు నిట్లు పలికిరి :—

"రావణుని శిరస్సులు నూట యొక్కమాఱు ఛేదింపఁ బడినవి. అనఁగా రావణ యంత్ర నిర్మాణమున 1010 శిరస్సులు అమర్పఁ బడియుండినవి. మీ విహంగమునకును అట్టి ఏర్పాటు పొసఁగింప వచ్చును. కాని కార్యత్వరయు, వ్యయ భయమును నిరోధములైనవి. మీ విహంగములోని ప్రత్యవయవమునకును మూఁడేసి ప్రతులుగలవు. ఒక్కసారి భూప్రదక్షిణము చేయుట కివి చాలును. మఱియు మీ యంత్రభాగమునందు సమస్త దేవతాలయములును గలవు ఱెక్కలయందు వాయుమూర్తియు నేత్రములందు సూర్యచంద్రులును, రోమ కూపములందు అగ్నియు, ముఖమున నేకాదశ రుద్రులును, పాదములందు భూమ్యంతరిక్షములును త్వక్కున తారామండలమును—మంత్ర పూతముగా యథావిధిగా నావహింపఁ బడినవి. వీనిని భక్తితో నారాధించినవారికి సర్వకామార్థ సిద్ధియగును, వీరిని మీఱి చరించువారు అపమృత్యు గహ్వరము పాలగుదురు. పరమేశ్వరుని నమ్మికొని భక్తిమార్గమున నీశ్వరుని సర్వాంతర్యామిత్వ సర్వనియంతృత్వ సర్వశక్తిత్వ ప్రభావములు ఈ విహంగయానమున మీకు అనుభవైకవేద్యములై అర్హత్వ సిద్ధి మీ కగునుగాత. ఓం శాంతిః శాంతిః శాంతిః. ఓం. సత్యమేవ జయతే నానృతం"

అని విజ్ఞాన చక్షువు ఉపదేశ వాక్యములు పలికి యా శిష్యద్వయమునకు మహా మంత్రోపదేశ మొనర్చెను.

ఒక మీటను నొక్కఁగానే విహంగము తనకుడిరెక్క నెత్తినది. అచ్చోటఁ గల మఱియొక మీటను నొక్కఁగానే యొక ద్వారము తెఱువఁ బడినది. వీర రామ భద్రు లిరువుర తో విజ్ఞాన చక్షువా యంత్ర గర్భమునఁ జొచ్చి తలుపును మూసివైచెను. లోపల గాఢాంధ కారము. ఒక మీటనొక్కఁ గానే విద్యుద్దీపములు తిమిరమును హరించి వైచినవి. వెట్ట యధికమై లోన ఊఁపిరి యాడుట లేదు. వెంటనే యంత్రపు విసన కఱ్ఱలు దిర్రిరఁ దిరుగుచు వీరికి విసర నారంభించినది. రెండు గవా క్షమునుండి తడిసిన వట్టివేళ్ల తడకల గుండ వాయువు లోనికి వచ్చుచున్నది. వేఱు గవాక్షములనుండి లోనిగాలి బైటికి పోవు చున్నది, సముద్రమున మునిఁగినప్పుడు ఈ గవాక్షములు తాముగానే మూసికొని పోవును. బైటి సముద్రపు నీటిచలువ వలన లోపల అసమయమున యంత్రము చల్లగానేయుండును. ఒకమూల అంకెలు వేయఁబడిన చక్రముతో నొప్పెడి యొక పెద్ద సిద్దెకలదు. ఆ సిద్దెలో ద్రవీభూతమైన ప్రాణవాయువు సేఁకరింపఁ బడియున్నది. చక్ర సహాయమువలన నిరంతర మును వలసిన ప్రాణవాయువు అందుండి విహంగములోనికి వచ్చుచుండును. అధికముగా ప్రాణవాయువు కావలయునేని చక్రమునుత్రిప్పి వలసినంత వాయువును సప్రమాణముగా యంత్రములోనికి తెప్పించుకొననచ్చును. సముద్రగర్భమున నున్నప్పుడీ వాయువు కావలసియుండును. నీటిలో లేనప్పుడు చక్రము ఈ వాయురంధ్రమును మూసివేయును. మానవుని శ్వాసనుండి వెడలు నంగారవాయువును, రోమకూపాదుల నుండి వెడలు వాయు స్వరూపములగు నితర మలినములను

హరించుటకై కొన్ని క్షారములు అందందు గాళ్లలో చల్లఁబడినవి. నాలుగు నెలలు సముద్ర గర్భముననున్నను చాలినన్ని క్షారములు మందుల పెట్టెలోఁ గలవు. సామాన్య వ్యాధుల కన్నింటికిని ఔషధములును ఆ పెట్టెయందుఁగలవు, ఆర్య సమాజమువారి యాయుర్వేద నిలయములోని యీ యౌషధములు సశాస్త్రీయములు, మఱియు సద్యః ఫలదములు. ఆ ఓషధుల పెట్టెలోనే మఱికొన్ని యఱలలో దిక్సూచక యంత్రములు, భూతదర్పణములు, దూరదర్శక యంత్రములు, సుత్తెలు, ఉలులు, బాడిదలు, అంపములు, గొడ్డళ్లు, కత్తులు, మున్నగు గృహకృత్యములకును శాస్త్ర శోధనకును వలసిన సమస్త పరికరములును గలవు. ఆవకాయ, మాగాయ చింతకాయ పచ్చడి, మున్నగు నూరుగాయలును, బియ్యము, పప్పులు, పిండ్లు, నేయి నూనె మున్నగు నాహార పదార్థములును, గిన్నెలు, చెంబులు మున్నగు పాత్రాదికమును, సమృద్ధిగా త్రీయనీసీరును రెండుమాసములకు సరిపోవునట్లు సేఁకరింపఁబడి యున్నవి. విహంగము తలక్రిందైనను నిందలి పదార్థములు కదలవు. పర్వతాగ్రమునుండి నేలఁబడినను నేవియు చలింపవు. ఇట్లు దృఢముగా సమస్త పదార్థములును సేఁకరింపఁబడినవి. పడకకుర్చీలు, బల్లలు, సోఫాలు, మంచములు, వస్త్రములు మున్నగునవన్నియు నందుఁగలవు. ఇద్దఱు మనుష్యులు సుఖముగా నీ విహంగ గర్భములో ఆఱుమాసములు జీవింపవచ్చును.

"యంత్రపు చక్రములు తిరిగినప్పుడు విద్యుచ్ఛక్తి

యుత్పన్నమగును. అది యంతయు వ్యర్థముగాఁబోక యంత్రము లోని విద్యుదాలయములోనే సేకరింపఁబడును.''

# పదియవ ప్రకరణము.

హూణ వత్సరములు 10-11-1800 అనఁగా ఆర్ష శకాత్పూర్వము 10-11-116 న గురువారమునాఁడు పసిఫిక్కు మహాసముద్రములో జపాను దీవులనుండి "కమొగటమాయా" అను పేరుగల యొక నావ అమెరికాకు పోవుచుండెను. యోకహామాయను జపానువారి రేవునకు రమారమి నన్నూరు మైళ్ళ కావల $146^{\circ}-17'-9''$ అక్షాంశమును $42^{\circ}-18'-10''$ ధృవాంశమును గల ప్రదేశమున నీ యోడలోని వారికి ఆకాశమున రెండుపక్షులు కానవచ్చెను. రమారమి నూరేసి యడుగుల విస్తీర్ణముగల యట్టి రీతివిహంగములను ఈ లోకములో నెవ్వరునుజూచి యుండలేదు. ఆ విహంగములు ఒక్కొకసారి పై కెగురుచు, నొక్కొక్కప్పుడు క్రిందికి జాఱుచు, మఱియొకవేళ చక్రాకారముగా సుడులు తిరుగుచు నడుమ నడుమ నొండొంటిని నాసాపుటములతో తాఁకి కొనుచు మఱియొకప్పుడు సింహగర్జన ధిక్కరించు శబ్దముతో కూజితము గావించుచు, నింకొకయెడ కదలక మెదలక ఱెక్కలుసాచి యంతరాళమున నచ్చే స్తంభించి నిలువఁబడి పోవుచు విహరించుచుండెను. దూరమాన యంత్రముతోఁ బరీక్షించినప్పుడా పక్షులు సముద్రో పరిభాగమునకు ఒక

మైలు ఎత్తునయున్నవి. ఓడలోని వారందఱును నౌకా పృష్ఠ భాగము నెక్కి యీ పక్షులను జూచుచుండిరి. ఓడ కప్తాను దూరదర్శక యంత్రముతో వీనిని పరీక్షించి యవి గ్రద్దజాతికి చేరినవని నిర్ణయించెను. పెక్కండ్రు బాటసారులు ఈ పక్షుల ఛాయాపటములను గ్రహించిరి.

ఆ. పూ. 13-11-116 న బెహరింగ్‌గు జలాశయము నకు ప్రక్కనయుండెడి అలాస్కాద్వీపకల్పములోని నిర్మానుష్య ముగానున్న తీరమున నీ పక్షులు వడచుచుండెను. అప్పుడు ఆకాశవిమానమున నరుగుచున్న కింగ్సుఫర్డు అనెడి యొక యమెరికాకోటీశ్వరుఁడు ఈపక్షులనుజూచి యవియున్న చోటికి తన విమానమును దింపుచుండెను. దానిని చూచి యాపక్షులు రెండును సముద్రములోనికి పరుగువాఱిలోతు నీటమునిఁగి పోయెను. రెండుదినములు గట్టునవిడిసి కింగ్సు ఫర్డుగారు వీనికై వేచియుండిరిగాని యవి మఱల కండ్లఁ బడలేదు.

ఆ. పూ. 23-11-116 సైబీరియాలోని వ్లాడివస్టాకు నగర ప్రాంతములందలి సముద్రములోని మంచుగడ్డల మీఁది నుండి యీ పక్షులు ఎగురుచుండెను. వ్లాడివ స్టాకు నగరము నుండి మాస్కో పట్టణమునకుఁ బోవుటకు శకట మార్గ మొక్కటికలదు. దీనిపొడుగు రమారమి నాలుగువేలమైళ్లు ఈమార్గము మాస్కోలో బయలుదేరి సమరపురికడ కట్టఁ బడినవంతెన మీఁదుగా వాలుగనదినిదాఁటి, అటనుండి యూ రలు పర్వతముల నధిరోహించి ఐరోపాఖండమునుండి వెలు వడి సైబీరియా దేశపు పశ్చిమ భాగములో ప్రవేశించును. స్టెప్పీలనఁబడునిచటి బయళ్లు ఇంచుమించుగా నిర్మానుష

ములు. దారు నిర్మితమైన గుడిసెలు ఈ ప్రదేశమున నక్క-డక్కడ కానవచ్చుచుండును. అందేదైన నొకమానవ కుటుంబము వసించుచుండును. అచ్చటనుండి టోబాలునది మీఁదుగను, ఇర్టిష్‌నది మీఁదుగను నీ బాట ఓమస్కు-పట్టణముచేరును. ఈ పట్టణము ఓమ్‌నది మీఁదనున్నది. టోబాలును, ఇర్టిష్‌నదియు ఓంకార నామముగల యీ ప్రాచీన నదికి ఉపనదులు. అచ్చటనుండి యీ మార్గము ఓమ్‌నదిని దాఁటి రెండు శాఖలుగా చీలును. అందొకశాఖ టోమునదీ తీరముననున్న టోమస్కు పట్టణమునకుఁ బోవును. ఈ టోమునది ఓమ్‌నదికి ఉపనది. ఈ మార్గపు రెండవశాఖ క్రస్నోరియాస్కు పట్టణముకడ యెనిసీ నదిని దాఁటి, అంగారా భూములలో ప్రవేశించి ఇర్కుటస్కు పట్టణము చేరును. అచ్చటనుండి బైకల్ అను మంచినీళ్ల సరస్సు ఒడ్డునుండి కొంతదూరముపోయి, యాబ్లనాయి పర్వతములు దాఁటి కింఘాను కొండలలోని యొక సొరంగములోఁదూఱి దానియవ్వలి ద్వారమునుండి వెలువడి హార్బిన్ నగరమునుచేరి, యటనుండి యీ దారి వ్లాడివోస్టాకు రేవునకు చేరును. ఈ బాటను ప్రయాణీకులు మార్గము పొడుగున నాలుగువేల మైళ్లదూరమును ఈ పక్షులను జూచిరి. ఈ దూరమును క్రమించుటకు ఈ పక్షులకు మూఁడుదినములు పట్టినది. నేఁటి కాలమున పొగబండి ఈ దూరమును నడచుటకు మూఁడు వారములు పట్టును.

ఆ. పూ. 1-12-116 న ప్రాంసు దేశమునకు పశ్చిమమున అట్లాంటిక్కు మహా సముద్రమున నీ పక్షులు సంచరిం

చుచుండఁగా నా సముద్రమున ప్రయాణము చేయుచున్న యొక యోడలోని ఫిరంగినుండి రెండుగుండ్లు సూటిగావచ్చి యీ పక్షులకు తాఁకినవి. వెంటనే ఱెక్కలు విదలించుచు నివి పశ్చిమ ముఖముగా పది యోజనముల దూరముపోయి ఱెక్కలు విదిలించుటను మాని సూటిగా సముద్రములోఁబడి మునిఁగి పోయినవి.

ఆ. పూ. 3-12-116-న గ్రీన్‌లాండు ద్వీపములోని ఘనీభవించిన మంచుమీఁద ఈ పక్షులు పరుగులిడుచుండఁగా అమెరికాదేశపు తిమింగిలపు వేఁటకాండ్రు వీనిని తిలకించిరి. 9-12-116 న ఆస్ట్రేలియాకడనున్న క్రొత్త జీలండులోని కుక్సు జలసంధిలో నొకయోడ పోవుచుండెను. వెల్లింగ్టన్ రేవు నుండి పోర్టునెల్సన్ అను రేవునకు పోవుచున్న యీ యోడ ప్రక్కను జలమధ్యమున నొకచోట భయంకరముగా నొక సుడిగుండము కానవచ్చెను. సముద్రపటములలో లేనట్టియు, పూర్వప్రయాణములలోఁ గానరానట్టియు ఈ సుడిగుండమును ఓడకప్తాను జాగ్రతగా పరిశీలించి యంత్రములతో చూచు చుండెను. ఇంతలో నా సుడిగుండమునుండి రెండు పక్షులు పైకిలేచి ఆకసమున కెగిరినవి. భయంకరమైన వాని యాకారము ఓడలోని ప్రయాణికులనెల్లఱను కంపింపఁజేసినది. ఎవ్వరిని తన్నుకొనిపోయి యీ పక్షులు కబళించునో యని యెల్లరును తల్లడిల్లిరి. ఇంతలో ఓడనుండి ఒక్కసారిగా నిరువది ముప్పదిగుండ్లు ఈ పక్షులకు తగిలి ఖంగునమ్రోఁగినవి. తోడనే యవి యాకసమునుండి నీటఁబడి మునిఁగిపోయెను.

ఆ. పూ. 12-12-116 న పసిఫిక్కు మహాసముద్రము

లోని సోలొమన్ దీవులలో కాళ్లు లేనిపక్షియొక్కటి తిమింగిలపు వేటకై యుత్తర మహాసముద్రమునకుఁ బోవుచున్న యొక యోడఁ ప్రక్కనే సంచరించుచుండెను. ఆ యోడలోని సుప్రసిద్ధుఁడగు తిమింగిలపు వేఁటకాఁ డొక్కఁడు పెద్ద త్రాఁడుతో తమ యోడకు బంధింపఁబడియున్న యొకశూలమును ఈ పక్షి మీఁదికి విసరెను. ఆశూలము పక్షి శరీరమును దాఁకి దానికే అంటుకొని పోయెను. శూలమునకుఁ గట్టఁబడిన త్రాఁడు ఓడకు బంధింపఁబడియుండెను. శూలము తనకుఁ దగులఁగానే యీ పక్షి ముడుచుకొన్న కాళ్లుసాఁచి అతి వేగముగా నీట పరుగెత్తుకొనిపోయినది. ఓడయు ఆ పక్షి ఈడ్చినట్లెల్ల సంచరింపసాఁగినది. తుదకు దాని కప్తాను శూలముకట్టిన త్రాటిని ఛేదించి తన యోడను సంరక్షించుకొనఁ జాలెను.

ఇట్టి సంఘటనలు పెక్కులు జరుగుటచే చిత్రపటములతోఁ గూడ నీ పక్షుల చర్యలు క్రైస్తవ ప్రపంచములోని పత్రికలం దెల్లెడలను ప్రచురింపఁబడినవి. అవి పక్షులని కొందఱును, కావని మఱికొందఱును తర్కములుచేయు నారంభించిరి.

ప్రపంచమంతయు నా వార్తలతో నిండిపోయినది. బహు ప్రదేశములనుండి వర్తమానములు తెప్పించి వానిని విమర్శించుచు పత్రికలు వీని చర్యలను వింతగా విమర్శింపసాగెను. ఆ సమయమున లండన్ టైమ్సు పత్రికయందు ఈ క్రిందివ్యాసము ప్రకటింపఁ బడినది.

“ అద్భుతమైన పక్షి ”

“రమారమి నెల దినములనుండి విచిత్రమైన పక్షులు

రెండు భూలోకమంతటను సంచారములు గావించుచున్నవి. సముద్రపుమట్టమునకు ఒకమైలు ఎత్తున నివి ఎగురుటనుబట్టి వీని రెక్కలు బలిష్ఠమైనవని నిర్ణయింపవచ్చును.

"ఇవి మొదట జపాను-అమెరికాల నడిమి సముద్రములోను, ఆ వెనుక అలాస్కాద్వీప కల్పములోను పిమ్మట సైబీరియా—మాస్కో మార్గమునం దంతటను గానవచ్చినవి. తరువాత నివి అట్లాంటిక్కు మహాసముద్రములోని ఫ్రెంచి వారి యుద్ధనావలలోని గుండుదెబ్బకు సొమ్మసిలి నీటఁబడియును, క్షణమాత్రములో తేలుకొని గ్రీన్లాండులోని మంచుగడ్డలమీఁద విహరింపసాగినవి. ఇవి కుక్సు జలసంధిలో విహరించుచుండఁగా నిరువదియారు గుండ్లు సర్గినియా యను నోడనుండి వీనికి తగిలినవి. గుండుదెబ్బ లోహపుఱేకునకుఁ దగిలినదో యనునట్లుగా నా ఱేకుడువలన ఖంగుమను కంచు సంబంధమైన శబ్దము ఓడలోనికి వినవచ్చినది. ఆ దెబ్బతగులఁగానే యీ పక్షులు విలవిల తన్నుకొనుచు భయంకరముగా నార్చి సముద్రములోఁ బడిపోయినవి. అప్పటి కూఁత లోహపు గొట్టమునుండి వెలువడు శబ్దమువలెఁ వినవచ్చినది. ఇరువది యారుగుండ్లు తగిలినను నీ పక్షులు చావలేదు. వీనిమీఁది కొక తిమింగిలములను వేటాడు శూలమును విసరగా నది వీని శరీరమునకు అంటుకొని పోయినదిగాని గాయము కాలేదు. వేయిగుఱ్ఱముల బలముతో పోవుచున్న ఒకపక్షి ఈ శూలము విసరిన ఆక్సుఫర్డు నావను గతితప్పించి నలుప్రక్కలకును లాగుకొని పోయినది. ఓడ యజమాని శూలమును గట్టిన

త్రాటిని మెలకువతో ఛేదించి తనయోడను కాపాడుకోఁ జాలెను. ఒక్కొక్కపక్షి నూరు గజముల వైశాల్యముకలది.

"ఈ పక్షులకు ఆహారమెట్టిదో, ఇవి యే జాతికి చేరినవో నిర్ణయింప రాకున్నది. దినమునకు 2,000 మైళ్లదూరము ఇవి సునాయాసముగా పోఁగలవు. జరిగిన సంఘటనలను బట్టి చూడఁగా నివి ఆకసమునను, సముద్రమునను, సముద్రగర్భమునను, నేలమీఁదను గూడ సంచరింపఁగలవు. ఇంతవఱకు వీనివలన ప్రమాదము లెవ్వియు జరుగలేదు. కాని నాగరిక ప్రపంచమంతయు నీ పక్షులు ఏనాఁడు ఎందు తిరుగునో నిరీక్షించి చాయాపటములు పట్టి శాస్త్రశోధన చేయవలసియున్నది."

టైమ్సుపత్రికలోని పైవ్యాసము లోకములోని శాస్త్రజ్ఞుల నందఱను ఆకర్షించెను.

లోకములో నట్టి పక్షులు అసంభవములనియు, కాని కొన్ని జాతుల పురుగులు పెద్ద పెరిగినప్పుడు ఱెక్కలు తొల్చుననియు, ఈపక్షులు తిమింగిలములకు సంబంధించిన సముద్రపు చేఁపలు కావచ్చుననియు జంతుశాస్త్రజ్ఞులు తలంచిరి. వీనివలన ఓడలకుఁగాని పట్టణములకుఁగాని ఎట్టిహానియు జరుగుట లేదు. కావున సాధ్యమగుచో సజీవముగానే వానిని పట్టుకొనుటకు నిశ్చయింపఁబడినది. ఫిరంగిగుండ్లను సహితము లక్ష్యముచేయని యిట్టి పక్షులను చంపుటకు ఒక్క యుద్ధనావ నుండి ఏకకాలమున వేలకొలఁది గుండ్లు వీనికి తగులవలెను. అందువలన ససైన్యముగా ప్రతి క్రైస్తవదేశము నుండియు యుద్ధనావలును జలాంతర్గాములును వాయువిమానములును వలసిన పరికరములతో నీపక్షి వేఁటకు బయలుదేరినవి.

ప్రపంచములోని స్వతంత్రరాజ్యములన్నియు తమ తమ యోడలకును తమ యున్నతోద్యోగస్థులకును నిశ్లే తంతి వర్తమానములు పంపించెను.

# పదునొకొండవ ప్రకరణము

లలితా మహాదేవికిఁ దెలియకుండనే తగుసన్నాహములు కావించుకొని ప్రేమవతి నలువురు చెలికత్తెలతోను నూర్వురు సేవకురాండ్రతోను, వలసిన యంత్రకారిణులు మున్నగువారి బలగముతోను, ఐదేసివేలటన్నులు మోయఁగల మూఁడు జలాంతర్గాములతోను, నాలుగు వాయువిమానములతోను ఏఁబది ప్లుత మనోహరిణులతోను, సమస్తప్రకృతి శాస్త్ర సంబంధమైన యంత్రములతోను, నొక యేడాదికి చాలిన యాహారాద్యితర పదార్థములతోను నొకనాఁటి శుభోదయమున శాంత మహాసముద్రమునుగూర్చి వెడలిపోయెను. నౌకలును యంత్రములును బందరురేవున నిర్మింపఁబడి సర్వ పదార్థములతో నింపఁబడి ప్రయాణసమయమునకు మూఁడు దినములకు ముందుగా మాత్రమే కోరంగిరేవున సముద్రపుటడుగున విడిసినందున వానిని ఒరు లెవ్వరును గమనింప వీలు లేకపోయెను, ఱేఁపు ప్రయాణమనఁగా నప్పటికి లలితామహాదేవికొఱకు ఉద్దేశింపఁబడినట్టియు నీటను గాలిలోనుగూడ సంచరింపఁగల యట్టియు, విమాన జలాంతర్గామి సిద్ధమైనది.

వెడలిపోవునప్పుడు ప్రేమవతి యీక్రిందిలేఖను వ్రాసి యానయంత్రములోని రాణిగారి మందసములో నునిచెను:—

"తల్లిగారికి ప్రేమవతి దండములుపెట్టి యంపుకొను విన్నపములు"

మన్నుదిన్న పాములవలె యింటఁబడియుండువారికి భోగభాగ్యములు చేకూఱవు. "సాహసేలక్ష్మి" యని ప్రాచీన వాక్యము విధించుచున్నది. ఎన్నిసారులు నన్ను శాంతమహాసముద్రములోనికి పంపుఁడని వేఁడుకొన్నను తల్లిగారు నాయెడ కరుణింపలేదు. దానికిఁ గారణము తల్లిగారి ప్రేమాధిక్యత గాని నాయయోగ్యత కాదని ఎఱిఁగినవారికే తెలియును. తల్లిగారాబమున నవికసనులై పోవు బిడ్డలట్లే నేనును అయిపోవుదునను భయమును, అనంతమహోదధులలోని రత్నరాసులను నొల్లుకొనవలెననెడియాశయు, నావిద్యను ఆచరణయోగ్యముగావించి ఫలసిద్ధినందవలెనను నుత్సాహమును, ప్రకృతిశాస్త్రశాసనములతో లోకోత్తరమైన మతమును భూవ్యాప్తముగావింపవలెనను దీక్షయు—నొకదానికంటె నొకటి బలీయములై నన్ను ఈడ్చుకొనిపోవుటచే తగు సిబ్బందితో నేఁటిదినమున తమకుఁ దెలుపకుండఁగనే శాంతమహాసముద్రములోనికి బయలుదేఱితిని., ప్రమాదసమయమున ఎప్పటికప్పుడు వాయుమార్గమున విద్యుద్వార్తలు తమకు చేరఁగలవు. నా యీదుండగమును తల్లిగారు మన్నింతురుగాక. నా పరివారములో నీక్రిందియంగనలు చేరియున్నారు. మేమెందు ఉందుమో మా ప్రయత్నములు ఎట్లు సిద్ధించునో మాకే తెలియనందునను, వెంటనే మఱలిపోయివచ్చివేయుఁడను తమయాజ్ఞను అందు

కొనుటకు ఇచ్చలేనందునను, మాయునికి మనుకులనుగూర్చి మాపత్సమయమునఁగాని తమకు విన్నవింపఁదలంపులేను. నేనువచ్చుదాఁక నాసొత్తులను ఆర్షసమాజమువారు పరిపాలించునట్లు విధింపవలెను.

మీదత్తపుత్రిక కావించిన యీసాహసపుచేష్టను దయతో మన్నింతురుగాత ఇంతేమఱల తమపాదపద్మములకు పునఃప్రణామములు.

పెద్దాపురము.
శ్రీముఖచైత్ర శు॥
పాడ్యమి.

ఇట్లు
తమ కుమారిక,
ప్రేమవతి.

| సిబ్బంది | సంఖ్య | పేరు* |
|---|---|---|
| నౌకానియంత్రి | ఒక్కడే | |
| ద్వితీయోద్యోగులు | నలువురు | |
| తృతీయోద్యోగులు | నలువురు | |
| చతుర్థోద్యోగులు | నలువురు | |
| వాయుశాస్త్రవేత్తలు | నలువురు | |
| క్రిమిశాస్త్రవేత్తలు | తొమ్మండ్రు | |
| రత్నపరీక్షకులు | పదిమంది | |
| లోకపరీక్షకులు | ఇరువదిమంది | |
| ఖనిఖననాధ్యక్షులు | ఏడ్గురు | |
| వృక్షశాస్త్రవేత్తలు | నలువురు | |
| విద్యుచ్ఛాస్త్రవేత్తలు | ఇరువదిమువ్వురు | |
| విమానచోదకలు | ఆఱ్వురు | |

* అనవసరమని పేర్లు ముద్రించలేదు.

| సిబ్బంది | సంఖ్య |
|---|---|
| భూగర్భశోధనులు | పందొమ్మిదిమంది |
| గృహనిర్మాత్రులు | ఇరువదిమంది |
| యంత్రనిర్మాత్రులు | పన్నిద్దరు |
| కృషిపాలికలు | పదుమువ్వురు |
| పశుపాలికలు | తొమ్మండ్రు |
| అస్త్రపాలికలు | పదిమంది |
| ప్రధానవైద్యులు | పదిమంది |
| శస్త్రవైద్యులు | పదిమంది |
| పాకశాలాధికారిణులు | ఆఱ్వురు |
| ఛాయాపటగ్రాహిణులు | ఎనమండ్రు |
| చక్రరక్షిణులు | పదునొకండ్రు |
| జీవశాస్త్రవేత్తలు | పదినల్వురు |
| కంచరులు | ముప్పదిమంది |
| కమ్మరులు | ఇరువదియిద్దఱు |
| వడ్రంగులు | ఇరువదియార్వురు |
| శిల్పులు | పందొమ్మిదిమంది |
| శిలావేధికలు | పదునేడ్వురు |
| కోశాధికారిణి | ఒక్కతె |
| ముద్రణాధికారిణి | ఒక్కతె |
| వార్తాహారిణులు | ఎనమండ్రు |
| టంకసాల కధికారిణి | ఒక్కతె |
| పటకుటీర నిర్మాత్రులు | ఇరువదిమంది |

| సిబ్బంది | పేరు |
| --- | --- |
| ప్లుతమనోహారిణీ నిర్మాతృలు | ఇరువదిమంది |
| నూతన యంత్రనిర్మాతృలు | ముప్పదిమూడు |
| నాణకనిర్మాతృలు | ముప్వురు |
| ప్రకృతి శక్తిశోధకి | ఒక్కతె |
| ధర్మశాస్త్రశోధకి | ఒక్కతె |
| శీతలవివేచకి | ఒక్కతె |
| పాచికలు (వంటలకు) | ఇరువది ముప్వురు. |

ప్రయాణ దినమునకు రెండునాళ్లకు ముందునుండియు సేవకురాండ్రు జలాంతర్గామి లోనికి రహస్యముగా చేర్పం బడుచుండిరి. ప్రయాణదినపు టుదయమున నొక చిన్నయోడలో ప్రేమవతియు అమోఘశాసని, విజ్ఞానశృంఖల, ప్రకృతిదేవి, కరుణ, మహాలక్ష్మియను నేవురు చెలికత్తెలును బయలుదేఱి, జలాంతర్గాములు విడిసిన తావున ప్లుతమనోహారిణు లను దాడిగికొని, యొక్కసారి సముద్రపుగట్టును, నందలి చెట్లను, సముద్రములోని యోడలను ప్రేమ పూరితములై యశ్రుపూర్ణములైన దృష్టులతోఁ బరికించి నీటమునింగి పోయిరి. పోయి ప్రేమవతి నివాసమున కుద్దేశింపఁబడిన జలాంతర్గామినిచేరి సంకేతమును దెలుపుఘంటకు మీటనొక్కిరి. తోడనే యా జలాంతర్గామిపైన నొక మీట సడలినది. ప్రేమవతి యచ్చోట విడివడిన యొక తలుపును దెఱచినది. అచ్చోట నొక సోరంగము కానవచ్చినది. అందఱును మెట్లగుండ నా సోరంగములోనికి దిగి పై తలుపును బంధించివెచి

యొక మీటను నొక్కిరి. ఇప్పుడు సముద్రములోనికి తెఱచు కొన్న తలుపు మూసికొనిపోయినది. పైనీరు లోపలికి రాదు. ఇట్లు జలాభేద్యముగా కవాటమును బంధించి వారు మఱి యొక మరను నొక్కిరి. తోడనే వారున్న సొరంగములో సుఖవాయువులు ప్రవేశించి లోపలినీటిని సముద్రములోనికి వెడలించి వైచినవి. లోని నీరంతయు వెడలిపోఁగానే యా పార్శ్వమున మఱియొకతలుపు లోనుండి తెఱువఁబడినది. ఆ దారిని వీరు ప్రేమవతికి ఏర్పఱుపఁ బడిన జలాంతర్గామిని లోని యొకగదిలోఁ బ్రవేశించిరి. తోడనే సొరఁగములోనికిఁ గల తలుపు వాయువైన చొఱనంత దిటవుగా మూసికొని పోయినది.

జలాంతర్గామినియందు అనేకములైన యఱలుకలవు. గుఱ్ఱపుసాలలు, ఆవులకు ఎద్దులకు సాలలు, పనిచేయుచుండు యంత్రములకు గదులు, ఒక్కొక ప్రకృతిశాస్త్ర శోధనకు ఒక్కొక నానాయంత్ర సంపూర్ణమగు నొక్కొక్క యఱ; వలసిన పరికరములకు, ధాన్యాదులకు కొట్లు; నిలువయుండని యాహార పదార్థములను సేకరించుటకు మంచుగడ్డలతో నిండిన కొట్టు; ఇండ్లు, డేరాలు, బండ్లు; ఇతర నివాస విహారాదులకు వలసిన పదార్థములను పరికరములను ఉంచుటకు కొట్లు; అశ్వాదులకును వలసిన యాహారాదికమునకు గదులు, భోజనశాల, పుస్తకశాల, పాకశాల, స్నానశాల, పనివాండ్రకు వసతులు; విమానములు, మంచుమీఁద నడచు బండ్లు, మున్నగువానికి వసతులు; నూతనయంత్ర నిర్మాణమునకు వలసిన ఇనుము, రాగి మున్నగులోహములు, తీగెలు-

మున్నగువానిని సేకరించుటకును నిర్మించుటకును యంత్ర శాలలు; విద్యుద్యంత్రములు; దాహోదకపు తొట్టెలు; నేల బొగ్గు,—ఇట్లు సమస్తకార్యములకు వలసిన పదార్థములకు స్థలము కల్పింపఁబడెను. ఈ వస్తువులతో నే డెనిమిది తావులలో సముద్రగర్భమున పల్లెలు నిర్మించుకొని గనులు త్రవ్వ వచ్చును. ఆకాశవిహార మొనర్పవచ్చును. భూమిమీఁద నూతన రాష్ట్రములు స్థాపించి యందు గృహములు, పొల ములు తోఁటలు కల్పింపవచ్చును. అణువునుభేదించి విద్యు చ్ఛక్తిని దీసి దానితో సర్వయంత్రములు నడిపింప ననువు కూర్పఁబడినది.

ఇట్లు సర్వశుభలక్షణ లక్షితమైన యా జలాంత గ్గామిలోఁ దన కొలువు కూటమున సింహాసనముకడ నిలిచి విద్యుద్దీపములు వెలుఁగుచుండఁగా విద్యుద్వ్యంతములు గాలి విసరుచుండఁగా, నెల్లరును దనచుట్టును చేరి నిలిచి యుండఁగా ప్రేమవతి తన చేతి గడియారమును జూచుకొని మేఘ గంభీర భాషణములతో వీణలుమ్రోఁగ, తాళములు తేఁగ మద్దెలల ధ్వనులు గంతులిడుచు చెలఁగ ఈశ్వర ధ్యానమును ఈశ్వ రున కాత్మ సమర్పణమును జేసికొనుచు నొక గీతమును ఇట్లు పాడెను :—

ఈశ్వరా! మా యాత్మలను నీ-కిచ్ఛతో నర్పించుచుం.
శాశ్వతుఁడవగు నీదు సేవకు-జనెడు మము రక్షింపుమీ. ||౧||
అణువునందు మహత్తునందును నఖిలమందు వెలుంగుచుం
గణనసేయ నసాధ్యమైన జగంబులన్నిఁట నీవమై

గుణుఁడవును నిర్గుణుఁడవును నయి-గుణగణాతీతుండవై
మునులచే బ్రహ్మమను పేరున-బొనరు నీకు నమస్కృతుల్ ॥ ౨
ఏమహత్తరు శాసనంబున-నిలయు వాయువు నగ్నియున్
వ్యోమమును నీరము సమిష్టిని-గొంచు బ్రహ్మాండాకృతిన్
క్షేమదము జ్ఞానదము నిత్యమ-చింత్య మవ్యయ మచ్ఛమౌ
నామహేశుని మూర్తి మాకన-నంత సిద్ధులొసంగు తన్ ॥ 3

"ఓ పరమేశ్వరా! ఈజగత్తు నీయది. ఇదియే నిన్ను మాకుఁ దెలుపు పరమ సాధనము. ఈ సృష్టిని సేవించి యందుండి నీశాసనములను జగములకుఁ బ్రకటింప నకలంక హృదయములతో మేముచేయు నీ యారంభమునకు నీ యాశీస్సుల ననుగ్రహింపుము, నీ పవిత్రరాజ్యము జగముల కనంత కల్యాణముల నొసంగుఁగాత" మని ప్రార్థించెను.

అప్పటికి సరిగా తొమ్మిది గంటలు మ్రోఁగినవి. మూఁడు జలాంతర్గాములును నొక్కసారిగా కదలి సముద్ర గర్భమునందు ప్రయాణ మారంభించినవి.

# పండ్రెండవ ప్రకరణము.

## సముద్రరాజ్య పట్టభద్రత్వము.

ప్రేమ—సఖీ! విజ్ఞానశృంఖలా! స్వేచ్ఛ యనునది యెంత మధురమైనది! ఇంతకాలమునకు రాణిగారి కన్నుఁ బ్రామి దుర్లభమైన యిట్టి ముక్తిని సంపాదించితిమి.

అమో—అనఁగా ఇప్పుడే మానవత్వము నందుటకు ప్రథమ ప్రయత్న మారంభించితిమి.

విజ్ఞాన—మానవత్వము ఇంతమునుపు మనకు లేదా?

అమో—ఒకరు తెచ్చినదియే తినువారును, అక్రమములకుఁజొచ్చి సంపాదన చేయువారును మనుష్యులనియే నీ నమ్మకమా? వారు రెండుకాళ్ల మెకములు. నేఁటి మహనీయ నాయకులలో ఇట్టి మృగములను వ్రేలెత్తి చూపి మనము పసివాండ్రకు వస్తు పాఠము నేర్పవచ్చును.

మహాలక్ష్మి—గొప్పవాండ్ర విషయమై అట్లు పలుకవచ్చునా?

అమో—వర్షము కురిసినప్పుడు మన వస్త్రముల మీఁద మట్టి పుష్పములు రచించుచు స్వారివెడలు విజ్ఞానశీలురేనా నీ గొప్పవాండ్రు? శ్రీమంతులకు నేత్రములు నడినెత్తిని ఉండును.

ప్రకృతి—అది "అల్పసిరి" కలవారిమాట.

అమోఘ—"అల్పసిరి" గాక అధికసిరి గలవారిని ఈలోకములో ఎవ్వరినైన నీవు చూచితివా?

మహలక్ష్మి—నీతో పోట్లాడగలవా రెవ్వరు? కాని రెండుకాళ్ల మృగములు తిరుగు ప్రకృతినుండి మన మిప్పుడు నిర్మల జీవనమునఁ బ్రవేశించితిమి.

కరుణ—రెండు కాళ్ల మెకములు వసించు ప్రకృతిని దాఁటితిమంటివి. ఈ గదిలోని యీ యద్దమునుండి సముద్రములోనికి చూడుము? మనమిప్పుడు ఆ కాళ్లుగూడ లేని మృగములు సంచరించు ప్రకృతిలోనికి వచ్చితిమి.

ప్రకృతి—ప్రకృతి దేవత రెండుకాళ్ల మేకమును, కాళ్లు లేని మేకమును కానేరదు.

విజ్ఞా—ఓహో నిన్నెవరును ఎత్తి పొడుచుటలేదు. ఆ జంతువును జూడుము. ప్రకృతిచేతనే యది నాలుగుకాళ్ల నీటిమేకము.

ప్రకృతి—మనుష్యులును మృగజాతిలోని వారే. మేకములని యేల యెత్తిపొడిచెదవు? మేకములు మేకములని యను వారందఱును గూడ మేకములు కారా?

విజ్ఞా—మేకమన్న నీకంత కోపమెందుకు? ఈ జంతువును జూడు. ఇది వేయిరాళ్ల జెట్టి.

మహాలక్ష్మి—నీ విజ్ఞానము విపరీతముగా నున్నది. జెట్టి మహాలక్ష్మి కాదా?

విజ్ఞా—నీవును మహాలక్ష్మివే. ఇఁక ప్రజలను కుట్టుట మాత్రమే మిగిలియున్నది. వేగమే ఆపనిగూడ అరంభింపుము.

విజ్ఞా—మనము అతి సాహసము చేసితిమి. మన సంగతి తెలిసినప్పుడు ఇంటింట మనవారు ఎంత ఏడ్తురో?

అమో—ఏడుపు అనునది మెదడులోని కొన్ని నరముల కదలిక వలనఁ గలుగునట్టి సంచలనము.—గాలికి ఆకులు అల్లాడునట్లే.

కరుణ—నలకల కదలిక యన్నంత మాత్రాన మానవాను భవములకు సమాధానము వచ్చునా? జేపటినుండి మనయూర ఇటింటను ఆలగోడు బాలగోడు—“ లబాయలు—దిబాయలు.”

అమోఘ—మందు వెగటని రోగము పెంచుకొనువా

రుందురా ? ఎల్లకాలమును మనము అజ్ఞాన కూపములోనే పడియుండ వలెనా ?

విజ్ఞా—మనకింతటి విద్య నొసఁగిన లోకము అజ్ఞాన కూపమెట్లగును ?

అమో—మానవ జీవితములో బ్రహ్మచర్యాశ్రమము అట్టి కూపమునందే దాఁటినది—గర్భస్థ పిండమునకు వలెనే. ఇఁకముందు గృహస్థాశ్రమములో మనము ప్రవేశించుచున్నా ము. సద్విద్యా వినియోగమే మన గృహస్థాశ్రమ ధర్మము.

ప్రేమ—రాణిగారి వంతకు మేరయుండదు. పాప మామె యిప్పుడిప్పుడే సోదరమరణ దుఃఖమునుండి తేఱుకొను చున్నది. ఇంతలో మనమీ శల్యమును తెచ్చిపెట్టితిమి.

అమో—అహంకారము వంటిదే మమకారమును. ఇవిరెండును రెండు అడవిమృగములు. వీనినిజయించి నిర్మల జ్యోతిని ఆత్మలోఁ బ్రతిష్ఠించుటయే జీవికి ధర్మము. ఇదిగాక యెంతటి ఘోరదుఃఖములును బ్రాతగిలి కాలగర్భమునందు అణఁగిపోవును.

కరుణ—నోరు తెఱచుకొని పరుగెత్తుచున్న యాపెద్ద చేఁప నోటిలో నెన్ని చిన్నచేఁపలు చిక్కుకొన్నవో ? గుబు క్కున నోరుమూసి, నీరువెడలించి యది వానిని అన్నింటిని మ్రింగివేసినది

అమోఘు—అవును. నీవుమాత్రము మ్రింగుటలేదా ? నీవు తినెడిదానిని? బలముగలవానిదే రాజ్యము. అన్నింటికిఁ జాలినవాఁడే బ్రదుకవలసిన వాఁడును బ్రదుక నేర్చినవాఁడును.

అల్పజీవముల మృత్యువే అనల్పజీవముల జీవనహేతువగుట ప్రకృతి సిద్ధాంతముకాదా?

ప్రకృతి—ధనవంతునకు దరిద్రులు సేవకులగునట్లు.

అమోఘ—పెద్దపులి మేఁకను మ్రింగునట్లు.

ప్రేమ—ఈయమోఘ శాసని మనకు ఇంటి తలంపు రాకుండ అడ్డగించి డీకొనుచున్నది. పెద్దవేదాంతి అయిపోవు చున్నట. పోనిమ్ము ఇటుచూడుము. ఇప్పుడు మన యోడపరు వెత్తుచున్నదా మనము పరువెత్తుచున్నామా?

అమో—నా బుద్ధిమాత్రము సముద్రములో మునిఁగి యున్న యీ కొండలబారు వంకకుఁ బరువెత్తుచున్నది.

ప్రకృతి—భూమిలోవలెనే సముద్రములోఁగూడ మిట్ట పల్లములు, కొండలు, గుట్టలుగూడ కానవచ్చుచున్నవి. సముద్రము కడుపున దాఁగియున్నవీనిని నేత్రములతోఁ జూడఁగల భాగ్యము జలాంతర్గాములలో సంచరింపఁగలవారికి మాత్రమే ప్రాప్తించును.

విజ్ఞాన—సముద్రపు టడుగుననున్నది మాత్రము భూదేవికాదా? దానినిబట్టి సముద్రగర్భ మెట్లుండునో ఊహించుకో లేమా?

ప్రకృతి—ఇచ్చోట కండ్లు మిఱుమిట్లు కొలుపుచు సముద్రము వజ్రకాంతులతోఁ బ్రకాశించుచున్నదేమి?

మహాల—మంచు కలుఖ్లమీఁది సూర్యరశ్మివలె మన యోడనుండి వెడలు విద్యుత్కాంతులవలన ఈ కాంతులు మఱియు నతిశయించుచున్నవి. మన మిప్పుడొక వజ్రపుగని నడుమ చిక్కుకొన్నాము కాఁబోలు?

విజ్ఞా—ఇవియొకజాతి తళతళ మెఱయు సముద్రకీటములు. కొన్నిచోట్ల పంబడిమైళ్ల దూరముదాఁక(గూడ నివి సముద్రజలము నావరించుకొని యుండును. వీనిగుండ త్రోవ చేసికొని మన యోడలు పోవుచున్నవి.

ప్రేమ—ఇవి వజ్రకీటకములు. అట్లే సముద్రములో కొన్నిచోట్ల కెంపులనీరును, పచ్చలనీరును, గోమేధికముల నీరును—అన్ని రంగులనీరును కానవచ్చుచుండును. ఎట్టి పురువులుండునో అచ్చటినీటికి అట్టిరంగు.

విజ్ఞా—మన క్రిమిశాస్త్రవేత్తలు అడుగడుగునకు గొట్టపు పెట్టెలుదింపి వీనినిఁ బట్టుకొని మూఁడవ జలాంతర్గామిలో శోధించుచున్నారు. అట్లే దారిపొడుగునను సముద్రపు టడుగుమట్టియు శోధింపఁబడుచున్నది.

ప్రకృతి—ఈ యోడ పార్శ్వభాగము ఎంత వేఁడిగా నున్నదో చూడుఁడు. ఇచ్చోట నీటిలో జంతువులంతగా కానవచ్చుట లేదు.

ప్రేమ—సముద్రములోఁగూడ నదులుకలవు. అందు కొన్ని యుష్ణవాహినులు; కొన్ని హిమశీతలములు. ఇప్పుడు మన నావలు ఒక యుష్ణవాహినిగుండ పోవుచున్నవి. ఆ వేఁడిమి చేత నిందలి జలములలో జీవింపఁగలబహు జంతువులు లేవు.

ప్రకృతి—శ్లీతవాహినులతో మనమీ యుష్ణజలములలో సంచరింపరాదా? అది ఎంత వినోదకరమై యుండును?

ప్రేమ—ఈ నీటికి మన శరీరము బొబ్బలెక్కిపోవును. ఆ యుష్ణమానిని చూచితివా?

ప్రకృ—అవును 89° శత. వేడిమికలదు. పోనిండు. ఈనీట విహరింపలేము. కాని తళతళ మెఱయు ఆ కొండల వరుసను చూడుఁడు. ఆ కొండలలో మనము గనులు శోధింప రాదా ?

అమో—మనదేశపు గనులవలన మనకు క్రొత్తగా చేరు భాగ్యములేదు. విదేశపుధనము మన కెంతచేరునో మన దేశమున కంత భాగ్యలాభము.

ప్రకృతి—పోనిండు. ఇంకనైన మనము నీటిమీఁది తేలి ప్రయాణము చేరరాదా ?

మహా—మున్నూరు క్రోశములు దాఁటినదాఁక నీట తేలరాదని మహారాణిగారి యాజ్ఞ.

టివ్వూటివ్వూన శరవేగముతో పెద్ద తిమింగిలముల వలె నీ జలాంతర్గాములు ప్రయాణమును ఆరంభించెను. ఎంత బరువునైన కొనిపోవుటకు అందు సౌకర్యములు కూర్పఁబడి నవి. ఒక సంవత్సరమునకు వలయు నాహారము పంచుగడ్డల నడుమ సేకరింపఁబడినది. యుద్ధమునకు వలసిన పనిముట్ల న్నియు నింకొకచోట అమర్పఁబడినవి. విద్యుద్యంత్రమువలన నీ మోడ నడుపఁబడుటకు సమస్త సదుపాయములును చేకూ ర్పఁబడినవి. ఔషధములు, పీతాంబరములు, ఉన్ని వస్త్ర ములు, సుగంధాదిలేపములు, నేఁతమగ్గములు, శాస్త్రపరికర ములు—ప్రతిపదార్థమును యథాస్థలమున నొప్పారుచున్నది. ఆటలకు, పాటలకు, వినోదములకు స్థలము కల్పింపఁబడినది. ఉత్తమమైన పుస్తక భాండాగారమొక్కటి యిందు చేర్పఁ బడినది.—ఇదియది యననేల ? సర్వ సౌకర్యపూరితమై, సర్వ

లక్షణ లక్షితమై యా జలాంతర్గాములు జలలోక స్వర్గ ధామమై రెండవ ప్రపంచమువలె రాజిల్లునట్లు సర్వవస్తు సంపూర్ణముగా చేయఁబడినవి. ఱివ్వుఱివ్వన శరవేగముతో నవి లోతునీట మునిఁగి సంచరింపసాగినవి. రత్నకంబళముల తోను చిత్ర పటములతోను నిలువుటద్దములతోను అలంక రింపఁబడిన తన కొలువుకూటమున ప్రేమవతి తన చెలికత్తె లతోఁ గూరుచుండి ఓడగోడలోని యద్దముగుండ సముద్ర మును వీక్షించి యానందించుచున్నది. చిఱుమీలు, పెద్ద చేఁపలు, భయంకరముగా నోరుతెఱచి ఓడను డీకొను మహా మీనములు, క్రూరములైన మొసళ్లు, తాఁబేళ్లు, రంగు రంగుల సముద్రకీటకములు, విషదంష్ట్రములైన బారల పొడుగు సముద్ర సర్పములు—ఆ యద్దమునుండి వీరికి నేత్రపర్వ మొనర్చుచుండెను. ఒకసారి మొసళ్ల మడుగులందును, మఱి యొకసారి గుట్టలవలె చేరి యీఁదుచుండెడి మత్స్య సము దాయ మధ్యములందును, మఱియొకవేళ తళతళ మెఱయుచు సూర్యజ్యోతులను మఱపించు తళుకుం జేఁపల గుములగుండను దారిజేసికొని పోవుచు, అడ్డమువచ్చిడీకొన్న యెట్టి మహాజంతు వునైన తన పైనిగల కత్తులతోను శూలములతోను ఖండించి వైచుచు ఈ జలాంతర్గాములు సముద్రునకు భయపడక, సముద్రజంతువులకు లోనుగాక అడ్డులేక హద్దుమీఱక యథే చ్ఛావిహారము చేయుచు నా సముద్రగర్భమున నద్భుత వేగ ముతో ప్రయాణము చేయుచుండెను. ఎగిరెడు చేఁపలును, పరువెత్తెడి చేఁపలును, ఒండొంటితో నాఁడుకొను మీన ములును, ఒక్కచోట నిలిచి డెక్కలాడించు మీనములును,

దృష్టిపర్వము గావించుచుండెను. నక్కినక్కి పైఁబడి కబళించు మొసళ్లును, వెడఁదనోట నదృశ్యములగు నల్ప జంతువులను గబళించు మహామీనములును భయంకరములై యుండెను. తన్నుఁజూచి పాఱిపోయెడి జంతువులు కొన్నియు, తన్నెదిరించి తాఁకువడి వితాకుఁజెందు జంతువులు కొన్నియు, తనచే ఖండింపబడి రక్తధారలతో తేలిపోవు జంతువులు కొన్నియు వీరి నాకర్షించుచుండెను. ఇట్లు మన జలాంతర్గాములు గంటకు ఇరువదిమైళ్ల వేగముతో సముద్రపు పైమట్టమునకు ఏఁబది యడుగులలోతున ప్రయాణముచేయుచు నొక్కదినము గడపినవి. పట్టరాని సంతోషముతో స్వేచ్ఛగా ప్రేమవతి యా దృశ్యములను జూచుచు లోకమును మఱచి యెసలారెను. ఇపుడు లలితా మహాదేవి తన్నేమియు చేయలేదు. చెలికత్తెలు తన యడుగులకు మడుఁగు లొత్తువారు. ఇఁక తనదే రాజ్యము. తనదే యీ లోకము. ప్రేమవతి యానందాంబుధి నోలలాడెను.

12–5–115 న దిక్సూచనినివారు నీటతేలి పరిశీలించిరి. అప్పుడు వారున్నతావు అక్షాంశము $18^\circ$—$34'$, ధృవాంశము $87^\circ$—$12'$.

ప్రకృతి—ఆ కానవచ్చు పర్వతపంక్తులలో మహాబిల మొక్కటి కానవచ్చుచున్నది. విద్యుత్కాంతులను హెచ్చు చేసి ఓడలను అటువంకకు పరపింపరాదా ?

ప్రేమ—నేనును దూరదర్శనితో పరిశీలించుచుంటిని. అవి శుద్ధ స్ఫటికమయములైన మహాపర్వతములు.

అమోఘ—నేను త్రిభుజమువేసి కోణములు కొలి

చితిని. ఆ పెద్దకొండ 3,937 అడుగుల 9½ అంగుళముల యెత్తున్నది.

ప్రేమ—నావలను ఆపివేయుఁడు. ఏఁబదిమంది విద్యుత్కార దీపికలను వేఁటపరికరములను ఒక దినమునకు వలసిన యాహారమును దిక్సూచని మున్నగు యంత్రములను దీసికొని ప్లుతమనోహారిణులు ధరించుకొని సిద్ధముగా నుండుఁడు. మన మా బిలమును పరిశోధింతము.

అమో—రాణిగారు సెలవిచ్చినట్లే.

అది సముద్రగర్భమునందలి నిర్జీవమై చల్లారిన యొక యగ్నిపర్వతము. దానిపార్శ్వమున చిల్లిపడి నూరడుగుల వెడలుపుగల సొరంగ మేర్పడినది. దారియంతయు చచ్చి కుళ్లిపోయి మట్టియైన సముద్రజంతువుల కళేబరములతో నిండి ఊబియైపోయినది. ప్రేమవతి యా బిలమునఁ బ్రవేశించెను. గనులు త్రవ్వు గొట్టములతో దారి జేసికొని మట్టినిత్రవ్వి బైటకుచేర్చుచు వారా సొరంగములో ప్రవేశించిరి. అది మహాబిలము. త్రవ్వినకొలఁదిని సందులు గొందులై క్రొత్త దారులు ఏర్పడుచుండెను. దశదిశలకు మార్గములు ఏర్పడెను. ఎంతదూరము పోయినను ఎటువంకపోయినను విశాలములైన పర్వత గర్భపుటములు, కానవచ్చుచుండెను.

ప్రేమ—పదివేల సైనికులుగూడ ఇండ్లు కట్టుకొని వసింపఁజాలునంతతావు ఈ సొరంగమునకలదు. పదిదినములు ఇందునిలిచి దీనినంతను శుభ్రముకావించి, కవాటమునిర్మించి మూసివైచి వెడలిపోవుదము.

విజ్ఞా—అవును. మనము తిరిగి ఆంధ్రదేశము చేరు

నప్పుడు ఇది రహస్య నివాసమునకు అత్యంతానుకూలమై యుండును.

దినమునకు మున్నూర్గురు కూలికత్తెలు ఈ కార్యమున నిమగ్నలై యుండిరి. గడ్డకట్టుకొనిపోయి సమకోణాకృతులుగల శుద్ధస్ఫటికములతోను, అందందు వజ్రములతోను, అడుగున సువర్ణరేఖలుగల గులకఱాళ్లతోను నొప్పారు నాసారంగము దివ్యమందిరమువలె నమర్పఁబడినది. కొన్నినాళ్లందుండి స్థల పరీక్షచేసి వలసిన సర్వసౌకర్యములకు అందు అనువేర్పఱిచి జలాంతర్గాములు మూఁడును శాంత మహాసముద్రమునుగూర్చి ప్రయాణము సాగించెను. ఇప్పుడీ నావలు నీట తేలియే సంచారము కావించుచున్నవి. ఎల్లరును పురుషవేషములతో ఇందు చరింప నారంభించిరి. పగలనక రాత్రియనక యీ యోడలు అహోరాత్రములు ఇట్లు గంటకిరువదిమైళ్ల వేగముతో పోవుచునే యుండెను. ఒకనాఁడు

విజ్ఞాన—దేవీ! ఇచ్చోట సముద్రము రెండున్నర మైళ్లలోతు చూపుచున్నది. నేఁటికి మనగంతవ్యస్థానము చేరితిమి.

ప్రేమ—అదినాకుఁ దెలియును. ఇప్పుడు మనము నిలిచినచోటి అక్షాంశము 5°-34′-12″ ధృవాంశము 106° 17′-24″.

ప్రకృతి—శాంతమహా సముద్రము! శాంతమహా సముద్రము!

మహాల—ఎన్నినాళ్లకీ దివ్య ప్రదేశము చేరితిమి! ఎన్నియేండ్లు దీనికొఱకే తపస్సు ధారపోసితిని!

కరుణ—ఈశ్వర కటాక్షమున కిదియే తార్కాణము.

అమోఘ—సృష్టియొక్క గభీరత కీ మహాసముద్రమే నిదర్శనము. పరమేశ్వరుని శాంతత కిదియే యుదాహరణము.

ప్రేమ—ఇది సముద్రలకురాజు. వైశాల్యమునను లోతునను, అనంత రత్నధారణమునను, అనేక సువర్ణ గోప నమునను ఇది సముద్రలకురాజు.

అమోఘ—దేవీ, నిన్ని మహాసముద్ర పట్టమునకు అభిషిక్తను జేయుచున్నాము. ఏ సముద్రమును పర్వ వ్యతి రిక్తములైన దినములందు తాఁకినచో నపవిత్రమని శాస్త్రములు వ్రాసి మనవారు భరతవర్షమును అధోగతి పాలు చేసిరో, ఏ సముద్రమునకు జాలరివాఁడని కులమును గూర్చి యంటరానివారిలోఁ బడవైచి మనవారు మనలను నాశము చేసిరో అట్టి సముద్రమునకు—జలధిరాజ్యమునకు మఱల వేదములనాఁటి ఘనతనిచ్చి నిన్ను అభిషిక్తను చేయు చున్నాను.

ప్రేమ—నేను ధన్యను. నానోములుపండినవి. నా కోర్కెలు ఫలించినవి; నాజన్మము తరించినది. నేఁటికి ఈశ్వరుఁడు తన ప్రేమరాజ్యమునకు నన్ను దాసిగ నొనర్చినాఁడు. సముద్రమునకు మనదే అంటరాని కులము. అట్టినీచ కులములోఁబడి మరపిల్లుచున్న మనవారి యంటరాని తనము నేఁటితో నశించునుగాక.

ప్రకృతి—దేవీ! ఇది అట్లాంటిక్కు సముద్రముకంటె రెండురెట్లు పెద్దది. హిందూమహా సముద్రముకంటె రెండున్నర రెట్లు పెద్దది. భూమండలముమంతయు దీనిలో నొక

యంశము కానేరదు. అట్టి మహారాజ్యమునకు రాణివగు నీకు జోహారు చేయుచున్నాము.

విజ్ఞా—పగడపుపురువు లిందు ప్రవాళ ద్వీపములు నిర్మించినవి. అగ్నిగ్రథములిందు హరి చందనాది దేవతా వృక్షములను బ్రతిష్ఠించినవి. మేరుపర్వతము ఇందు తనపునాదులను నెలకొల్పినది. సూర్య చంద్రులు ఇందుండి ఉదయించుచున్నారు. ఇట్టి మహాసముద్రమునకు రాణివైన నీకు జోహారు.

ప్రేమ—ఇల్లలుకఁగానే పండుగుకాలేదు. మన శోధనలు ఫలించి. మన యాశయములు నెఱవేఱి ఆర్ష ధర్మము జగములకు వరప్రసాదియై సర్వార్థసిద్ధు లిచ్చునప్పుడుగదా మనము సంతోషింప వలసినది.

విజ్ఞాన—ఇప్పుడు మనము ప్రవాళ ద్వీపములలోని పవడములను ఏరుదమా? మేరువు పునాదులలోని బంగారమును శోధింతమా?

ప్రేమ— మేరువు ప్రాంతములకు మనము పోవుదము జలములలో మునిఁగి దారిలోని ప్రతి పర్వతమును శోధించుకొనుచు మేరుపర్వతము పునాదులకు పోవుదము.

ఎల్లరును—మహారాణికి జయమగుఁగాక. తథాస్తు. దిగ్విజయోస్తు.



# పదుమూఁడవ ప్రకరణము.

---

ప్రేమవతిని పట్టాభిషిక్తనుగావించి చెలికత్తెలందఱును అత్యానందభరితలైరి. ఇప్పుడు విజ్ఞానశృంఖల మహామంత్రిణి; మహాలక్ష్మి కోశాధ్యక్షు; అమోఘశాసని సైన్యాధికారిణి; కరుణదేవి న్యాయపరిపాలిక; ప్రకృతిదేవి గృహవస్తువాహన దుర్గారామక్షేత్రాద్యధినియంత్రి. వీరి ఉత్సాహశక్తి అపారమైనది; మంత్రశక్తి అమోఘమైనది. నెలలకొలఁదిగా వీరు జలాంతర్గాములలో ననవరత ప్రయాణములు సాగించుచుండిరి. సముద్రపుటడుగున త్రవ్వి మట్టిని పరీక్షించుచు నందణఁగి యుండిన పర్వతములకు తూట్లుపొడిచి శోధనలుచేయుచు, నడుమ నడుమ గరుడాకారముగల విహంగముల నెక్కి సముద్రములోని నిర్మానుష్యద్వీపములను పరిశీలించుచు వీరు భవిష్యద్భాజనోద్ధారణకు సోపానములు నిర్మించుచుండిరి. ఓపికయు పట్టుదలయు కలిగెనా ఎంత దుష్కరములైన కార్యములును సాధింపఁబడును. వీరి విరామములేని నిరంతకృషి కొన్నినాళ్లకు ఫలించినది. మొట్టమొదట నగమ్యాగోచరముగా నుండిన సముద్రగర్భము కొన్నినాళ్లకు వీరికి భవిష్యత్ప్రయత్నములకు అనుకూలములు కల్పించినది. భూమిలోని పొఱలు ప్రకృతిసూత్రబద్ధములై యుండుటచే నవియే వీరి భవిష్యత్శోధనలకు దారి చూపినవి. ఇనుము, నాగము, వెండి, బంగారము రత్నములు—ప్రతి వస్తువునకును ప్రకృతియందు నియమిత స్థానములు కలవు. అవి శాస్త్రదృష్టికి సుగమములు. కష్టములకు

వెఱవక, పూనికను వదలక, ఉత్సాహమును విడువక ఆఱు మాసములు నిరంతరశోధనలచేసి తుట్టతుదకు వీరు సువర్ణము లుండు తావులు కొన్నింటిని తెలియఁజాలిరి. విజ్ఞానబోధితులైన వీరికి నిరక్షరేఖ కడ రెండు బంగారపు గనులును, శాంత మహాసముద్రపు పశ్చిమభాగమున నొక బంగారుగనియు దొరకినవి. శాస్త్రజ్ఞానమే వీరిని ఈప్రాంతములలో వెదకుటకు పురికొల్పినది. అందు మొదటిది ఆస్ట్రేలియా ప్రాంతభాగము; కాని యది సమీపభూభాగమున కిన్నూరుమైళ్ల దూరమున నగ్నిపర్వతముల నడుమనున్నది. రెండవది కాలిఫోర్నియా ప్రాంతసముద్రభాగము, ఈ రెండు తావులలోను సముద్రపుటడుగున గడ్డకట్టుకొనిపోయిన యగ్నిద్రవనిర్గతములగు సువర్ణ ద్రవములు గల విశాలములగు బయళ్లుగూడ నుండెను.

ఇట్లు నిరంతర సాధనవలన నఖండజలరాశి కుక్షిలో నొకమూల నాలుగుమైళ్లలోతున భూగర్భమున పాతి పెట్టఁబడిన యమూల్య నిధానములు ప్రకృతి యంత్రోపాసమువలన సులభముగా లొంగిపోయినవి. అట్లయ్యును అనంతకష్టములు అందకుండ ఈ మహదర్థములు సాధింపఁబడలేదు.

నెలకు ఏడేసి దినములు వీరు విహంగయానములు కావించుచుండిరి. శాంత మహాసముద్రములోని నిర్మానుష్యములగు ద్వీపములను ముఖ్యముగా వీరు పరిశీలించుచుండిరి. కొన్ని ద్వీపములలో దాహోదకమునకుఁ గాని పైరుపంటలకుఁ గాని అవకాశములు లేవు; అందువలన నవి మానవ నివాస యోగ్యములు కావు. కొన్ని ద్వీపములు సర్వదా జ్వలించు నగ్ని పర్వతములకు నిలయములు. కొన్నిద్వీపములు విశాలము

లైనవే కాని తత్ప్రాంతద్వీపములు అనాగరకులగు మనుష్యా శనులు వసించు తావులు. ప్రపంచోద్ధరణ సూత్రములను శాంతముగా యోచించి ప్రయోగించు పనికి పూనుకొన్న యీ జలదైవతములకు వారి ప్రచారములు భంగకరములు కావచ్చును. జనస్థానములకు వందలాదిక్రోశముల దూరమున నున్న వివిక్తద్వీపములు వీరిప్రతిష్ఠాపనలకు అనంత ఫలదములు. ఇట్లు నెలకు పదేసి దినములు వీరు ద్వీపములను వెదకుచు, నడుమ నడుమ జలజీవనమువలన విసుగు చెందకుండ తమ పరివారమునుగూడ వంతులు వంతులుగా విహంగములలో త్రిప్పుచు ఒక్కొకప్పుడు కొన్ని దీవులలో నొకటి రెండునాళ్లు విడిసి బడలికలు వాపుకొనుచు, నచ్చోటలబ్ధములగు శుద్ధజలములను ఆహారవస్తువులను సేకరించుకొనుచు నిరాశ చెందక విరామమును దలంపక వీరెల్లరును ఆఱుమాసములు సర్వవిధములైన కష్టములను అనుభవించిరి.

గనులు దొరకినంత మాత్రముచేత వీరికి ధనము లభింపలేదు. వానిని త్రవ్వి ఆలోతునుండి యెత్తి శుద్ధము చేయవలెను. సముద్రపుటడుగున జలదుర్గమములగు విశాలాగారములు కల్పించి వానిలో పట్టణములును పల్లెలు నిర్మించుటకు త్రుప్పుపట్టలేని బలిష్ఠములగు మైళ్ల పొడుగు గోడలు కావలెను. అందుండు వారికి పీల్చుటకు గాలి కావలెను. ఇట్టి వాని నన్నింటిని కూర్చుటకు యంత్రశాలలు కావలెను. లోహములు దొరకవలెను. కాని యిట్టి వేవియు వారికి సాధ్యముగా నుండలేదు. తుట్టతుదకు ప్లుతమనోహారిణులతో నె మున్ముందు పని నారంభించుటకు నిశ్చయింపఁబడెను. తమతో

వెఱవక, పూనికను వదలక, ఉత్సాహమును విడువక ఆఱు మాసములు నిరంతరశోధనలచేసి తుట్టతుదకు వీరు సువర్ణము లుండు తావులు కొన్నింటిని తెలియఁజాలిరి. విజ్ఞానబోధితులైన వీరికి నిరక్షరేఖ కడ రెండు బంగారపు గనులును, శాంత మహాసముద్రపు పశ్చిమభాగమున నొక బంగారుగనియు దొరకినవి. శాస్త్రజ్ఞానమే వీరిని ఈప్రాంతములలో వెదకుటకు పురికొల్పినది. అందుమొదటిది ఆస్ట్రేలియా ప్రాంతభాగము; కాని యది సమీపభూభాగమున కిన్నూరుమైళ్ల దూరమున నగ్నిపర్వతముల నడుమనున్నది. రెండవది కాలిఫోర్నియా ప్రాంతసముద్రభాగము, ఈ రెండు తావులలోను సముద్రపుటడుగున గడ్డకట్టుకొనిపోయిన యగ్నిద్రవనిర్గతములగు సువర్ణ ద్రవములు గల విశాలములగు బయళ్లుగూడ నుండెను.

ఇట్లు నిరంతర సాధనవలన నఖండజలరాశి కుక్షిలో నొకమూల నాలుగుమైళ్లలోతున భూగర్భమున పాతి పెట్టఁబడిన యమూల్య నిధానములు ప్రకృతి యంత్రోపాసమువలన సులభముగా లొంగిపోయినవి. అట్లయ్యును అనంతకష్టములు అందకుండ ఈ మహదర్థములు సాధింపఁబడలేదు.

నెలకు ఏడేసి దినములు వీరు విహంగయానములు కావించుచుండిరి. శాంత మహాసముద్రములోని నిర్మానుష్యములగు ద్వీపములను ముఖ్యముగా వీరు పరిశీలించుచుండిరి. కొన్ని ద్వీపములలో దాహోదకమునకుఁ గాని పైరుపంటలకుఁ గాని అవకాశములు లేవు; అందువలన నవి మానవ నివాస యోగ్యములు కావు. కొన్ని ద్వీపములు సర్వదా జ్వలించు నగ్ని పర్వతములకు నిలయములు. కొన్ని ద్వీపములు విశాలము

లైనవే కాని తత్ప్రాంతద్వీపములు అనాగరకులగు మనుష్యా శనులు వసించు తావులు. ప్రపంచోద్ధరణ సూత్రములను శాంతముగా యోచించి ప్రయోగించు పనికి పూనుకొన్న యీ జలదైవతములకు వారి ప్రచారములు భంగకరములు కావచ్చును. జనస్థానములకు వందలాదిక్రోశముల దూరమున నున్న వివిక్తద్వీపములు వీరిప్రతిష్ఠాపనలకు అనంత ఫలదములు. ఇట్లు నెలకు పదేసి దినములు వీరు ద్వీపములను వెదకుచు, నదుమ నదుమ జలజీవనమువలన విసుగు చెందకుండ తమ పరివారమునుగూడ వంతులు వంతులుగా విహంగములలో త్రిప్పుచు ఒక్కొకప్పుడు కొన్ని దీవులలో నొకటి రెండునాళ్లు విడిసి బడలికలు వాపుకొనుచు, నచ్చోటలబ్ధములగు శుద్ధజల ములను ఆహారవస్తువులను సేకరించుకొనుచు నిరాశ చెందక విరామమును దలంపక వీరెల్లరును ఆఱుమాసములు సర్వ విధములైన కష్టములను అనుభవించిరి.

గనులు దొరకినంత మాత్రముచేత వీరికి ధనము లభింపలేదు. వానిని త్రవ్వి ఆలోతునుండి యెత్తి శుద్ధము చేయవలెను. సముద్రపుటడుగున జలదుర్గములగు విశాలా గారములు కల్పించి వానిలో పట్టణములును పల్లెలు నిర్మించు టకు త్రుప్పుపట్టలేని బలిష్ఠములగు మైళ్ల పొడుగు గోడలు కా వలెను. అందుండు వారికి పీల్చుటకు గాలి కావలెను. ఇట్టి వాని నన్నింటిని కూర్చుటకు యంత్రశాలలు కావలెను. లోహములు దొరకవలెను. కాని యిట్టి వేవియు వారికి సాధ్య ముగా నుండలేదు. తుట్టతుదకు ప్లుతమనోహారిణులతోనె మున్ముందు పని నారంభించుటకు నిశ్చయింపఁబడెను. తమతో

తెచ్చుకొన్న పరికరములతో నొక జలాంతర్గామియందు నిత్యమును క్రొత్తప్లుతమనోహారిణులు నిర్మింపఁబడుచునే యుండెను. ఇప్పటికి నూరుప్లుత మనోహారిణులు సిద్ధముగా నున్నవి. ప్రతి దినమును ఒక్క ప్లుత మనోహారిణినే వాడుచుండుట వలన నేమి ప్రమాదములు సంభవిల్లునో ? అందువలన దినమునకు నలువదిప్లుత యంత్రములనే వాడునట్లును, సాయాహ్నమున నెల్లరును జలాంతర్గామిలో చేరిన వెనుక ఆప్లుతహారిణీ యంత్రములను పరిశోధనాధికారిణి కిచ్చివైచి, శోధింపఁబడి దిటవుగా నున్నట్లు నిర్ణయింపఁబడిన నలువది యితర యంత్రములతో మఱునాఁడు పనిని ఆరంభించునట్లును, ఇరువదిప్లుత మనోహారిణులను ఎప్పుడును అవాంతరకష్ట పరిహారమునకై నిలువలో నుండునట్లును, నిర్ణయింపఁబడెను. మఱియు పనిచేయు సమయమున నే యుత్పాతమువలననైన నొక యంత్రమునకు ప్రమాదము సంఘటిల్లెనా, అందలి పనికత్తె ఊఁపిరి విడువలేక ఆపద పొరయకుండుటకై నిర్మలవాయు పూర్ణములైన తిత్తులు కొన్ని తగు సదుపాయములతో సిద్ధముగా నునుపఁబడెను. ఇట్టి రీతి సంధానములతో నిరక్ష రేఖకడ పరిశోధన సంఖ్య 84 గల యొకగనిలో పని ప్రారంభింపఁబడినది. నెల దినములలో నందుండి రేనూరుమణుగుల బంగారము ఎత్తఁబడినది. వెంటనే దీనితో అర్ధముద్రయు ప్రేమవతి బింబమునుగల నాణెములు చేయఁబడినవి. కార్యనిర్వాహక వర్గమంతయు నొకనాఁడు రాణీగారిని పరివేష్టించినది.

విజ్ఞా—ప్రేమవతీ! జలరాజ్యమునకు నీవు అభిషిక్త

వయితివి. కాని స్థలరాజ్యమునుగూడ ఈ క్షణముననే మనము ప్రతిష్ఠింప వలెను.

మహా—ఉన్న యంత్రములన్నియు ఆ గనియందే యున్నవి. నూతనములైన గనులను కనిపెట్టు పనులు నిలిచిపోయినవి. గని అతివిశాల మవుటచే నాలుగు పల్లెలకు లెక్క వేసికొన్న పదార్థములు ఒకపల్లెకే సరిపుచ్చవలసివచ్చెను. పైఁగప్లుత మనోహారిణులునుసందే యుండెను.

ప్రేమ—ముందు సముద్రగర్భమున క్రొత్త పల్లెలు నిర్మించితిమా చాల ప్లుతమనోహారిణులు విడివడును. ఒక జలాంతర్గామికూడ నేఁడు పనిలేక పడియున్నది.

విజ్ఞా—పల్లెలు నిర్మించుటకు ఱేకులు లేవు. ఇనుము విస్తారముగాఁగల ద్వీపములో యంత్రనిర్మాణముకావలెను.

మహా—రెండు గనులను మనుష్యులులేక వదలివేసితిమి.

కరుణ—పరికరములు లభించెనా కూలివాండ్రకేమి? కాని ఒక వేఁడాదిదాఁక మనము కూలివాండ్రను భరింపలేము.

ప్రకృతి—మహాసముద్ర మధ్యములో పనివాండ్రెందు చిక్కఁగలరు?

కరుణ—సముద్రములో ఓడలకు తఱచుగా ప్రమాదములు కలుగుచుండును. అందును గాలివానలు పొసఁగునప్పుడు కలిగెడి సంక్షోభమునకు మితిలేదు.

ప్రేమ—అవును. స్థలరాజ్యమే యొక్కటియుండెనా ఆపన్నులను రక్షించి తెచ్చి అందు కూలికాసపడువారికి అధిక భృతినొసఁగి మన పనులకు వినియోగించుకోవచ్చును.

తక్కినవారిని విమానములతో వారి యిండ్లకడ చేర్పవచ్చును. కాని యిది వెంటనే సాధ్యమగు పనికాదు. ఒక్క సంవత్సరము నకు వలసిన యాహారముతో మనము బయలు దేరితిమి. నేఁటికి ఏడు నెలలైనది.

కరుణ—నూతన ద్వీపములో వర్షకాలమునకుముందే ప్రవేశింపవలెను. అట్లు మనము ప్రవేశించుట యెన్నఁడో ముందునాఁటికి పంటలు పండించుట యెన్నఁడో ?

ప్రేమ—ఎట్లు చూచినను స్థలరాజ్య ప్రతిష్ఠాపనము ఈ క్షణముననే జరిగింపవలసి యున్నది.

విజ్ఞాన—దొరకిన ప్రతి ద్వీపమును మనకు నివసింపఁ గూడినది కానేరదు. మనము ఆక్రమించు దీవి మన యాశయ ముల కన్నింటికిని తగినదై యుండవలెను.

అమోఘ—అవును., యంత్రనిర్మాణమునకు పైరు పంటలకు ఆరోగ్యమునకుఁగూడ.

ప్రకృతి—అది శత్రువులకు దురాసదమై నిక్షేపము లను దాఁచుకొనుటకు అనుకూలమైకూడ నుండవలెను.

ప్రేమ—అందులకు కొంతవఱకు మన బలాబలములు కూడ ప్రధానము.

విజ్ఞా—ఈ దినముననే మన మిరువురమును బయలు దేఱి స్థలనిర్ణయము కావించుకొని వత్తము.

ప్రేమ—అవును నేనును అట్లే ఊహించుచున్నాను. చూచిన ద్వీపములలో ఏఱి పాఱవైచినట్లు వందలకొలఁది మైళ్ల దాఁక వేఱుద్వీపములే లేని పెద్దప్రదేశము లింతవఱకు పది మాత్రమే మన లెక్కలో నున్నవి. అందు ఏనూరుమైళ్ల

విస్తీర్ణముగల యూనాఁడు మనము పంన్లు కొనికొని యూరగించిన ద్వీపమువంకకు నామనస్సు పోవుచున్నది.

మహా—కాలము వ్యర్థమై పోవుచున్నది. పంటలు పండించుటకొక యేడాది, కూలివాండ్రను తెచ్చుటకొక యేడాది అని మీనమేషములు లెక్కించుకొనుచు ఏల పడియుండవలెను.

ప్రేమ—ఆమాటయు నిజమే. కావలసినంత ధనమున్నది. తెలుగని బంగారములు మనచేతిలో చిక్కినవి. ఆహారపదార్థములను పరదేశములనుండి విలిచి తెచ్చుకోవచ్చును.

విజ్ఞాన—ఒక్క పదిదినములలో పనులన్నియు పూర్తి కావలెను.

ప్రేమ—"అదియే నా కోరికయును. వాయుభారమాని తుపానులను సూచించుచున్నది." అని పలుకుచు ప్రేమవతి "చెల్లెలా! కరుణా! నీవు చెప్పినరీతినే ఆ పన్నులను రక్షించుటకు వెంటనే పూనుకొనుము. రాఁబోవునది వర్షకాలము; అది శాంతమహా సముద్రమున ప్రళయభీకరములైన తుపానులు రేఁగు సమయము. ఘోరవాత్యాహతిచే నీ కాలములో నెన్నియో యోడలు సముద్రమున మునిఁగిపోవును. ఎందఱో జనులు ఓడలతోఁగూడ దిక్కును మక్కును లేకుండ సముద్రగర్భమున నణఁగిపోవుదురు. అట్టి యాపన్నులను రక్షించి జలాంతర్గామి కెక్కించినచో నందుఁ గొందఱు కూలివాండ్రు లభింపవచ్చును. ఆపన్నులకు సమస్త సౌకర్యములు కూర్చుచు నిచ్చోటికి కొనివచ్చుటకు ఈక్షణముననే ప్రయాణముకమ్ము.

"మఱియు జలాంతర్గామితో రెండు విమానములు

కూడ కొనిపొమ్ము. వలసిన యోషధులను సద్యఃప్రాణకరము లగు నాహారములను వలలను ప్రాణరక్షణములగు తెప్పలను పట కాలను చక్రములను ప్రాణవాహులను మఱవవలదు. నీవును నీ పరివారమును పురుషవేషములను ఏమఱకుఁడు. నేఁటికి పది యగునాఁడు—ఆనాఁడు ఎల్లరతోను నీవిచ్చటకు చేరవలసినది. మానవకోటికై మనము తలపెట్టిన మహాకార్యములకు నీ యొనర్పు నీ యాత్రప్రాణమే మొదటి బోణి" అని ప్రేమవతి కరుణను ఉద్బోధించెను.

"అమోఘశాసనీ! మేము వచ్చుదాఁక నీవిచ్చోటనే నిలిచి నాయికత్వము నిర్వహింపుము. నేనును విజ్ఞానశృంఖ లయు ద్వీపమును నిర్ణయించుకొని నేఁటికి పదియవనాఁడు మఱల నిందు చేరుదుము."

అది వర్షకాలారంభము. కరుణాదేవి యాపన్న సం త్రాణసమునకై సపరివారయై బయలుదేఱెను. శాంత మహాసముద్రమునందలి ద్వీపములలో ప్రేమవతికి నివాస యోగ్యముగాతోఁచిన పది ద్వీపములను శోధించుటకై ప్రేమవతి యు విజ్ఞానశృంఖలయు నొకవిహంగయంత్రము నెక్కి బయలు దేఱిరి. శుభారంభములు భయంకరమైన యుత్పాతములచే నిరోధింపఁబడును. ప్రేమవతి బయలుదేఱిన రెండునాళ్లదాఁక సముద్రము అతిప్రశాంతమై యుండెను. మూఁడవనాఁడు ప్రళయ భీకరమైన తుపానొక్కటి చెలరేఁగెను. శాంతమహా సముద్రము ఇట్టి భయంకరమైన ప్రచండవాయువులకు నిల యము. వానిధాటికి కెట్టియోడలును ఆగలేవు. ఇతర సమయ

ములలో నంత శాంతముగానుండునో యిట్టివేళలలో నా మహాసముద్ర మంత రౌద్రాకారమును దాల్చును.

ఉఱుములతోను, మెఱుములతోను, నిబిడీకృతమైన కారుమేఘములతోను నిండి చిల్లిపడినట్లు ఏనుఁగు తొండముల వంటి జలధారలను అకసము ఆ మహాసముద్రగర్భమున క్రుమ్మరింప సాఁగినది. గంటకు నూరుమైళ్ల వేగముతో సుడిగాలి యొక్కటి బయలుదేరి తనకందిన ప్రతివస్తువును చిమ్మి పాఱవైచుచున్నది. అడుగున నల్లనినీరున్నది; పైని కాఱుమేఘము లున్నవి; మేఘముల నల్లని చీకట్లు సముద్రజలములో ప్రతిఫలించుచున్నవి; నీలాంజన తుల్యమైన సముద్రజలము మేఘములనుండి ప్రతిబింబించుచున్నది; రెంటినుండియు సూచికాభేద్యములగు చిమ్మచీఁకట్లు రోదసీకుహరము నావరించుచున్నవి; చీఁకటిమీఁద చీఁకటిచేరి దట్టమై చిక్కఁబడి, గట్టిపడి జగములునిండి అంధకారమునకు సహితము అంధత్వమును గూర్చుచున్నది. కొండల పొడుగున లేచు సముద్రపుటలలు వాయువేగముతో బరువెత్తుచు మహా సముద్రమును గూడ తమ ప్రవాహములలో ముంచివైచి యీడ్చుకొని పోవుచున్నవి. అట్టి భయంకర సమయమున, ప్రళయశక్తులు తాండవమాడుచు చెలరేఁగు నాదుర్దినమున ప్రేమవతియెక్కిన విమానము వాయుమార్గమున కెరలెక్కి నిర్భయముగా పోవుచుండెను. నూరుమైళ్ల వాయువేగమును నూటనేఁబది మైళ్ల వేగముతో నెదుర్కొనుచు ఏఁబదిమైళ్ల వాయువేగమును నూరుమైళ్ల విమానవేగముతో నెదుర్కొనుచు పంచభూతములను జయించి మహారాణి యుప్పుడును ఆకాశ సంచా

రమును గావించుచునే యుండెను. వర్ష మేఘములు విద్యుచ్ఛక్తికి నిలయములు. విమానము అందుఁ జొచ్చినచో రెంటి యందలియు విద్యుచ్ఛక్తులు ఘర్షించి విమానమును భస్మీపటలము గావింపవచ్చును. కాదని విమానము దిగువనున్నచో కాఱెడి వర్షజలములవలనను వీచెడు ప్రచండవాయువులవలనను ప్రళయము కలుగును. పంచభూతములును ప్రబల శత్రువులై ఆఘోర దుర్దినమున ప్రేమవతికి నూతనరాజ్య సంస్థాపనపట్టున సంక్షోభమునుగూర్చినవి : భూములు జలార్ణవములైనవి ; సముద్రములు కంపించినవి ; ఆకసము పిడుగులను వర్షించినది; సూర్యతేజస్సులు సహితము డాఁగి పోయినవి; వాయుదేవుఁడు మహాబలుఁడై ప్రచండయుద్ధము నారంభించెను. భూత ప్రకృతియంతయు నిట్లు తన్నెదుర్కొను నప్పుడు ప్రేమవతి యొకింతయు చలింపలేదు. గంభీరస్వాంతయై చిఱునవ్వుతో శాంతముగా వానిని నిరోధించి ప్రేమరాజ్యమును బ్రతిష్ఠింప దొరకొనెను. లోకాదర్శకములగు మహాత్కార్యములు కష్టములులేక యెన్నఁడును సిద్ధికిరావు. ప్రేమవతి తాను పట్టినపట్టును వదలలేదు. యంత్ర గర్భమునందణఁగి యున్న ప్రచండశక్తు లన్నింటిని ఆకర్షించుకొని ప్రేమవతి యీ విప్లవమును ఎదుర్కొనెను.

ఒక్క దినమంతయు నిట్లు భయంకర సంక్షోభము కలిగెను. మహాయుద్ధము జరిగెను. ప్రకృతియంతయు గర్జించెను. కాని ప్రయోజనము లేకపోయినది. సత్యమునకును శాంతమునకును పరాజయములేదు. ప్రేమవతి జయించినది. మఱునాఁటికే శాంత మహాసముద్రము అత్యంత శాంత

మయ్యెను. వాయువులు అణఁగినవి; మేఘములు విచ్చినవి; సూర్యుఁడు శోభాయమానుఁడై సహస్రకరములతో నీభూలోకమును మఱల ఆదరించెను. ప్రేమవతి శాంత మహాసముద్ర గర్భమున నిరాఘాటముగా సంచరించుచు నాపది దీవులను పరిశోధించి యందొక్కదానిలో ఆర్ష పతాకమును స్థిరముగా నాటెను. జగములు హర్షించెను. సూర్యచంద్రులు మఱల వికాసము గాంచిరి. పరమేశ్వరుఁడు వరప్రదాతయై ప్రేమవతిని ఆశీర్వదించెను. ఏలయనఁగా ప్రేమవతి హృదయమున నట్టి సంతోషమును ఉత్సాహమునుగూడ జనించినవి. మానవులలోని మానవత్వమును బెంపందించు పనికి నింతనిరోధము కల్పించియు భూతప్రకృతి తుదకు లొంగిపోయినది.

---

# పదునాలుగవ ప్రకరణము.

ప్రేమవతి తిరిగివచ్చునప్పటి కప్పుడే కమలాదేవి మున్నూట యెనుబదినల్వురు ఆపన్నులతో నమోఘశాసని కడకు వచ్చియుండెను. ఈయాపన్నులలో డెబ్బదియార్వురు స్త్రీలు; పందొమ్మిదిమంది ఏడేండ్లలోపు బాలబాలికలు; ఇరువదిమంది అయిదుమొదలు పదునెనిమిదిదాఁక వయస్సు కలవారు. కరుణదేవిచేత రక్షింపఁబడిన యాపన్నులలో సముద్ర గర్భమునఁ దల్లిదండ్రులను బెడఁబాసిన నిసువులును, చచ్చిన తల్లుల కడుపుల కంటిపెట్టుకొని యింకను జీవమును బెడఁబాయకున్న నిసువులునుగూడఁ గలరు. రక్షితులలో మిగిలిన

వారు పురుషులు. ఎల్లరును చీనా దేశపువారు. అందుఁ గొందఱు తమ్ము రక్షించిన కరుణదేవిని చంపివైచి తెడ్లతోను తెఱచాపలతోను జలాంతర్గామినిని ఎత్తుకొని పోఁదలఁచిన రెండుకాళ్ల మృగములు. ఇట్టి పశువులు ఎల్ల దేశములందును ఉన్నారు. ప్రకృతకాలపు జనాభా లెక్కలు జనసంఖ్యను మొత్తముగాఁ దెలుపుచున్నవిగాని మనుష్య మృగములు మనుష్యులనను, విభేదమును గుర్తించుట లేదు. తనపై కత్తిదూసిన దుష్టులవలన ప్రమాదము పొరయకుండుటకై కరుణదేవి వీరినందఱను లోపబంధించి తలుపులు మూసివైచి జలాంతర్గామినిని నీటిలో నొకమైలు లోతుదాఁక దింపి తీసికొని రావలసి వచ్చెను. జలగర్భమున విద్యుద్దీపములతో మరలవలన నడచుచున్న యాయోడ స్వభావము నెఱుఁగలేక భయపడి యా దుర్మార్గులు అప్పటికి తమ దౌష్ట్యమునుండి విరమింపవలసి వచ్చెను. అందొకఁడు కరుణదేవిపై కత్తిత్రోనురికి విద్యుదాఘాతమువలన వెంటనే మరణించినందున ఈ భయము హెచ్చినది. ప్రేమవతి యమోఘశాసనిని కలసికొనునాఁటి యుదయమునకే కరుణదేవియు విహంగయానమున నచ్చోటచేరి జలాంతర్గామినిని ఆ లోతునీటనే నిక్షేపించి యుంచినది.

ఇంతలో దూరమునుండి విజయశంఖా నినాదమొక్కటి వినవచ్చెను. క్రమముగా దానిశబ్దము హెచ్చినది. అంతకంతకు ఆ నినదము సమీపించినది. "ఇది ప్రేమవతి గరుడ విహంగపుకూఁత—విజయధ్వానము—ప్రేమవతి భూరాజ్యమును స్థాపించినది!—స్థలరాజ్య ప్రతిష్ఠాపనము సిద్ధించినది!—" అని యుబ్బున యఱచుచు, గంతులు వైచుచు, ఆనంద రస

మున మత్తిల్లి తబ్బిబ్బులాడుచు ఎల్లరును ఆ ధ్వనివచ్చు వంకకు చూడ్కులు నిగిడించిరి. అంతటితో వారి సంతోషము నిలువలేదు. విహంగములలో తావు దొరకినంతవఱకు క్రిక్కిరిసిపోయి ఎల్లరును మహారాణిని ఎదుర్కొనిరి. "ప్రేమ రాజ్యాధిదేవతకు స్వాగత" మనియు, "జయము! జయము!" "దిగ్విజయము!" అనియు శబ్దములు వాయుమండలమునంతను సంచలింపఁ జేసెను.

"సిద్ధించినది! భూరాజ్యలక్ష్మి!" అని పలుకుచు ప్రేమవతి దారిలోనే వారి యుత్సాహమును శతగుణములు పెరుగునట్లు పలికినది. ఆమెకు సంతోషము ఆఁగలేదు. భావములమీఁద భావములు వెల్లుగా ప్రవహించుచు ప్రతి వాక్యములోను సగము మాటలను విడిచివైచినవి. "రాజ్యము—ప్రేమరాజ్యము—చక్కని రాజ్యము—దివ్యమైన రాజ్యము—మూఁడునాళ్లందుంటిని—సర్వమును శోధించితిని—పది ద్వీపములలో నదియే అదియే—దివ్యమైన జలాశయములు—అనంతములైన ఫలవృక్షములు—ప్రకృతిదేవి! క్రొత్తగా కోసిన పండ్లకు వాచిపోయినావు. ముందు ఈ పండుతిను. ఇదే నీ విమానములోనికి విసరుచున్నాను—ఇదిగో! రెండునాళ్ల, విందుకు చాలినన్ని పండ్లు శాకములు తెచ్చితిని—ఆరోగ్యకరమగు శీతోష్ణస్థితులు—ఓడలకు అనుకూలమగు నౌకాశ్రయ స్థానములు—దుర్గమములైన కొండలు—విశాలములైన కొండగుహలు—చుట్టును ఏనూరుమైళ్లదాఁక ద్వీపములే లేవు—దుప్పులు, లేళ్లు—కలకల నినాదములు చేయు సుందరములైన పక్షిజాతులు—అనేకములైన ఓషధీ

లతలు—స్వర్గలోకము—భూలోక స్వర్గము.'' అని యుద్రేకముతో ప్రేమవతి భాషించుచుండెను. శబ్దవాహికలవలన ప్రతి శబ్దమును విమానములలో వినఁబడి యెల్లరను సంతోషాంబుధి నోలలాడించు చుండెను.

విహంగములన్నియు జలాంతర్గామిమీఁద వ్రాలినవి. దిగినదే తడవుగా నెల్లరును ప్రేమవతిని విజ్ఞాన శృంఖలను కౌఁగిలించుకొని ముద్దిడుకొనిరి. "ప్రకృతీ! నేను విసరిన యామపండు అందినదా? పోనీ! దీనిని తిను. మూఁడు నెలల కీనాఁడు నిన్నునే కోసినఫలము నీకుఁ దక్కినది.

ఆ సమయమున నాకన్యకలలో ఎచ్చటఁ జూచినను కోలాహలమే. ఎందుఁ గాంచినను సంతోష శబ్దములే. ఆ సంతోష సుధచే మైమఱచి మత్తిల్లి యందఱును అఱచిరి; గంతులు వైచిరి. ఒండొరులఁ కౌఁగిలించుకొనిరి; ముద్దిడికొనిరి; చప్పట్లు చఱచిరి; పరువులెత్తిరి. "ప్రేమవతికి జయము!" "సముద్రముల రాణికి విజయము!" "ఆర్ష ద్వీపమునకు అఖండ విజయము!" ఆర్ష పతాకమునకు దిగ్విజయము!" అను మాటలే ఆకసమునంటి ప్రతిధ్వనించుచుండెను. ప్రేమవతియు తన సంతోషమును పట్టఁజాలక పోయెను. ఆనందరసముచే నామె వాగ్ద్వారము మఱల విడివడెను:—

"యంత్ర నిర్మాణమునకు ఇనుపగనులు—రాగియు సీసమును—అపారములు—అగ్ని పర్వతములు లేవు—కానఁబడలేదు—నేలబొగ్గు దొరకు లక్షణములున్నవి—ఏనూరు మైళ్ల విస్తీర్ణము—చాలనదులు—నదుల యిసుకలోనివి బంగారు కణములు కావచ్చును—నిశ్చయముగా వజ్రపు

పొడియే—ఒక నలకతో జాతిని ఛేదించిచూచితిని—గృహ నిర్మాణమునకు నౌకా నిర్మాణమునకు సమృద్ధిగా కలప—సముద్రమునకు నూరడుగుల యెత్తుననున్న పీఠభూమి—ఉప్పెనలవలన భయములేదు—మాఱుమూల ప్రదేశము—రహస్యము దాఁగును—సారవంతమైన భూమి—నదుల ప్రక్కను పంటల కనువగు పల్లపుబయళ్లు—శాంతమైనతావు—ప్రశాంతమైనతావు—తపస్సు కనుకూలించు దేశము—ప్రకృతీ! నీవు ఆర్ష ద్వీపమని ముందే పేరుపెట్టి యుంటివి—ఆ ద్వీపమే—ఆర్ష ద్వీపము!—ఆర్ష ద్వీపము!—ఆర్ష యోగీంద్రులకు జయమగుఁగాత!—కరుణదేవీ! నీ వెంతమంది యాపన్నులను దెచ్చితివి?"

కరుణదేవి ప్రేమవతిని సమీపించెను. "భూరాజ్యాధినియంతకు జయము—ఎన్నియోడలో భగ్నమైనవి. ఎందఱో చచ్చిరి.—కాపాడఁగలిగినది మున్నూటయేనుబది నల్వురను—దొరకిన యొక్కరినిగూడ వదలలేదు,—ఆ పసిబిడ్డలు అగాధ జలములలో ఉక్కిరి బిక్కిరి యగుచుండిరి—ప్రాణోత్క్రమణదశ—అక్కా! యెంత ప్రయత్నించినను ఎందఱో ఆ సముద్రగర్భములో కలసిపోయినారు. చూచుచుండఁగనే—ఆ చిన్ని మూరెడు బిడ్డను—ఇంకను మాటలు రావు—లోకము ఎఱుఁగదు—ఏమి జరుగుచున్నదో తెలిసికొను ఊహలేదు. అదియేమో—నావంక చూచుచునే యున్నది—ఇంతలోనే ఒక మహామీనము దానిని ఈడ్చి ఒడిసి చప్పరించి వైచినది. బిడ్డయేడుపు నగముమాత్రము వింటిని. మిగిలిన సగమును ఆ మీనగర్భములో నణఁగిపోయినది. ఎంత పాపాత్మురాలను!"

"కరుణదేవీ! అలవిగానిపనికి పలవరించి లాభమేమి?"

తెచ్చిన యాపన్నులను ప్రేమవతి పరిశీలించెను. ఆగుటకు వ్యవధిలేదు. వెంటనే ప్రయాణము కావలెను. నిముషములమీద పనులు ముగియవలెను. కరుణదేవి తెచ్చిన యాపన్నులలో నలువది యేడ్గురు పురుషులును నిరువదిమంది స్త్రీలును ప్రేమవతికడ కొలువులో కుదురుకొనిరి. తిన్నగా మాటలురాని మూఁడేండ్లలోపు బాలిక లేవురను బాలుర నలుగురను ఎవ్వరును పోల్పలేక పోయిరి. అయిదేండ్లపైఁబడ్డ బాలబాలికలలో నేడుమంద్రు బాలికలును నాల్గురు బాలురును దిక్కుమాలినవారు. ఈ పదుమువ్వురతోను వెంటనే ఆర్ష విశ్వవిద్యాలయము నెలకొల్పుటకు నిశ్చయింపబడెను. మూఁడేండ్లలోపు నిసువులు వైద్యుల కప్పగింపఁబడిరి. ఆపన్నులలో తక్కినవారు బహుమతులతోఁగూడ విమానములలో తమ తమ గృహములకు చేర్పఁబడిరి.

ఆర్ష ద్వీపమునకు ప్రయాణ భేరి మ్రోఁగినది. ఆద్వీపమున్నతావు ఎల్లరకును తెలియరాదు. ప్రదేశముయొక్క ధృవాంశమును అక్షాంశమును నౌకా నియంత్రులకుఁ దెలుపఁబడెను. మూఁడు జలాంతర్గాములును మున్నీట మునిఁగి రెండు నాళ్లలో అర్ష ద్వీపముకడ తేలెను. క్రిందినుండి నూరడుగులు ఎక్కిన గాని ద్వీపోపరిభాగము కానరాదు. ఎక్కుటకు దారి లేదు. నిలువున నిలిచిన పర్వతమువలెఁ దోచు ప్రదేశమును ఎట్లెక్కవచ్చును? ప్రధాన నాయికలందఱును విమానారూ

ఘలై పైకెగసిరి. మహాలక్ష్మి ప్రేమవతిని సమీపించి నమస్కరించి నిలిచెను :

"మహారాణీ! నీవు ప్రకృతి శాస్త్రధ్వజమును చేతఁబూని ముందుగా నీ కుడిపాదమును ఈ ద్వీపముమీఁద మోపుము.

"మీరు ఆదేశించినట్లే" అని పలుకుచు ప్రేమవతి ఆర్ష ద్వీపమునందు తన కుడికాలు ముందు మోపెను.

విజ్ఞాన—సముద్రాధి దేవతకు సామ్రాజ్య సిద్ధియగుఁగాక!
అమోఘ—రత్నాకర నియంతకు జోహారు!
మహా—భూరాజ్య చక్రవర్తినికి దిగ్విజయోస్తు!

ప్రేమవతి భూమిపై పాదముమోపి ఏడడుగులు నడచి యందు ప్రకృతిశాస్త్రధ్వజమును ప్రతిష్ఠించెను. తోడనే మహాలక్ష్మియు విజ్ఞాన శృంఖలయు అమోఘ శాసనియు ప్రకృతి దేవియు కరుణయు దిగివచ్చి ఆమెకు సాష్టాంగము కావించి

"దేవీ! ఈశ్వరానుగ్రహముచే ఆర్ష ద్వీప చక్రవర్తినివైన నీకు సర్వశుభములు చేకూరుఁగాక! సర్వసంపదలు నిన్నాశ్రయించుఁగాక! నీ దివ్యపరిపాలనమున లోకములకు సమస్త కల్యాణములు ఒదవును గాక! చిరాయురున్నతులతో ప్రకృతి శాస్త్రధ్వజము జగములను శాసించుచు ఆ చంద్రతారార్కముగా స్థిరకీర్తులను నీకుఁ బ్రసాదించును గాక!"

అని దీవించిరి, వెంటనే మహాలక్ష్మి నవరత్నఖచితమైన యొక సువర్ణకిరీటమును ప్రేమవతి శిరస్సున నుంచెను. రత్న శోభితమైన యొక సువర్ణదండమును చేతఁబుచ్చుకొని యమో

ఘశాసని యామెప్రక్కను నిలిచెను. జలాంతర్గామినినుండి యొక రత్నపీఠమును సేవకురాండ్రచేఁ దెప్పించి విజ్ఞానశృంఖల మహారాణిని ఆ పీఠమున నాసీనను గావించెను. ప్రకృతి దేవియు కరుణయు నామెకు చెఱి యొక్కప్రక్కను నిలిచి సుగంధము లలఁదఁబడిన వింజామరలతో విసరసాఁగిరి.

క్రమముగా నెల్లరును ద్వీపములో చేరిరి. సామాను లన్నియు దింపఁబడెను. మహారాణి తన చెలికత్తెలనొక పర్వత గుహలోనికిఁ గొనిపోయెను. పైన పట కుటీరములు నిర్మింపఁ బడుచుండెను, ప్రకృతిదేవి ఒక్క పరుగునపోయి యొక ఫల వృక్షము నెక్కి పండ్లు కోసికొని కఱవునఁబడ్డ తన యుదరమును నింపుకొనుచు ఆనందించుచుండెను. ఒకటి రెండు నాళ్లెల్లరును విచ్చలవిడిగా సుఖ సంచారములు కావించిరి. వనములన్నియుఁ దిరిగిరి. సమస్త ప్రదేశములు శోధించిరి. పిదప గృహారామ క్షేత్రాదులకు స్థానములు నిర్ణయించిరి. కలప కోయించిరి. బావులు త్రవ్వించిరి. ఇటుకలు కాల్పించిరి. యంత్ర నిర్మాణము నకు కొలుములు నిర్మించిరి. గనులకై పరిశీలించిరి.

ప్రేమవతి పొడుగరి. సువర్ణచ్ఛాయలనేలు శరీరము తోను, దీప్తిమంతములై యధికారమును దిటవును జూపు చూపులతోను, విశాలమైన నెన్నుదురుతోను, కళాధరుని అపహసించు దివ్యవర్చస్సుగల మోముతోను ఇప్పుడు ప్రేమ వతి ఆద్వీపమున సర్వాంతర్యామియై యెల్ల కార్యములను స్వయముగా విచారించుచుండెను. అత్యంతసాహసము, అస మానబుద్ధి సంపద, అమితమైన ప్రకృతిపరిశోధనదీక్ష కలిగి ప్రేమవతి ఎల్లెడలను శక్త్యుత్సాహములు పురికొల్పుచు నార్ష

ద్వీపమును భూలోక స్వర్గధామముగా నొనరించుచుండెను. దీప్తిమంతములై సోగలై కాటుకపిట్టలను బోలు కండ్లతోను, విండ్ల యాకారముగా దిద్దితీర్పఁబడినట్లున్న కనుబొమలతోను వికాసవంతమగు నర్ధచంద్రుని యాకృతిగల నెమ్మోముతోను బంగారుచాయలఁ దేలుచు కళలతో మెఱయు నునుఁజెక్కుల తోను శ్రీకారముల కధికారము వహించు శ్రోత్రములతోను, నిగనిగని మిసమిసలాడు నల్లని తెగబారెడు వెంట్రుకల తోను, గజేంద్రములనేలు నెన్నడలతోను తేజోవంతమగు రూపమును వహించి తెల్లని చీరను ఎఱ్ఱని యంగీని బంగారు పాదుకలను ధరించి ప్రేమవతి చూపఱులకు సంతోషమును శ్రద్ధను బుద్ధి వికసమును బ్రసాదించుచు ద్వీప నిర్మాణమును పొసఁగించునప్పుడు ఆమెను చూడనివారి జన్మము జన్మము గాదు. అపారమైనవిద్యయు, అప్రతిహతమైన కార్యసాధన నిపుణతయు, అమోఘమైన విద్యానుసంధాన నిపుణతయుఁ గలిగి యీామె ప్రకృతిలోని శక్తుల నన్నింటినిఁ బరిపాలింప నవతరించిన యీశ్వరకళ. అమితమైన యా చొఱవయు, నెంతటి భయావహ పరిస్థితులనైన శాంతముతో నెదుర్కొను నాగభీరతయు, ప్రేమపూర్ణములై చిఱునవ్వు నిగ్గుల వెద జల్లుచు జీవనోత్తేజకములగు నామె శోభా విశేషములును మానవోద్ధారణకు రూపమువహించిన యీశ్వరుని యపర స్వరూపములు.

ప్రేమవతి చాకచక్యమువలన కార్యములన్నియు నెఱ వేఱుచున్నవి. పొలములు నాటఁబడి వరి, చెఱకు, సంభార ములు, కాయగూరలు, మున్నగు నాహారవస్తువులు వృద్ధి

నందుచుండెను. గనులనుండి లోహములు త్రవ్వఁబడుచుండెను. కొన్ని విమానములు నిరంతరమును సముద్ర విహారములు కావించుచు నాపన్నులనుండి కూలివాండ్రను సేకరించి మిగిలినవారిని వారివారి యిండ్లకడ చేర్చుచుండెను. విద్యాలయమొక్కటి వెలయింపఁబడెను. ఓషధులు పెరుగుచుండెను. ఔషధములు సిద్ధమగుచుండెను. ఒక జలాంతర్గామి సముద్రములోని గనులను త్రవ్వుచుండెను. ఒక్కటి క్రొత్తగనులకై సముద్రగర్భమును శోధించుచుండెను. శత్రువులనుండి యార్ష ద్వీపమును గాపాడుకొనుటకై విద్యుదస్త్రములు అపారముగా సిద్ధమగుచుండెను. విద్యుద్యంత్రశాలలో నూతనముగా జలాంతర్గాములును ఓడలును ప్లుతమనోహారిణులును జలలోక గ్రామములకు వలయు పదార్థములును చేయఁబడు చుండెను.

ఒకనాఁడు విజ్ఞానశృంఖల రాణిగారిని సమీపించి "ప్రేమవతీ! మనము నౌకారాజ్యమునుగూడ తేలికగా నేల వచ్చును. వందలకొలఁది నావలు సముద్రములో మునిఁగి మూలుగుచున్నవి. ఆపన్నులైన నావికులు కొందఱితో సంభాషించుచుండఁగా మునిఁగిపోయిన యోడల ప్రసంగము వచ్చినది. అదిమొదలుకొని సమయము వచ్చినప్పుడెల్ల అట్టి సంభాషణలు నెఱపుచు ఎందెందు ఎట్టి ఓడలు ఎప్పుడెప్పుడు మునిఁగినవో అట్టి చరిత్రము నొక్కదానిని నేను కూర్పఁగలిగితిని. నాఁటికినాఁడు సంభాషణలవలన నొక్కొక్క విషయమే బయలుపడినది. ప్రపంచములోని వివిధరాజ్యములకు చెందిన మున్నూరు నావల యానుపానులు ఇప్పటికి నాకుఁ దెలిసినవి.

అవి యన్నియు మూఁడేండ్ల యీ నడుమ మునిగిపోయిన యోడలు."

ప్రేమ—నాలుగవ జలాంతర్గామి సిద్ధమైనది. నీవు దానితోఁబోయి ఒక్కొక్క యోడనే సముద్రగర్భమునుండి పెకలించి తెచ్చి మన నౌకాశ్రయశాలను చేర్పుము. వాని స్వత్వమును గూర్చి తరువాత యోచింతము.

ప్రకృ—చీనాదేశమునకు మన పంపిన జలాంతర్గామి ఒక వత్సరమునకుఁ జాలిన పదార్థములను పాడియావులు మున్నగు జంతు సముదాయమును విలిచి తెచ్చి యిప్పుడే రేవు చేరినది.

ప్రేమ—పశువులను మందలలో చేర్పుము. తక్కిన వానిని యథాస్థానములలో చేర్పుము. నీ లెక్కల పుస్తకముల నొక్కసారి కొనిరమ్ము.

ప్రకృ—మహాప్రసాదము.

మహా—ఇంతవఱకు వేయి మణుఁగుల బంగారము ఆ గనినుండి వచ్చినది. ఇంకను అపారముగా దొరకుచున్నది. ఆయవ్యయముల లెక్కలను ఏలినవారు పరీక్షింపవలెను.

ప్రేమ—వానిని నా కిచ్చివేయుము. నిదానముగా యోచింపవలెను. సముద్రమునుండి మట్టిని త్రవ్వియెత్తు యంత్రము సిద్ధమైనది. అగ్నిపర్వత ప్రాంతములలోని కొన్ని తావులలో నేలయంతయు గడ్డకట్టుకొనిపోయిన బంగారముతో నిండియున్నట్లు శోధనలవలన తెలిసినది. ఆ తావులన్నియు సముద్రపటమున చిత్రింపఁజేసితిని. చీనానుండివచ్చిన మనజలాంతర్గామినిపై త్రవ్వు యంత్రము నెక్కించి ముప్పది

మంది కూలివాండ్రతోఁ బంపివేయుము. జలాంతర్గామి నిండఁ గానే యిచ్చోటికి వారు రావలెను.

మహా—మహాప్రసాదము.

ఈ రీతిగా అన్నద్వీపము ధనధాన్య సంపత్సమృద్ధమై శత్రువుల కభేద్యమై భూలోక స్వర్గధామ మయ్యెను.

---

# పదియైదవ ప్రకరణము.

---

వీరభద్రుఁడును రామభద్రుఁడును నిరంతర ప్రయాణములను గావించుచునే యుండిరి. ఒకసారి భూప్రదక్షిణము ఒనరించిన పుణ్యమప్పుడే వారికి లభించినది. ప్రాచీన కాలమునందు మహర్షులు సహితము భూప్రదక్షిణములు చేయుచుండెడి వారు. భూప్రదక్షిణమువలని ఫలము అనంతమైనదిగా మన శాస్త్రములందుఁ జెప్పఁబడినది. అది మాతృ ప్రదక్షిణముతో సమానమైనదని చెప్పుటలో గౌరవభావములు పురికొల్పఁబడినవి గాని సోమరితనమునకు దోహదము కల్పింపఁబడలేదు. ఈ యర్థమున హిందూదేశములో సముద్రయానము విధింపఁబడినది గాని నిషేధింపఁబడలేదు. వీరరామపక్షీంద్రు లిరువురును సమస్త భూభాగములను దర్శించిరి. అనుకూల భూ ప్రదేశములందు విడిసి కొన్నేసినాళ్లు విశ్రాంతి నందుచు నందలి విచిత్రములు పరీక్షించుచుండిరి. ఉష్ణాత్యుష్ణములైన భూములను ఎడారులను దర్శించిరి. క్రమక్రమముగా శీతలము హెచ్చి సముద్రమంతయు మంచుకరుళ్లతో

పండిపోవు నుత్తరధృవ భూములను, నంతకంటెను ముంచి యెత్తుకొనిపోవు నుర్భర శీతలత్వముగల దక్షిణధృవ భూఖండములను గూడ పరిశీలించిరి. వినోదమునకై అట్టి తావులలో కొన్నిదినములు వసించి యనుభవములను సంపాదించుకొనిరి. ఇట్లాఱు మాసములు వీరు ఉత్తరధృవము, ఆసియా, ఆఫ్రికా, అట్లాంటిక్కు సముద్రము, దక్షిణపు టమెరికా, దక్షిణ ధృవము, తత్ప్రాంత ద్వీపములు సంచరించు చుండుటచే వీరిని బట్టుకొనుటకు ఐరోపానుండి బయలుదేఱిన పటాలము లును శాస్త్రజ్ఞుల పరివారమును ఎంత శోధించియు ప్రయోజనము లేకపోయెను. సామ్యంతయువమ్మై, అసలన్నియు అడుగంటె, ప్రయత్నము విఫలమై తుట్టతుదకు వారు తమతమ దేశములను తిరిగి చేరవలసినవారైరి. మానవబుద్ధి సునిత మయ్యు నొక్కొకవేళ మహాత్కార్యములకు మారకము గూర్చును. కాని ఈశ్వరకటాక్షము సమకూరెనా శివుని యాజ్ఞలేనిదే చీమయు కుట్టదు. వీర రామభద్రుల విహంగములు ఇట్లు శాస్త్రశోధకులు పూనుకొన్న ఆసన్న వినాశము నుండి రక్షణ గాంచినవి. వినాశమున కవకాశములేని శోధనలను చర్యలను నిప్పటి నాగరకులింకను నేర్చుకోవలెను.

ఇట్లీ యనంత భూమండలమునంతను గాలించి స్థూల దృష్టిచే నట్లు దర్శితమైన యీ ప్రపంచమున కొక్కపటమును వారు సిద్ధముచేసిరి. అక్షాంశములతోను, ధృవాంశములతోను, నదులతోను. మహారణ్యములతోను కొన్నికొన్ని పట్టణరాజములతోను, సముద్రములతోను, ద్వీపములతోను, కల్పింపఁబడిన యాపటము లోకోద్ధారణాయత్త మతులకు

అమూల్యమైనది. చిత్రదృశ్యములకు వేలకువేలుగా ఛాయా పటములు ఎత్తఁబడినవి. అవి సహజమైన రంగులతోఁ గూడ తీయఁబడినవి. వాని యక్షాంశ ధృవాంశములు గజములతోఁ గూడ గుర్తింపఁబడినవి. చిత్రములైన మృగములును, పక్షులును, సముద్రజల చరములును గూడ నిట్టి పటములందున్నవి. భూమియు సముద్రములును సముద్ర గర్భములును గూడ నీ భూలోక పటమున చిత్రింపఁబడి యుండెను.

శాంత మహాసముద్రము లోకములోని మహాసముద్రములలో నుత్తమోత్తమ మైనది. వైశాల్యమునందును లోతునందును తనగర్భమునం దిముడ్చుకొన్న రత్న సముదాయమునందును అది సముద్రముల కన్నింటికి రాజు. అట్లాంటికు సముద్రముకంటె రెండు రెట్లును, హిందూ మహాసముద్రముకంటె రెండున్నర రెట్లును అధిక వైశాల్యముకలది యగుటచే నిది నిశ్చయముగా సముద్రముల కన్నింటికిని రాజు. ఇందొకమూల పగడంపు పురువులు పగడములతోనే ద్వీపములను మహాద్వీపములను ఖండములను నిర్మించినవి. మఱియొకమూల అగ్నిగ్రధములు పర్వతపంక్తులను, సుగంధ ద్వీపములను బుట్టించినవి. ఎందును రెండుమూఁడుమైళ్లకు తక్కువ లోతు దీనియందుఁ గానరాదు. ఐదేసి మైళ్లలోతుగల ప్రదేశములుగూడ దీనియందుఁగలవు. ఈ మహాసముద్రము ఎంత లోతుగా నున్నదో దీని పైభాగము అంత ప్రశాంతమైనది. సూర్యుఁడు సంచరించు నిరక్షరేఖ ఈ సముద్రమందున్నది. సూర్యసంచారము లేక ఆఱునెలలు పగలును ఆఱునెలలు రాత్రియునై యుండు ప్రదేశములుగూడ నీ సముద్రమునం

దున్నవి. తిమి; తిమింగిలములు దీనియందు సంచరించును. భయంకరములైన మకరములు దీని గర్భమునందు ఊఅటఁ గాంచును. ఈ శాంతమహా సముద్రమును వీక్షించిన వాని కంట్లే కండ్లు! ఇందు ప్రయాణముచేసిన మానవుని జన్మమే జన్మము.!

అట్టి యీ మహాసముద్రమున అక్షాంశము 150° 43′ 29″ ధృవాంశము 28° 57′ 16″ గల ప్రదేశమున నొక నాఁడు ఈ విహంగ ద్వితయము ఎగురుచుండఁగా దిగువ నొక యోడ సముద్రములో మునిఁగి పోవుచుండెను. ఓడలోని జనులు ప్రాణవాహు లనఁబడెడి చిన్నపడవలలో నెక్కఁ్ంపఁ బడుచుండిరి.

మానవప్రాణము అనాగరకు లండైనను రక్షణీయమే. ఈశ్వరుని దివ్యతేజము అనాగరక వ్యక్తియందు ప్రచ్ఛన్నము గాని యభావముగాదు. ఆపద్రక్షణము అవశ్యకర్తవ్యము. వీరరామభద్రులు తమ విమానములనుండి వెంటనే దిగువకు వ్రాలి మునిఁగిపోవుచున్న యీ యోడ తెఱ చాపకొయ్యను పక్షీంద్రుల పాదములకు బంధించివైచిరి.

రామ—“ ఈశ్వరుని దివ్యతేజమునకు నివాస భూతులారా! భయపడకుఁడు. మీ యోడ ఇక్లనీట నిలిచియుండును. నిదానముగా ప్రాణవాహులలోనికి చేరుఁడు. ఓడలోని అమూల్యవస్తువులను వీలైనంతవరకు తెచ్చుకొనుఁడు. ”

ఆ యోడ యందార్వురు ఆంధ్రులుకలరు. వారు కోరంగి రేవున ఓడలు నిర్మించువారు ప్రకృతమున నా చీనా యోడలో కొలువులో నున్నవారు. ఈయోడ క్యూబా ద్వీప

మునుండి బయలు దేఱి నడుమ తుపానులవలన శిథిలమై గాలి వేగమున నిచ్చోటికి కొట్టుకొనివచ్చి మునిఁగిపోవు చున్నది.

ఆంధ్రులీ శబ్దమునువినిరి. "మీయందలి ఈశ్వర తేజమునకు జోహారు." అనిపలుకుచు. ఓడలోని యెల్లరను వారు ప్రాణవాహులలో చేర్చిరి. కాని తెఱచాపకొయ్య దృఢముగా లేదు. ఆకొయ్య పక్షీంద్రుల కాలిలోనికి ఎక్కివచ్చినది. క్రింది యోడక్రిందనే మునిఁగిపోయినది. దానియందు అనంతములైన బంగారు కణికలు జపానుదేశమునకుఁ గొనిపోఁబడుచుండెను. ఓడనాయకుఁడు హాహారావములు కావించెను.

"నేనే ఈశ్వరకళను నాయందుఁగల మానవుఁడనేని, అమోఘములైన సృష్టిశక్తులు విజ్ఞానియగు మానవునికి బంటులేని, ఈ యోడను నేను తప్పక కాపాడెద" నని పలుకుచు వీరభద్రుఁడు తన యంత్రముతో ఆ జలార్ణములో మునిఁగిపోయెను. వారించుటకైన నితరులకు ఎడమీయలేదు. అచ్చోట సముద్రము నాలుగుమైళ్ల లోతు. సృష్టిమర్మముల నెఱుఁగని వారిని యీసృష్టి యల్లాడించి హతమొనర్చును. భూ గర్భమునందు వలెనే సముద్ర గర్భమునందును జల ప్రవాహము లుండును. వీనికి అంతర్వాహినులని పేరు. ఓడ దిగువను ప్రచండమైన యంతర్వాహిని యొక్కటి కలదు. మునిఁగినయోడ సూటిగా అడుగున చేరలేదు. ప్రవాహముచే నీడ్వఁబడి దారి తెన్ను ఎఱుఁగకుండ కొట్టుకొని పోవుచు నెందేని యొకయెడ తాను మునిఁగిన చోఁబదిమైళ్ల కవ్వల ఆయోడ అడుగుచేరినది. యంత్రపు బరువువలన మునుఁగుచు చాలవఱకు ప్రవాహవేగమును నిరోధించుకొని వీరభద్రుఁడు

మఱియొకచోట సముద్రపు టడుగుచేరెను. అందుండి విద్యుత్కాంతులను ప్రసరింపఁజేసి చక్రాకారముగా గిరగిర తిరుగుచు నాతఁడు చుట్టుప్రక్కల నెంతెడమో యంత్రములతో పరీక్షించెను. కాని యెందును మునిఁగిన యోడ కానఁబడలేదు. ఇంతలో సీతని విద్యుద్యంత్రమునం దొక పెద్దయలజడి కలిగెను. దిక్సూచనిలో విప్లవములు కానఁబడెను. విహంగము మరలను లక్ష్యపెట్టక ఉత్తరదిక్కుగా పరుగెత్తసాగెను. ఎంత ప్రయత్నించినను నది వీరభద్రునకు లొంగలేదు. దూరమున శిఖరాకారమైన మహాపర్వత మొక్కటి కానవచ్చుచుండెను. అంతకంతకు విహంగ వేగము హెచ్చినది. ఒక్కవిసరున పోయి యది మహాపర్వతమును గొట్టుకొని దానికి అంటుకొని పోయినది. అది యయస్కాంత (సూదిగంటి) శిలామయమయిన మహాపర్వతము. వీరభద్రుని విహంగము ఇనుముతోఁ జేయఁబడినదగుటచే నాకర్షింపఁబడి నాలుగు మైళ్ల లోతున ఆ మహాసముద్రములో ఆ పర్వతమునకు కఱచుకొని పోయినది.

# పదునాఱవ ప్రకరణము.

వీరభద్రుఁడు సముద్రములో మునిఁగిన తరువాత నెన్ని దినములయినను పైకిఁ రాలేదు. రామభద్రుఁడు జలముగుండ విద్యుద్వార్తల నెన్నియో యంపెను గాని యందొక్కటియు వీరభద్రునకుఁ జేరలేదు. అట్లే వీరభద్రుఁ డంపిన యో

సందేశముగాని రామభద్రునకుఁ జేరలేదు. ప్రాణ వాహులలోఁ జేరిన యోడలోనివారు ఏనాఁడో తమయోడకు ఆశలు వదలుకొనిరి. విహంగములు దానిని పట్టియుంచినందున నమను కొంతయాశ మఱల కలిగినది గాని వీరభద్రుఁడు నీటమునిఁగి తిరిగి తేలనందున నాతనికిని ఆ యోడగతియే పట్టినదని వారికి నిశ్చయమైనది. ఇంతలో నాప్రదేశమునకు జపానుదేశము నుండి కామచ్ఛాట్కా ద్వీపకల్పమునకుఁ బోవుచుండెడి యోడ యొక్కటివచ్చెను. అదివీరిని ఎక్కించుకొని కొనిపోవుటకు సమ్మతించెను. ఎంతచెప్పినను వినక ప్రాణవాహులలోని వారు ఆయోడనెక్కి వెడలిపోయిరి. రామభద్రునిఁగూడ నెక్కించుకొనుట కాయోడ యజమాని యంగీకరించినను, తనసోదరుని సముద్ర గర్భములో వదలిపెట్టి వెడలిపోవుట కాతనికి మనస్సురాకుండెను. తానుగూడ సముద్రమున మునిఁగి వీరభద్రుని వెదకవలెనని యాతఁడు తలంచెనుగాని విమానమును గొలుసుకొనతో జపానుఓడకు బంధించి దిగుట క్షేమకరము. నాలుగుమైళ్లు పొడుగుగల గొలుసు అచ్చోట లేదు ప్రేమమనునది తననుండి బంధువర్గమునందును. పిమ్మట మిత్రవర్గమునందును, తరువాత స్వశాఖయందును స్వదేశము నందును, పిమ్మట సర్వమానవులందును వ్యాపించును. ప్రపంచమునంతెను సమానప్రేమముతోఁజూచుమతము ప్రేమవతి యింకముందు స్థాపింపవలెను. ప్రాణవాహులలోని యాంధ్రసేవకులు రామభద్రుని విమానములోఁచేరిరి. తక్కినవారితో తుట్టతుదకు ఆయోడ వెడలిపోయెను. ఏమైనను కానిమ్మని రామభద్రుఁడు నీటమునుఁగుటకు ఉద్యుక్తుఁడయ్యెను.

అట ఆర్షద్వీపములో ప్రేమవతికి విచిత్రమైన యూహ యొక్కటి తోఁచెను. ప్రపంచమునందు ఏకజాతి పర్వతములు ఏకపంక్తిగా నుండుట యనుభవ గోచరము. ఆస్ట్రేలియా యందు బంగారపుగనులున్నవి. ఆ పర్వతముల చాలునకు చేరిన సముద్రములోని యిన్నూరుమైళ్ల కావలి కొండలలో గూడ తమకు బంగారుగనులు లభించినవి. కాలిఫోర్నియాలో బంగారపు గనులుండఁగా నాచాలులోని యొకపాఱ సముద్ర గర్భమున నేనూరుమైళ్లి కావలగూడ తమకు బంగారపు గనుల నొసఁగినది. కాఁబట్టి యెందెందు బంగారపు గనులు భూలోకములో తెలియఁబడినవో ఆ కొండల యొక్కయు, ఆభూమి పొఱలయొక్కయు చాళ్లను శోధించినచో నా వరుస లను సముద్రముదాఁకఁ గొనివచ్చుటకు అవకాశము ఉండ వచ్చును. కాఁబట్టి సుమేరు పర్వతమును ముందు కనిపెట్టి, సముద్రములోనికి వ్యాపించిన దాని శృంగములను శోధింప వలెనని ప్రేమవతి తలంచెను. ఇఁక మేరుపర్వతమును గనుఁ గొనుటకు ప్రయత్నము చేయవలెను.

"విజ్ఞాన శృంఖలా! ఇంతవఱకును మనము పొరఁబడి తిమి. మేరువు పర్వతము నిరక్షరేఖకడ లేదు. ఇది నిశ్చ యము. మనమిప్పుడు మహామేరువును వెదకి పట్టవలెను. ఇంత వఱకును తప్పుదారిని తిరుగుచుంటిమి."

విజ్ఞా—నిరక్షరేఖకడ నది లేనిచో మనకు బంగారపు గనులెట్లు దొరకినవి ?

ప్రేమ—మేరువే మన నిక్షేపములకు గుఱి. మేరువును సంపాదింపక మనజన్మ జన్మకాదు ; కరుణదేవిని అమోఘశాస

గని. ఆస్ట్రేలియా ద్వీప పరిపాలనకు వదలిపెట్టి మనము నిజమైన మేరువును వెదక నరుగుదము.

విజ్ఞా—మేరువుచుట్టును సూర్యచంద్రులు తిరుగుచుందురని శాస్త్రము. అది యిచ్చోటికి వర్తించుచున్నది. జ్యోతిశ్శాస్త్రము ప్రకారముగా నిరక్షరేఖ సూర్యునిమార్గము. దానికితోడు బంగారమును దొరకినది. ఆస్ట్రేలియా ద్వీపవాసులు త్రవ్వుకొనుచున్న గని యొకగనికాదు. నిజమైన మేరువు మనము త్రవ్వుచున్నదే. అగ్నిపర్వతముల వలన నిచ్చోట చాల విప్లవములు కలిగినవి. మేరువు మునిఁగినది. ఆస్ట్రేలియా తేలినది.

ప్రేమ—అట్లయ్యును అది మేరువుకాదు. నిజమైన మేరువు మనకింకను దొరకలేదు. అది యింకను నుత్తరదిశను కలదు. మేరువు పర్వతమంత బంగారమైన లేకుండ మనమేమి లోకోద్ధరణము చేయఁగలము ?

విజ్ఞా—అట్లు చెప్పినచో నిజమైన మేరువు లేనేలేదు. మేరువు ఆకసము నంటినదనియు దానిచుట్టును సూర్య చంద్రులు తిరుగుచున్నారనియు పెద్దలు చెప్పుదురు. ఆకసమునకు చిల్లిపొడుచుకొండ లీలోకములో లేవు. సూర్యునిచుట్టు భూమి తిరుగుచున్నదిగాని కొండచుట్టు సూర్యుఁడు తిరుగుటవలన పగలును రాత్రియుఁ గలుగుచున్నవనుమాట అశాస్త్రీయము ; అనుభవ విరుద్ధము ; అజ్ఞాన జనితము. మేరువన్నమాటకు కొలికపూసయని యర్థము.

ప్రేమ—కాని మేరువు పర్వతమును మనము కని పెట్టక తప్పదు. అంత యెత్తులేకున్న లేకపోవచ్చునుగాని పర్వ

తము మాత్రము సర్వసత్యము. నాలుగు విమానములను ఒక జలాంతర్గామిని ఏబది ప్లతిమనోహారిణులను, ఆరు నెలల గ్రాసమును సిద్ధము చేయించుము. నేఁడే తగు సన్నాహములతో మనము బయలు దేరవలెను.

విజ్ఞా—పర్వతము దొరకకపోయినను శోధనము వ్యర్థముగాదు. అట్లే పోవుదము.

ప్రేమ—మేరువనఁగా సుమేరువు. అదిగో బంగారు కొండ—సముద్రములో నున్న దాని భాగమంతయు మనదే. మేరువంత బంగారమైన లేక మనమేమి చేయఁగలము?

విజ్ఞా—రాణిగారు చెప్పినప్పుడు మంత్రిగారు తలయూపక తప్పునా? ఇంతకును ప్రేమ పాశములవలన యీ మానవలోకమే మనకు మేరు పర్వతము అయిపోయినది.

ప్రేమ—మేరువునకు మార్గముగూడ నాకుఁ దెలియును.

విజ్ఞా—అవ్యాజప్రేమయే సుమేరుస్పృష్టికి అమోఘమైన మార్గము.

ప్రేమ—నీ వేదాంతములు చాలించు. భూమికి నడుమ మేరువు పర్వతము. దానిచుట్టును ఇలావృతవర్షము; ఇలావృతమునకు ఉత్తరమున నీల పర్వతములు; వానికి ఉత్తరమున రమ్యకవర్షము;

విజ్ఞా—నాకును దెలియును. రమ్యకమున కుత్తరమున హిరణ్మయ పర్వతములు. పేరునుబట్టియే యివి సువర్ణ మయములు. వాని కుత్తరమున శృంగ పర్వతములు.

ప్రేమ—శృంగ పర్వతముల కుత్తరమున ఉత్తర కురు

భూములు. మానవులు ఇందు చొఱలేరు—చొఱరాదు. రాయ సూయమప్పుడు అట్లే కృష్ణుఁడు అర్జునుని నిరోధించినాఁడు. ఇది నీకు జ్ఞాపకమున్నదా ?

విజ్ఞా—ఉన్నది. ఆపైఁ సముద్రము. అంతటితో సరి.

ప్రేమ—ఇదిగో నీతప్పు. హరివంశము చూచితివా ? అందు నతికి వేయఁదగినంత దట్టమైన చీఁకట్లు వర్ణింపఁబడినవి. అచ్చటి సముద్రము గడ్డకట్టుకొనిపోయి యుండునట ! చీఁకట్లనఁగా ఆఱునెలల రాత్రియని యర్థము ; సముద్రపుగడ్డలు మంచుకరుళ్లు.

విజ్ఞా—అనఁగా ఉత్తర ధ్రువమును ఉత్తర మహా సముద్రమును దీనినిబట్టి నిర్ణయింపఁబడుచున్నవి. ఇప్పుడు నాకు బోధపడినది.

ప్రేమ—ఋగ్వేదములోని ఉషస్సులును. నక్షత్రగ్రహ వర్ణనలునుగూడ నీ ప్రదేశమును స్పష్టపఱుచుచున్నవి.

విజ్ఞా—అబ్బా ! నీయూహ ఎంతదూరమరిగినది ? నీవు చెప్పుమాట సత్యము.

ప్రేమ—కాఁబట్టి ముందు మనము ఉత్తర ధ్రువమున కేగి అందుండి దక్షిణముగా మూఁడువరుసల మహాపర్వత పంక్తులను దాఁటితిమేని ఆపైని కానవచ్చు పర్వత పంక్తులు మేరువు పూర్వము ఉండిన స్థానమును దెలుపవచ్చును. ఇప్పుడు మేరువునకు దారి తెలిసినదా ?

విజ్ఞా—అక్కా ! నీబుద్ధికి అలవికానిది లేదు. తప్పక ఈ శోధనను చేయుదము.

ప్రేమ—హిరణ్మయములోను బంగారము దొరక

వచ్చును. కాఁబట్టి ఒక జలాంతర్గామినిని కామఛ్కాట్కా ద్వీపకల్ప ప్రాంతములందు సముద్రములో నిర్ణితస్థానమున నిలిపి నాలుగు విమానములతో మనము భూశోధనల కరుగుదము.

ఆనాఁడే తగిన సన్నాహముతో ప్రకృతిదేవియు, విజ్ఞాన శృంఖలయు, మహాలక్ష్మియు ప్రయాణమైరి.

అప్పటికింకను రామభద్రుఁడు నీట మునుఁగలేదు; యత్నించుచున్నాఁడు. ఆ వేళకు విమానములచ్చట చేరినవి. ప్రేమవతి రామభద్రుని గుర్తించెను; రామభద్రుఁడు ప్రేమవతికి తన విమానమునుండియే సాష్టాంగ మాచరించెను.

"అక్కా! వయస్సున చిన్నదానవయ్యు జ్ఞానమున నీకంటె నెక్కువవారు ఆర్ష యోగీంద్రు లొక్కరుతక్క ఒరులు మన ప్రకృతి నిలయములో లేరు."

విషయమంతయు ప్రేమవతికి తెలుపఁబడెను. పరిశీలించి ఆమె యిట్లు పలికెను.

"అన్నా! మీకడ ఫ్లుతమనోహారిణులు లేవు. విమానము బురదలో కూరుకొనిపోయియో యే పర్వత గుహలోనో మఱఁగిపోయియోయున్న యెడల నందు శోధించు యంత్రములు పక్షీంద్రునియందు లేవని నీ మాటలవలన స్పష్టమగుచున్నది. కాఁబట్టి మీరు నీటమునిఁగినను లాభములేదు. మా జలాంతర్గామినియందు శుద్ధ సువర్ణముతోఁ జేయఁబడిన మీ పక్షి వంటి ధృతరాష్ట్రయంత్రమే కలదు. దానియందు బాణాసుర యంత్రముగూడ సమర్పఁబడినది."

రామ—అది యెట్టిది!

ప్రేమ—దానికి వేయిచేతులు. వేయిచేతులును ఏక కాలమున శోధనకు సంబంధించిన పనులు చేయుచుండును. ఒకచేయి సముద్రపు లోతుకొలువగా మఱి యొకచేయి సూక్ష్మాతి సూక్ష్మములైన సముద్ర కీటములను పెట్టెలలో బంధించి పైకి తెచ్చుచుండును? మఱియొకటి సముద్రపు టడుగుమట్టిని పొఱ పొఱనుండియు అందినంతవఱకు ప్రత్యేక మందసముల నిమిడ్చి తెచ్చుచుండును. ఒక్కటి యొక్కొక్క లోతునగల వేడిమిని, భారమును దెల్పును. ఓడ నడచు చుండఁగానే ఎంత శోధనమునకో యీ యంత్రము ఉపకరించును. నేనును నా పరివారమును వీరభద్రుని సాధించి తప్పక కొనిరాఁగలము.

విజ్ఞా—పాతాళగర్భమున దూఱినను ఆయన మాకు దొరకఁగలఁడు.

రామ—మూఁడు మాసములదాఁక నెంమన్నను నాతనికి భయములేదు. ఆపయిన జలములనుండి ప్రాణవాయువును సముద్ర జంతువులనుండి నత్రజనమును కూర్చుకోక పోయినచో ప్రమాదమువచ్చును.

ప్రేమ—అన్నా! మేము వచ్చుదాఁక నీ విందేయుండుము. నెలదినములైనను నీవు అధైర్యపడవలదు.

ఇట్లుచెప్పుచు ప్రేమవతి సువర్ణయంత్రముతోను పరివారముతోను ఫ్లుతమనోహారిణులతోను నీట మునిఁగిపోయెను. యంత్రోపరి భాగమునందలి ఇరిడియమును లోహముతోఁ జేయబడిన కత్తులును శూలములును ముండ్లును పైకి లేవఁదీయ బడినవి. విద్యుద్దీపములు వెలిగించి యా వెలుఁగులో

సముద్రగర్భమును భూతదర్పణముతోను దూరదర్శనులతోను శోధించుచు ప్రేమవతియు పరివారమును ఒకగంటలో సముద్రపు టడుగుననున్న యూబిని సమీపించిరి. ఆ యూబిలో కూరుకొని పోకుండ ప్రేమవతి యంత్రమును నించుక యూర్ధ్వగమనముతో నడపించుచు, విద్యుద్వార్తలను ఆ యూబిలోనికిఁ బంపెను. ఎందైన వీరభద్రుఁడున్న యెడల ప్రతివార్తలు రావచ్చును. కాని యెంత ప్రయత్నించినను నట్టి జాడలురాలేదు. ఈలోపున బాణాసుర యంత్రము తన వేయిచేతులతోను సముద్రపు టడుగుమట్టిని తీసికొనివచ్చుచు వీరభద్రుని విమానముకొఱకును వెదకెను. విమానము కానలేదు. కాని ఆశ్చర్యము! ఆ ప్రదేశమంతయు ఒండులో మిళితమైన బంగారపుటిసుక. అది హిరణ్మయ పర్వతముల చాలు. అది వానిలోని సముద్ర గతమైన భాగము.

ఆ ప్రదేశమును గుర్తించుకొని సువర్ణ యంత్రము చేఁపవలె నలుదెసలకు ఈదసాఁగెను. దశదిశలకు విద్యుద్వార్తలనిపెను. బాణాసుర యంత్రముతో శోధించెను. ఎందుండియు ప్రతివార్తలురాలేదు. కాని అరిగిన యెల్లచోటులను బంగారపు టిసుకలును, ఒక్కొక్కచోట బంగారపు ముక్కలును గూడ కానవచ్చుచుండెను. చుట్టుప్రక్కల పదిమైళ్ల దూరము దాఁక గాలింపఁబడెను. ఎందును వీరభద్రునిజాడ కానరాలేదు. పోయిపోయి యీ యంత్రము విపరీతవేగముతోఁ బరువెత్తుచున్న యొక జలప్రవాహములోఁబడెను. అది భీకరమైన యుష్ణవాహిని. అది అచ్చోటి యొక పర్వత గర్భమునుండి వెడలి సముద్రపు టడుగునకుదిగి. యెత్తునుండి జాఱిన కార

ణామున భయంకర వేగము కలదై యీ సువర్ణయంత్రమును ఈడ్చుకొని పోయెను. కాని విద్యుద్వేగముచే నందుండి బయలుపడులోపున ప్రేమవతి దారితప్పి పోయినది. తప్పించుకొని స్థల పరీక్ష చేయునప్పటి కామె తాను నీటమునిగినచోటికి ఏబదిమైళ్ల కవ్వలనుండెను. అచ్చోట నేలను శోధించుచుండఁగా బాణాసుర యంత్రపు రాగిగొలుసులు ఊబిలో చిక్కుకొని పైకి రాలేదు. ఫ్లుతమనో హారిణులతో క్రిందికిదిగి పరిశీలింపఁగా నది వీరభద్రుఁడు తేనరిగిన సువర్ణపు కణికలుగల యోడ యయ్యెను. అక్షాంశ ధృవాంశములతో నాస్థానమును గూడ గుర్తించుకొని ప్రేమవతి ఉష్ణవాహినిని తాఁకకుండ, దాని వలని సుడి గుండములలోఁ బడకుండ మెల్లగా తా నావాహిని బయలుదేఱుచోటికి వచ్చి దూరమున మఱియొక కొండను గాంచెను. విద్యుత్కాంతులా పర్వతముపైఁ బడినవి. అందలి కొన్నిభాగములు పచ్చని కాంతులతో ధగద్ధగాయ మానముగా మెఱయఁజొచ్చెను. ఈ పచ్చనిదంతయు శుద్ధసువర్ణము ఈకొండ రెండున్నర మైళ్లు యెత్తున్నది. దానికవ్వల మఱల ఊబి. ఆ యూబిని, ఈపర్వత పార్శ్వములను వీరభద్రునికై శోధించి ప్రేమవతి దానికి పదిమైళ్లదూరములో నున్న మఱియొక పర్వతమును సమీపించెను. దానియందును వీరభద్రుఁడు కానరాలేదు. ఆకొండ కవ్వలిపార్శ్వమున బాణాసుర యంత్రము ఊబిని పరిశీలించుచుండఁగా నామ్కృద్గర్భమున యంత్రపుగొలుసు మఱల చిక్కుకొనెను. ఫ్లుతమనో హారిణులతో నా గొలుసును విడిపించుటకై లోనికరుగఁగా నదియొక వాడియైన యినుపకత్తికి కొంకిపడియుండెను.

అదియే వీరభద్రుని విహంగము. ఎల్లరును ఉబ్బి గంతులు వైచిరి. ప్లుతమనోహారిణులతో దానికడ కేగిరి. "వీరభద్రా! వీరభద్రా!" లోపలినుండి మాటరాలేదు. అభేద్యముగా మూయఁబడిన యా విహంగములోనికి పైనుండి శబ్దములు చొరలేవు. ప్రేమవతి యంత్రమును లాఁగ బోయెను. అప్పటికి అది విద్యుచ్ఛిలలకు అంటుకొని పోయి నట్లు విశదమైనది. ఎంత ప్రయత్నించినను లోపలినుండిశబ్దము వచ్చుటలేదు.

ప్రేమవతి కే యుపాయమును తోఁచలేదు. యత్నించి యత్నించి తుట్టతుదకు ఆయంత్రపార్శ్వమున రాగిఱేకులతో నొక చిన్నగుడారమును జలాభేద్యముగా నిర్మించెను. కొన్ని ప్లుతమనోహారిణులతో తానును విజ్ఞాన శృంఖలయుఁ గొంత మంది పరివారమును నందుఁ • ప్రవేశించి యంత్రసహాయ ముతో విహంగమునందొక సొరంగమును గల్పించిరి. కాంత శిలలవలన నా విద్యుద్విహంగమునం దెట్టి విప్లవములు కలిగినవో యని జాగ్రతతో పరిశీలించి తగిన సంరక్షణ మొనర్చుకొని లోనఁ బ్రవేశించిరి. వీరభద్రుఁడందు స్మార కములేకుండఁ బడియుండెను. విహంగమును శోధింపఁగా వేఱొక యెనమండ్రుగూడ నట్టిస్థితిలోనే యుండిరి. నాడిని పరి శీలించి, కదలికవలన ప్రమాదము పొరయదని తెలిసికొని వారిని ముందు గుడారములో చేర్చి యా గుడారముకడకు సువర్ణ యంత్రమునుదెచ్చి అప్రమాదముగా నందు ఎల్లరను ప్రవేశపెట్టిరి. వెంటనంటియే యుండు చికిత్సకి ఎల్లరకును వైద్యోపచారములు కావించుచుండెను. వీరభద్ర విహంగము

నందలి పదార్థములను శోధించుటకు వ్యవధిలేదు. గుడార మును అక్కడే బంధించియుంచి ఎల్లరును బయలుదేరిరి. రెండు గంటలలో సువర్ణయంత్రము మఱల నీటఁదేలినది. దిక్సూచనివలన నా ప్రదేశము రామభద్రుఁడున్న తావునకు ఏఁబది మైళ్ల దూరములోనున్నట్లు తేలినది. తీఁగెలులేని విద్యుద్వార్తలు వెంటనే రామభద్రునకుఁ బంపఁబడినవి. సువర్ణపర్వతముల విషయము ఆతనికిఁ దెలుపకున్నను, వీరభద్రునిస్థితిని గూర్చి సంపూర్ణముగా దూరశ్రవణ యంత్రములతోనే సంభాషణలు నడచినవి. మఱియొక గంటకాలములో రామభద్రుఁడు వీరిని కలసికొనెను.

# పదియేడవ ప్రకరణము.

వీరభద్రుఁడును రామభద్రుఁడును తమ జీవితములను మానవోద్ధరణమునకు సమర్పించుకొని ప్రేమవతికడనే నిలువఁగోరిరి. సంతోషముతో ప్రేమవతి దీని కంగీకరించెను. మగవాండ్రెవ్వరును దక్షత లేరన్న జంకు దీనితో తీఱిపోయెను. ధృతరాష్ట్రి యంత్రములు రెంటియందును జేరి పదునార్వురాంధ్ర సేవకులుండిరి. వారును ప్రేమవతి పరివారములో చేరిరి. శాంతమహాసముద్రములో నప్పుడప్పుడు మునిఁగిపోయిన యోడలును పడులకొలఁది ప్రేమవతి నౌకాదళమునకుఁ జేర్పఁబడుచుండెను. వానిలో బొత్తుగా శిథిలములైన యోడలలోని గట్టి భాగములను నూతన నౌకా నిర్మాణమునకు ఉపయోగిం

చుచు, కొంచెముగా మాత్రమే చెడినవానికి మరమ్మతు లొనర్చి చక్కఁజేయుచు, నూతన పద్ధతులతో క్రొత్తయోడలనుగూడ నిర్మించుచు నానాటికి ప్రేమవతి తననౌకలసంఖ్యను వృద్ధిచేసికొనుచుండెను. అనవరతశోధనలవలన సముద్రగర్భమునందు అనంతముగా గనులు దొరకుచుండెను. సముద్రమునందు ప్రమాదముల నందినవారిని సర్వదా వెదకి వెదకి రక్షించుచు నందుండి పనివాండ్రనుగూర్చికొని వారికి ఏ దేశములోను దొరకని అధిక భృతిని, అనుకూలములను అమర్చి ప్రేమవతిపనులు జరిగించుచుండెను. వీరభద్రుని విహంగమునఁగల ప్రపంచ పటములును ఇతర పరికరములును సంశోధింపఁబడి యార్ష ద్వీపమునకుఁ దేఁబడినవి. పనులు చక్కఁగా సాగుచుండెను.

ఎచ్చట ఏ గనియున్నదో అందెందఱెందఱు పనిచేయుచున్నారో రాణికిని మంత్రికిని సేనాధ్యక్షునకును, కోశాధికారిణికిని మాత్రమే తెలియును. గనులలోనికి ఇతరులను జేర్చునప్పుడును, అందుండి వెలికిఁ దెచ్చునప్పుడును జలాంతర్గాములు నీట మునుఁగుచు తేలుచు సముద్రమున చాల దినములు సర్వదిక్కులను తప్పుదారులను పోయిపోయి తుదకు నీటమునిఁగి పదిదినములు అటునిటు సంచరించి పిదప నియమితస్థానము చేరును. అందువలన నే గని యెచ్చోటనున్నదో నిర్ణయింప వీలుకాదు. దిక్సూచనిగాని స్థలనిర్ణయమున కుపకరించు నెట్టి సాధనములుగాని గనులు త్రవ్వు ప్రదేశములో నుండవు. గనియందు ఒక కూలివాఁడు నెల దినములు మాత్రమే పనిచేసి రెండు నెలలు ఆర్ష ద్వీపమున విశ్రాంతినొందును. అన్ని

గనులును ఏకరూపముననే యుండుటచే తేలికగా పనివాండ్రు సహితము స్థలవిభేదమును గుర్తింపనేరరు. ఎచ్చోట నెట్టి గని యున్నదో యెవ్వరును తెలుపఁజాలరు.

ఇట్లు అమోఘములైన కట్టుదిట్టములతో పనులు జరుగుచుండెను. వెండి, బంగారము, రాగి, మున్నగు సమస్త లోహములును, అమూల్యమైన నవరత్నములును కొండల పొడుగు రాసులై ఆర్ష ద్వీపమును నింపి వైచుచుండెను.

మానవ హృదయమునందలి ప్రమోహ శక్తులవలన నన్యదేశీయులు లార్షద్వీపమున కాపదలు కూర్చునెడల ఆత్మ సంరక్షణము విధాయకము. అందులకై యమోఘములైన విద్యుచ్ఛస్త్రములతో ప్రేమవతి ద్వీపమునకు కోటఁగట్టెను. దీవిచుట్టునుగల జలగర్భమునను, ద్వీప భూభాగముచుట్టును ప్రాణాంతకములగు విద్యుద్బాణము లమర్పఁబడినవి. పోరు పొడమునేని బ్రహ్మ శిరోనామకాస్త్రము ఒకటి యినుప కవచములను బాణములను ధరించినవారి నెందఱనైన ఆకర్షించి తనకు అంటుకొని పోవునట్లు బంధించివేయును; ఒక్కటిని మానవుఁడు తాఁకెనేని, వాని స్పర్శగల సమూహమంతయు వితాకు చెందును; మఱియొకటి యగ్నిస్వరూపమై శత్రువులను దహించివేయును; రక్తమున మాలిన్యముగూర్చి కొన్ని నాగాకారముగల బాణములు నాగాస్త్రములగును; విషవాయువులను గలిగించి కొన్ని వాయువ్యాస్త్రములగును. ఇట్లు ప్రాచీనశాస్త్రములందుఁ జెప్పఁబడిన సర్వవిధములైన యస్త్రశస్త్రములను సిద్ధముచేసి ప్రేమవతి ఆర్షద్వీపమును శత్రు దుర్భేద్యము కావించెను. అందుండువారు తన యను

మతిలేక యవ్వలకు పోలేరు. అవ్వలివారు తన యనుమతిలేక లోనికిరాలేరు. ప్రమూఢమైన పరమానవాంతః కరణమువలని దోసఁగులను నివారించుటకై సరియైన మానవత్వమందని మోహాంధులకొఱకు ప్రేమవతి యిట్లు నిరోధములు కల్పింప వలసి వచ్చెను. ఇంతకును మాఱుమూల నేటి పాఱవైచిన ట్లున్న ఏ దేశమార్గమునకును ననుకూలింపని చోటులోని యీ ద్వీపమువలన నెవ్వరికిని ప్రమాదములు పొసఁగఁగూడదు. ఇచ్చటకు రావలసినవారును అంతవఱ కెవ్వరును లేరు. కాని ఏమఱి యుండరాదు.

ధనములు చేకూఱినవి. అపారముగా వచ్చుచున్నవి. కాని యీ ధనమెవ్వరిది? పరమేశ్వరునిది.

పరమేశ్వరుని సృష్టివలన మానవున కేమి ప్రయో జనము? సృష్టిచేత ఊడిగములు చేయించుకొనుచు సృష్టి యందు ఈశ్వరుని, తనయందు లోకోత్తరమైన యీశ్వర కళను చూచుకొని తద్రీతిని తన జీవితమును నిఖిల మానవుల కును ఉత్తేజకమగునట్లు చేసికొనవలెను.

"తనయందు నిఖిల భూతములందు నొకభంగి సమ వర్తనంబున జరుగు" గుణము తనలో పుట్టవలెను.

"విజ్ఞాన శృంఖలా! విజ్ఞాన శృంఖలా! మన యాశ యములందు మొదటిభాగము సిద్ధించినది. ఇఁక మానవ ప్రకృతిని మార్చివేయు పని నారంభింపవలెను. పద! పద!"

విజ్ఞా—ఎక్కడకు—పద—వలెను?

ప్రేమ—వీరరామభద్రాదుల ప్రపంచపటములున్నవి. మనమును ఒక్కసారి నవఖండ మండితమైన యీ భూలో

కమునంతను విహంగయానమునఁ బరిశీలించి యవ్వలి కార్య మునకు దొరకొందము.

విజ్ఞా—ఎన్ని విహంగములు? ఏమేమి ప్రయత్న ములు?

ప్రేమ—నాకుఁ దెలియదు. నా హృదయమంతయు మానవోద్ధరణారంభమను భావసుధ నాని మత్తిల్లియున్నది. ఏమి కావలయునో అన్నియు నీవు సిద్ధపఱుపుము. పరుగుల మీఁద పని కావలెను.'

విజ్ఞా—అక్కా! ఇదేమి? నీపని కార్యాచరణ పద్ధతులకు విరుద్ధమగుచున్నది?

ప్రేమ—భావ పరంపరలు దుర్వారవేగముతో ప్రస రించి మానవాత్మను ఉద్వేగము నందించునప్పుడు శాంతి గుణము పరుగెత్తి పాఱిపోవును. అప్పుడు విజ్ఞానశక్తిగా యుద్బోధము కూర్పవలెను.

అపారములైన ధనములతో ప్రేమవతియు, విజ్ఞాన శృంఖలయు కరుణదేవియు రాగి, అల్యూమినము, మాంగ నీసు—వీనితోఁ జేయఁబడిన, నూతన ధృతరాష్ట్రయంత్రమున బయలుదేరిరి. వీరభద్రుఁడు కొన్ని యుత్తరములతో లలితా మహాదేవిని, ఆర్య తీర్థులవారిని, ఆర్య విజయులను దర్శించుటకు పెద్దాపురమునకుఁ బంపఁబడెను. ఆర్య ద్వీప పరిపాలనమును దానికిఁజేరిన గనుల విమర్శనమును అమోఘశాసనికి అప్ప గింపఁబడెను. క్రొత్తగనులను శోధించుపని ప్రకృతిదేవిమీఁదఁ బడెను. రామభద్రుఁడు ఆకాశవిహారములు చేయుచు ఆర్య ద్వీపమును శత్రునావలు ఏవియు చొఱకుండ విచారించుకొను

పనిమీఁద నియమింపఁబడెను. ఆర్ష ద్వీపములోని ధనములను జలాంతర్గాములలోఁ గొనిపోయి ప్రయాణ ప్రారంభ దినములలో తాము శుద్ధముచేసి కవాటములు కీలించియుంచిన మృతాగ్ని పర్వతపు గదులలో రహస్యముగా నిక్షేపించి యుంచుటకు మహాలక్ష్మి నియమింపఁబడెను. ఎల్లరును తమ తమ కార్యములు నెఱవేర్చు చుండిరి.

సమస్త భూమండలమును చుట్టుతిరిగి ఒకనాఁడు ప్రేమవతి "విజ్ఞానశృంఖలా! ఆ దక్షిణ మహా సముద్రములోని లక్ష యోజనముల విస్తీర్ణముగల మహాఖండమే నాకు నచ్చినది."

విజ్ఞా—చలిముం చెత్తి కొనిపోవు నా ద్వీపమేమి ప్రయోజనము?

ప్రేమ—మానవబుద్ధికి అలవికాని పని లేదు.

విజ్ఞా—పైరుపంటలు లేవు. చెట్లుచేమలుకావు. త్రాఁగ నీళ్లు లేవు; మండు వేసవిలోఁగూడ భూమిమీఁద నూరడుఁగుల యెత్తు మంచుగడ్డలు. తిమి తిమింగలములు తప్ప ఏప్రాణియు నందు లేదు. చేరినను బ్రదుక లేదు. ఇట్టి జీవాంతకమగు భూమిలో?

ప్రేమ—ఈ పురాణములు చాలించు. ప్రకృతి సూత్రములు ఉపకరించునేని మానవబుద్ధికి అలవికానిది లేదు. సముద్ర గర్భమున పట్టణములు నిర్మించినబుద్ధి జీవవినాశము కావించు యముని దిశలో—ఆ దక్షిణ మహాసముద్ర ఖండమునఁ గూడ— ఏల మానవ నివాసములు కల్పింపలేదు?

విజ్ఞా—దక్షిణధ్రువమే భూమికి దక్షిణముననున్న భా

గము. ఈకష్టములచేతనే పెద్దలు దానిని యమలోకమని యందురు. మానవులను గొనిపోయి యమధర్మరాజు పట్ట ణము చేర్పుమని నీ వనుచున్నావు? ఎవ్వరును ఆమంచుకరుల్ల గుండ అక్కడకు చేరనేలేరు.

ప్రేమ—మఱియు మేలాయె. ఇతరులకు దుర్గమమగు టచే మనపాత్రులకు క్షేమము.

విజ్ఞాన—జనులక్కడకు చేరుటెట్లు?

ప్రేమ—వాయు విమానములమీఁదఁ గొనిపోవుదము.

విజ్ఞాన—శత్రువులు మాత్రము విమానములమీఁద రాలేరా?

ప్రేమ—అప్పుడు విమానములమీఁదనే మనము వారిని నిరోధింతము. చరిత్రలలో ఓడల యుద్ధములు చదివి తిమి; భూమిమీఁది యుద్ధములు చదివితిమి. నడి యాకాశము లోని మనుష్యులతోడి యుద్ధములను ఇంకను చరిత్రము లెఱుఁ గవు. మనమట్టి వారితో యుద్ధమునకు డీకొందము.

విజ్ఞా—ఇదియా నీ ప్రేమరాజ్యముయొక్క పర్యవ సానము?

ప్రేమ—ప్రేమము ఎప్పుడును అప్రేమమును నశింపఁ జేయును—వెలుఁగువలన చీఁకటి వలెనే! అజ్ఞాన తిమిరమును పాతమార్చుట ప్రేమజ్యోతి వికాసమువలననే పొసఁగును.

విజ్ఞా—నీవు విమానములతో జనులను గొనిపోయినను ఆచలిలో వారు గడ్డకట్టుకొని పోవుదురు. ఒకవేళ దానికి తట్టుకొన్నను ఆహారములేక నశింతురు.

ప్రేమ— నేను వారిని ఉన్నిపరుపులలో దూర్చియుంచు నను. విమానములు ప్రతిదినమును ఆహారమును కొనిపోవును

విజ్ఞా—చలితో వణఁకుచు పరుపులలోదూఱి బొమ్మలై పోయి వారేమి చేయఁగలరు ?

ప్రేమ—అజ్ఞాన పూరితములైన యితర మానవ నివాసములలో లోకాదర్శకమగు నూతన సంఘబీజములను విత్తి మొలపించి పెంచుటకు వీలులేదు. అనితరగమ్యమైన తావున నే భావిమానవ సంఘసస్యమునకు మనము బీజావాపనచేసి మొలపించి చీడపట్టకుండ పెంచవలెను :

విజ్ఞా—ఏఁబదిడిగ్రీల యుష్ణమున్నను మనకు చలియని యనిపించును. అట్టి సమయములో అంతకంటెను నూట యిరువది డిగ్రీలు తగ్గి దిగిపోయినచోట జీవాణువులు బ్రతుకునా ?

ప్రేమ—అవును. శీతకాలములో నచ్చటివేఁడిమి శతమానపు కొలతను —75°. కాని శీతల నిరోధకమైన పై పొఱతో తిమింగలము లట్టి నీట జీవించునప్పుడు అట్టి పై పొఱతోనే యంగీలుతొడిగి మనుష్యులును ఏల జీవింపలేరు ?

విజ్ఞా—మనుష్యులు జీవించినను ఆమంచుగడ్డలలోపల పంటలు పండవలదా ?

ప్రేమ—పంటలు పండనిచో విమానములు ఆహారమును తెచ్చునని నేను చెప్పలేదా ? జపానును ఇంగ్లాండును నెట్లు జీవించుచున్నవి ?

విజ్ఞా—నీపట్టుదలను విడువవా ?

ప్రేమ—అట్టి అన్యమానవ స్పర్శలేని శుద్ధ వాయువులను, దుష్టగుణ సంపర్కమునకు చోటీయని వివిక్త ప్రదేశ

మును నేను వదలఁజాలను. ఇది శత్రువులు చొఱరాని దుర్గ మువంటిది. ఉత్తమ మానవసంఘ నిర్మాణమున కిదియే యద్వితీయానుకూలములు కలది.

ఇంచుక యోచించి ప్రేమవతి యిట్లుపలికెను :—

" చెల్లీ! ఈ మాటవిను. భూమినిత్రవ్వకొని లోతుకు పోయిన కొలఁదిని ఉష్ణము హెచ్చును. అచ్చోట భూభాగమున మైలులోతున సొరంగముకల్పించి యందు మన యంత్రశాల లను విద్యాశాలలను నిర్మింతము. ఆరోగ్యరక్షణకు వలసిన సమస్త సదుపాయములను శాస్త్రీయముగా సమకూర్తము.

విజ్ఞా— మైలులోతున పురనిర్మాణమా ?

ప్రేమ—మైలు ఎత్తుండు నిండ్లు వందలకొలఁది యంత స్థులతో సామాన్య మానవులే నిర్మించుకొనఁజాలుచున్నప్పుడు ను, స్థలముచాలక భూగర్భమున బాటలుపన్ని పట్టణముల దిగు వను బండ్లు నడపింపఁజాలు చున్నప్పుడును, ప్రకృతి శాస్త్ర ములశక్తి కిది మాత్రము అసాధ్యమగునా?

విజ్ఞా—అట్లయినయెడల నట్టి పట్టణ నిర్మాణమునకు గల పరిశోధనల నిప్పుడే చేయుదము.

ప్రేమ—ప్రాచీనాంధ్ర దేశమున అమరావతిలో సుప్ర సిద్ధమైన విశ్వవిద్యాలయ ముండెడిది. త్రివిష్టప దేశపు విద్యా లయములు దానిఫక్కిని నిర్మింపఁ బడినవి. మనము ఈ విద్యా లయమునకు అమరావతీ విశ్వవిద్యాలయమని పేరుపెట్టుదము. దక్షిణ ధృవమునకు మఱల పోవుదము పద.

విజ్ఞా—తథాస్తు! సమస్త సన్మంగళాని భవంతు!

# పదునెనిమిదవ ప్రకరణము

విహంగయానము క్షేమముగా ఆర్ష ద్వీపమును చేరుకొన్నదని తెలియవచ్చెను. విహంగయానము సముద్రమధ్యమున నాపన్నులైన వారికి రక్షణము కూర్చుచుండెను. విహంగయానము సముద్రములకు కావలికాచి జలాంతర్గాముల సంగతి యొరులకుఁ దెలియకుండ నుండునట్లు కాపాడుచుండెను. విహంగయానము శత్రువులు ఆర్ష ద్వీపము వంకకు రాకుండ చూచుచుండెను. విహంగయానము భూప్రదేశములను శోధించి భావికార్య సౌధములకు సోపానములు నిర్మించుచుండెను. జగన్నాథుని సేవతో నారంభమై, కాశ్యాదిక్షేత్ర సంచారములవలన పవిత్రమై విహంగయానము జగదుద్ధారణకు నేఁడు పూను కొన్నది. నాగరక ఖండములందు క్రమక్రమముగా విహంగ వృత్తాంతము ఇంచుక తెలియవచ్చినది. అనేక చిత్ర విహంగ ములు శాంతమహాసముద్రమున సంచరించుచున్నవని నావి కులు నానా దేశములలో వెల్లడించుచుండిరి. విహంగ రక్షితులైన యాపన్నులు ఇవి యంత్రవిహంగములని తమతమ దేశములలో నద్భుతముగా వానినిఁగూర్చి ప్రకటింపసాగిరి.

క్రమక్రమముగా విహంగ వృత్తాంతము లోకవిదిత మయ్యెను. ఎవ్వరో పుణ్యాత్ము రాండ్రు కొందఱు యంత్ర విహంగములను నిర్మించి సముద్రములలో సహాయకరములగు పట్టులయందు లోకసేవ యొనర్చుచున్నారని జగమెల్లెడల

వార్తలు వ్యాపించెను. కొందఱు వారు దేవతాంగనలని తలంచిరి. మఱికొందఱు వారు మానవమాత్రులే యని నిశ్చయించిరి. తాను ప్రసాదించిన యసంపూర్ణ జ్ఞానకారణమున మానవుఁడు అజ్ఞానియై చరించి యాపదలు తెచ్చిపెట్టుకొను చుండుటచే, ఈశ్వరుఁడు వారి రక్షణకై యిట్లు ఎల్లయెడల భటవర్గమును నిర్మించి సంరక్షింపవలసి వచ్చుచున్నదని వేఱొక కొందఱు చమత్కరించిరి. విజ్ఞాన ఖనులైన ప్రకృతి శోధకులు ఈ విహంగ మర్మములను దెలిసికొని తమ దేశములను ఉన్నతదశకుఁ గొనిరా నుత్సహించిరి. పండితులు ఒండొరులకు జాబులు వ్రాసికొనిరి. ప్రసంగములు జరిపిరి. పత్రికలకు వ్రాసిరి. తుట్టతుదకు పదిమందియు నొక్కచోట సమావేశమై కార్యనిశ్చయము చేయుట మంచిదనుకొనిరి. పండిత మహాసభ యొక్కటి అమెరికాలోని ఛికాగో పట్టణమున జరిగెను. భూలోకములోని యెల్ల దేశములనుండియు సుప్రసిద్ధపండితు లీ సభకు విచ్చేసిరి. 27-10-1803 నాఁడు సభ ప్రారంభింపఁ బడినది. సభాభవనము ఆ పట్టణమునందలి యొక మేడలోని ముప్పదిమూఁడవ యంతస్థు. సభాభవనము ప్రేక్షకులతో క్రిక్కిరిసి యుండెను. ఆఱువేల మంది జనులు ఆ విశాల సభాభవనము నలంకరించిరి. సరిగా పదునొకండు గంటలకు సభ యారంభింపఁబడినది. పండితులు నాలుగు పెద్ద వలయాకారముగా నుండిన బల్లలచుట్టును కుర్చీలపైఁ గూరుచుండిరి. బల్లలమీఁద నానావిధములైన పరిపక్వ ఫలములును, ఱొట్టెలు, బిస్కోతులు మున్నగు నాహార పదార్థములును, తేనీటితో నిండిన పింగాణి పాత్ర

లును, కత్తులు, చెమిచాలు మున్నగు పరికరములును సమృద్ధిగానుండెను. అధ్యక్షుఁడిట్లు ప్రారంభోపన్యాసము నొసఁగెను :—

"మిత్రులారా! వ్యయప్రయాసలకోర్చి ప్రపంచములోని దిగ్దేశములనుండియు నిటకు అరుగుదెంచిన మీకు వందనము లాచరించుచున్నాను, అఖండ విద్యానిధులును, అద్భుత యంత్ర నిర్మాతలును, మానవోద్ధరణ దీక్షా పరతంత్రులునునగు మీకు స్వాగతము. అల్పజ్ఞుఁడనైన నేని యధ్యక్షపదవికి అనర్హుఁడనయ్యెను, కార్య విచారణము మీయందే లీనమై యుండుటచే నామమాత్రముగా నేనీ స్థానమున నుండఁజాలిన వాఁడను. ప్రకృతమున మహత్తరమైన సమస్య యొక్కటి మనల నెదుర్కొన్నది. తర్కాదివిద్యలకు సంబంధించిన సమస్యలను పరిశీలించి బుద్ధి చతురతమెఱయ పూర్వపక్ష సిద్ధాంతరూపముగా విషయ గ్రహణమునకు దారిచూపుచు శాస్త్రములు రచించిన భరతవర్షపు పండితులు ఇట్టి యుక్తి చదువులతోనే విద్యార్థుల బుద్ధికి వాఁడిమి గలిగించి మెఱయించుచున్నారు. అట్టి సంప్రదాయములవలన కుశాగ్రబుద్ధులైన భరతవర్షీయులు నేఁడు ప్రకృతి శాస్త్రములను తర్కించుచు నూతన యంత్ర నిర్మాతలగుటచే నద్భుతములైన వాయు విమానములును, జలాంతర్గాములును మన సముద్రములన్నింటిని చుట్టఁబెట్టుచున్నవి. తీఁగలు లేకయే దూర శ్రవణమునుకూర్చు విద్య యద్వితీయమైనది. అందు ప్రకృతి నిలయమను పెద్దాపురములోని యొక సంస్థ భరతఖండమునకు— వేయేల? ఈ ప్రపంచమున కంతకును—

తిలకాయమానమై యున్నది. వారి నీసభకు ఆహ్వానించితిమి గాని వయోవృద్ధులగు ప్రకృతి నిలయాధ్యక్షులీ దూర ప్రయాణమునకు సాహసింపలేక పోయిరి.

"వాయువిమానములను గూర్చినది నేటి ప్రధాన విషయము. ఈ విశాల సభాభవనమునందు చేరిన పండితేతరులైన ప్రేక్షకులకొఱకై కొన్ని సామాన్య విషయములను దెలుపనిండు. నీటిమీఁద పడవలు తేలియాడుచున్నవి. జల సముద్రములు మన భూమిచుట్టును ఉన్నవి. అట్లే వాయు సముద్రము భూమ్యుపరిభాగమునంతను ఆవరించినది. చేఁపలు జల సముద్రములో జీవించు జంతువులు. మనుష్యుఁడు వాయు సముద్రములో జీవించు జంతువు. నీటిలో పడవలనెక్కి ఎట్లు పోఁగలమో అట్లే వాయుసముద్రములోఁ గూడ తేలి నడవఁ గల యోడలను మనము నిర్మింపలేమా యన్నదియే నేటి విషయము. భారతవర్షీయులు ఇట్టి యోడలను నిర్మించి లోకమును ఆకర్షించినారు. వాయువులోఁ దిరుగు ఓడలకు విమానములని వారు పేరుపెట్టినారు. నాకుఁజూడ విమాన నిర్మాణము అంత దుర్ఘటమైనదికాదు. వేయి ఘనపుడుటగులవైశాల్యముగల నీరు 1,000,000 ఔన్సులు తూఁగు ననుకొనుఁడు. వేయి ఘనపుటడుగుల వైశాల్యముగల యొక యోడ 500,000 ఔన్సులు తూఁగుననుకొనుఁడు. సమాన వైశాల్యముగల యీ రెంటిలో ఓడకంటె నీరు ఎక్కువ బరువు. కాఁబట్టి అట్టిస్థితిలో ఓడ తేలును. మఱియు నీ యోడలో 499,990 ఔన్సుల బరువు వేసినను గూడ నది మునుఁగదు.

"అట్లుకాక నీటిబరువు 1,000,000 ఔన్సులును, ఓడ బరువు 1.000,001 ఔన్సులును అగునేని ఓడ మునుఁగును. సమానపు కొలతగల నీటికంటె తక్కువ బరువుగా నున్నంత సేఁపును ఒకవస్తువు నీటతేలును. హెచ్చినచో మునుఁగును.

"అట్లే వేయిఘనపుటడుగుల వైశాల్యముగలవాయువు 1200 ఔన్సులు తూఁగును. వేయి ఘనపుటడుగుల వైశాల్యము గలిగియు నొక విమానము తూనికకు 1000 ఔన్సులే ఆగునేని అది గాలిలో తేలుచు ఎగిరిపోఁగలదు. సమాన వైశాల్యముగల గాలికంటె తక్కువగా తూఁగగల విమానము సాధ్యమగునేని మనము విమానయానము చేయ వచ్చును,

"సామాన్యపు గాలికంటె వేఁడిగాలి తేలిక. కాఁబట్టి కాగిదపు బుట్టలఁలో దీపముపెట్టి వదలినప్పుడు దీపపు వేఁడిమికి లోనిగాలి తేలికయైపోవును. అప్పుడాబుట్ట పైకెగురును. ఇదియే విమానపు బుట్టలలోని కిటుకు.

"ఈ పద్ధతి ననుసరించి 5–6–1783 లో మాంటు గోల్ఫియిరి యనునాతఁడు ఒక బుట్టను ఉన్నిగుడ్డపై కాగిదము పూసి సిద్ధముచేసెను. దానిని గాలికంటె తేలికయైన గడ్డిపొగ తోనింపి ఆకసమునకు ఎగురవైచెను. అది యెగిరెను. దానిని చూచి రాబర్టు అను నొకఁడు ఇట్లు యోచించెను ? "చల్లగాలికంటె వేఁడిగాలి తేలికయైనది ; వేఁడిగాలికంటె గడ్డిపొగ తేలికయైనది.అట్లే ప్రపంచములోని వాయువు లన్నింటిలో హైడ్రోజన్ అనఁబడు జలవాయువు తేలికయైనది. కాఁబట్టి ఈజలవాయువుతో బుట్టను నింపినచో అదియు ఎగురఁగలదు."

"ఇట్లు యోచించి 29-8-1783 లో రాబర్టు జల వాయువుతో నింపిన యొక బుట్టను ఆకసమునకు వదలెను.

"ఒక మనుష్యుఁడు నూటయేఁబది పౌనుల తూనికఁ గలిగియుండుననుకొనుఁడు. మూఁడు వేల ఘనపుటడుగుల వైశాల్యముగల జలవాయువు పదునైదుపౌనుల తూఁగును. కాఁబట్టి మూఁడువేల ఘనపుటడుగుల వైశాల్యముగల యొక బుట్టను జలవాయువుతోనింపి, పైన నొక మనుష్యుని కూరుచుండఁ బెట్టినయెడల వీని మొత్తపుబరువు (150 + 15)—నూట యరువదియైదు పౌనులు అగును. అట్లే సమాన పరిమాణము గల గాలి అనఁగా 3,600 ఘనపుటడుగుల పరిమాణము గల గాలి మూఁడువేల ఔన్సులు—(అనఁగా దాదాపు 225 పౌనులు) తూఁగును. కాఁబట్టి గాలికంటె బుట్టయు బుట్టలోని మనుష్యుఁడును „ చేరి తేలికై తేలిపోవుదురు. ఇట్లు యోచించి 1783 అక్టోబరు నెలలో రోజియర్ అను వాఁడు అట్టిబుట్టలో ఆకాశగమనము చేసెను. దీనివలన కొంత సాహసము పొడమినది. 1784 లో 52 అడుగుల పొడుగును 32 అడుగుల వెడలుపును గల విమానమొకటి నిర్మింపఁ బడినది. ఇది తేలుటకు జలవాయువు ఉపయోగింపఁ బడినది.

"క్రమ క్రమముగా నిట్టి విమానములు ఫ్రాంసు దేశీయులనాకర్షించెను. కాని జలవాయువునకు దీపము తగిలిన యెడల నది భగ్గుమని మండిపోవును. తుట్టతుదకు ఈ విమాన నిర్మాత అట్టి యగ్ని ప్రమాదముచే మరణించెను. గాయిలేయను నాతఁడును, మ్యాసక్ అనునాతఁడును, లెన్నాక్సుఅను నాతఁడును నిట్టివిమాన నిర్మాణమునకు తరువాత పూనుకొన్న

వారు. అందు గాయిలేగారి విమానములలో నొకటి 432 అడుగుల పొడుగుగలది. సముద్రములో నీదు ప్రధానజంతువు చేఁప. వాయుసముద్రము నందును చేఁప యాకారమే ఈఁతకు అనుకూలించునని ఎల్లరును తమ విమానములను మత్స్యా కారమున నిర్మించిరి. కాని నేఁటి భరతవర్షీయుల విమాన ములు పక్షి యాకారముగలవి. మన విమానములు ఒకటి రెండు గంటలకంటె నెక్కుడుకాలము పనిచేయలేవు. భరత వర్షీయుల విమానములు దినములు—షణ్మములు—మాస ములు—సంవత్సరములు, కడచినను చెక్కు చెదరుటలేదు. వారిని ఈ విమానపద్ధతి నడుగఁగా మాకుఁ దెలియదను చున్నారు. ఎవ్వతెయో యొక బాలిక దేశాంతరము పోయిన దఁట! ఈ మర్మములు ఆమెకుమాత్రమే తెలియునఁట! నిజ మునకు విమానములు శాంతసముద్రములో కానవచ్చు చున్నవి. ఒక విమానమును పడఁగొట్టి యంత్రశోధన చేయ వలెనని బహు ప్రయత్నములు జరిగెనుగాని డెబ్బదియైదు మైళ్ల దూరమేగుగుండ్లు ప్రయోగించు ఫిరంగులకుఁ గూడ నా విమానములు మాఱు మసలినవి. వారు ఆ మర్మము మనకు చెప్పరు, దొరకరు; మనప్రయత్నము లన్నియు బూడిదలోబోసిన పన్నీరువలె వ్యర్థములైనవి. కానిండు! మానవబుద్ధికి అసాధ్యమైన దేదియులేదు. శాస్త్ర నిపుణు లైన మీ రెల్లరును సునిశితమైన మీబుద్ధితో భరతవర్షీయుల తాతవంటి మహా యంత్రమును గల్పింపఁగలరు. ఈ విషయ మిప్పుడీ పండిత ప్రకాండులచే చర్చింపఁ బడుఁగాక."

పండితుఁడు. ౧—జలవాయువు అగ్ని ప్రమాదములకు

కారణము. హెలియము అను వాయువు జలవాయువుకంటె నాలుగింతలు బరువుకలది. కాని నిప్పులలో పెట్టినను దీనికి ప్రమాదమురాదు. దీనిని ఉపయోగింతము.

పండితుఁడు. ౨—హెలియము సూర్య బింబములో నున్నదిగాని భూమండలమున లేదు. ఉన్నను దానిని తీయుటకు వ్యయము దుర్భరము. కాఁబట్టి జలవాయువునే యుపయోగింపక తప్పదు.

పండితుఁడు. ౩—భారతీయ విమానములలో వాయువే వాడఁబడుటలేదు. మనమును అట్లే చేయరాదా?

పండితుఁడు. ౪—వాయు విరహితమైన బోలు పాత్రము లోహనిర్మితముగా నొనర్చినచో సరిపోదా?

పండితుఁడు. ౧—లోహపాత్రమునకు బరువు హెచ్చు.

పండితుఁడు. ౪—అల్యూమినియముతో నిర్మింతము.

పండితుఁడు. ౧—అప్పటికిని బరువే. కాదని మిక్కిలి పలుచగా చేసినయెడల నది పైగాలిబరువుచే తునిఁగిపోవును.

పండితుఁడు. ౨—అవును. అంగుళమునకు పదునైదు పౌనుల బరువుతో స్థలవాయువు అట్టిపాత్రమును అణఁచివేయును. విసరుతోడి నడకకును, గాలివానల వలని ప్రళయముల కును అది అసలే తాళదు.

అధ్యక్షుఁడు—కాఁబట్టి జలవాయువే మీకందఱకును సమ్మతము.

అందఱును—ఇప్పటికి అంతే.

అధ్య—చేఁప యాకారముగా మన విమానములు ఉన్నవి. పక్షియాకారముగా భరతవర్షీయుల విమానమున్నది.

పండితుఁడు. ౫—సముద్రములందు తిరుగుటకు చేఁపకు ఈశ్వరుఁడు చేఁప యాకారమునే ఇచ్చెను. వాయుసముద్రమును సముద్రమేకావున చేఁపవంటి యాకారమే శ్రేష్ఠతరము.

పండితుఁడు. ౬—జలసముద్రములో నీఁదుటకు చేఁపలను, వాయుసముద్రములో నీఁదుటకు పక్షులను ఈశ్వరుఁడే సృజించెను. కాఁబట్టి భరతవర్షీయుల పక్షియాకారమే ఈశ్వరేచ్ఛకుఁ దగినది.

పండితుఁడు. ౭—ఇచ్చట వేదాంతములతో పనిలేదు. సముద్రములందు ఓడలను చేఁపవలె నడపుటలో మనకు అనుభవముఉన్నది. పక్షులను నడపించు అనుభవము మనకులేదు. మనకుఁగల జ్ఞానమునుబట్టి కార్యనిశ్చయము చేయవలెను గాని ఊహలమీఁద సౌధములు నిర్మింపరాదు.

ఎల్లరును—మత్స్యాకారమే యుత్తమైనది.

పండితుఁడు. ౧—జలవాయువును వాయుదుర్గమముగా సంచులకెక్కించి విమానమునకు బంధింతము. అప్పుడా సంచులు ఎగిరి క్రింది విమానమునుగూడ ఎత్తుకొని పోవును.

పండితుఁడు. ౨—అట్టిసంచులు సాగి పెద్దవగుటకు తగియుండవలెను. పైకెగిరిన కొలఁదిని వాయుభారము తగ్గును. ఆభారము తగ్గినకొలఁదిని సంచులలోని జలవాయువు ఉబికి యుబికి, సంచిని పగిలిపోవునట్లు చేయును.

పండితుఁడు. 3—1,000 ఘనపుటడుగుల గాలి

| | |
|---|---|
| భూమిమట్టమున | 75 పౌనులు తూఁగును. |
| 10,000 అడుగుల యెత్తున | 55 ,, |

20,000 అడుగుల యెత్తున 40 పౌనులు తూగును
30,000 ,, 28 ,,

పై కెగిరినకొలఁదిని గాలికి బరువుతక్కువ. పై నొక్కుడు తగ్గిన కొలఁదిని సంచులు ఉబుకును. కాఁబట్టి సంచుల కొక ద్వారము పెట్టి యందుండి క్రమక్రమముగా జలవాయువువదలి వేయవలెను. లేదా మడచిన సంచులు సేకరించి పెట్టుకొని ఉబికినకొలఁది క్రొత్తసంచులలోని కాజలవాయువును నింపవలెను. లేదా బిగువు హెచ్చినప్పుడు తెఱచుకొని, బిగువు సడలునప్పుడు మూసికొనిపోవు ద్వారములను సంచులలో సమర్చిన యెడల సంచులు ఉబికి పేలిపోవు.

పండితుఁడు. ౮—అవును శీతమువలన సర్వవాయువులు క్రుంగిపోవును; వేఁడిమి హెచ్చినప్పుడు ఉబుకును. ప్రయాణములలో ఇట్టి శీతోష్ణ భేదములవలనఁ గలుగు మార్పులకును ఈపద్ధతి పనికివచ్చును.

పండితుఁడు. ౯—సంచులచుట్టును సన్నని తీగెను వలవలెచుట్టి ఒకచిక్కమువలె చేసినయెడల సంచులకు సంరక్షణ కలుగును. ఇట్టి చిక్కమునకు ఒకబుట్టను వ్రేలాడఁగట్టిన యెడల మనుష్యులును సామానులును ఇట్టి యుబుకుటవలని ప్రమాదములేక ఆ బుట్టలో సుఖముగా ప్రయాణము చేయవచ్చును.

అధ్య—భూమికి ఎంతయెత్తున ప్రయాణము చేయవలెను ?

పండితుఁడు. ౧—అది యంత్రపు బరువును బట్టియుండును. యంత్రము పదివేలయడుగుల విస్తీర్ణము కలదియని

తలంపుఁడు. దానిబరువు నూరుటన్నులని యనుకొనుఁడు. ఎత్తు ఎక్కిన కొలఁదిని గాలికి బరువుతగ్గును. ఏయెత్తున పదివేల యడుగుల గాలి నూరుటన్నులబరువు తూఁగునో అంతయెత్తు దాఁక యంత్రము ఎగిరిపోయి యచ్చట నిలుచును. అందుండి తెడ్లు, తెఱచాపలు, లేదా మరలుపెట్టి యంత్రమును వలసిన దిక్కుకు నడపించుకోవచ్చును.

అధ్య—విమానమును కోరుకొన్నంతయెత్తుకు ఆకసమున ఎక్కించుట యెట్లు?

పండి. ౧—నాకొకటి తోఁచుచున్నది. ఇంత యిసుకనుగూడ కొనిపోవుఁడు. ఎక్కినంతయెత్తు యెక్కిన తరువాత ఇంకను పైకెక్కవలయునేని ఆ యిసుకను నేలకు త్రోసి వేయుఁడు. అప్పుడు విమానము తేలికయై పైకెక్కును. అట్లే సంచులలోని జలవాయువును కొంత వదలివేసినయెడల దానికి తగినట్లుగా విమానము క్రిందికి దిగును.

అధ్య—విమానము ఎట్టి యాకారమును కలిగియుండవలెను?

పండితులతీర్పు—గాలిని త్రోసికొని విమానముపోవును. కాఁబట్టి విమానము ఎంత సన్నముగానుండునో వాయుఘర్షణ అంత తక్కువగా నుండును. చేఁప యాకారము సన్నమై పొడుగుగా నుండును. అట్లే యంత్రముగూడ సన్నమై పొడుగుగా నున్న యెడల ఘర్షణ తక్కువగును. తిత్తులను జలవాయువుతో నింపినప్పుడవి గుండ్రము తేలును. కాఁబట్టి విమానము చేఁప యాకారమునుదాల్చి గుండ్రము తేఱియుండవలెను.

అధ్య—నాకొక్కటి తోఁచుచున్నది. ఒక్కటే పొడుగు పాటి జలవాయువుసంచి; దానిచుట్టును తీగెలవల; ఆ వలకు వ్రేలాడఁగట్టఁబడి సామానుల తొట్టె.

పండితులతీర్పు—అవును. ఒక్కటే జలవాయువుసంచి ఇసుక అక్కఱలేదు. చేఁపముక్కులో ఒక పెద్ద స్థలవాయువు సంచి; చేఁపతోఁకలోఁగూడ నట్టి స్థలవాయువులే కల మఱి యొకసంచి. బరువు కావలసినప్పుడు ఈ సంచులను గాలితో నింపుఁడు; లేనిచో ఇవి "ఖాళీ".

అధ్య—అట్లే తీర్మానింతము; మఱియు చేఁపముక్కులోని సంచినుండి గాలిని వెడలించినచో ముక్కు తేలికగును. అప్పుడు విమానము పైకిలేచును; అట్లే తోఁకలోని సంచి నుండి గాలిని వెడలించినచోఁ దోఁక తేలికగును. ఈ రీతిగా మనము పైకెక్కుట, క్రిందికి మఱలుట ఇట్టి వ్యాపారములు చేయరాదా?

పండితులతీర్పు—అవును. మఱియు దారి పొడుగునను మనకు స్థలవాయువు అపారముగా దొరకును. యంత్ర సహాయమున ఈ రెండు సంచులను వలసినప్పుడెల్ల దట్టించి స్థలవాయువుతో నింపుకో వచ్చును. జలవాయువునకు మాత్రము తగినంత కట్టుదిట్టములు పోసఁగును.

అధ్య—ఈ లెక్కను నేనొక విమానమునకు లెక్కలు చెప్పుదును. జలవాయువు 300,000 ఘనపుటడుగులు అగునేని దీనికి తిత్తికి 260 అడుగులపొడుగు; 60 అడుగుల వ్యాసము కావలెను. ఇట్టి యంత్రములో మరలుపెట్టి గంటకు

70 మైళ్లు నడపింపవచ్చును. ఇవిగాక 11 టన్నుల బరువు గూడ ఇది మోసికొని పోఁగలదు.

పండితులతీర్పు—అవును. ఇంతకును భరతవర్షీయుల నూరడుగుల విమానము పదివేల యేనుఁగుల బలముతో పని చేయునఁట! మనతిత్తులు మూఁడేసివాళ్లకు మరమ్మతు చేయ వలెను. కాని వారి యంత్రములు ఏండ్ల తరబడిగా చెక్కు చెదరక అద్భుతకార్యములు చేయుచున్నవి.

అధ్య—అది వారియదృష్టము; మన దురదృష్టము. వారిబుద్ధి అట్లు ఫలించుచున్నది. మన చదువులకు మనకు ఇంతకంటె తోఁచుటలేదు. నేఁటికి సభచాలించి రేఁపు పదు నొకండు గంటలకు మఱల సమావేశ మగుదము.

# పందొమ్మిదవ ప్రకరణము.

ఇప్పుడు ప్రేమవతి మునుపటి ప్రేమవతిగాదు. ఇప్పు డామె శాంత మహా సముద్రములోని పదిదీవులకు చక్రవర్తిని. ఆఱువేలమైళ్ల విస్తీర్ణముగల భూభాగమును సముద్ర గర్భము లన్నియును నిప్పుడామె యేలుబడిచే సర్వసంపదలను సమకూ ర్చుచున్నవి. అందు ఆర్ష ద్వీపము ఆమెకు అత్యంత ప్రీతిపాత్ర ము. తనయొద్ద రెండుసంవత్సరములు పనిచేసిన వారిలో తనకు నచ్చిన యుత్తమ గుణాన్వితులు మాత్రమే ఈ ద్వీపములలో నివసింప నర్హులు. భోగభాగ్యములతోఁ దులదూఁగుచు నీమె ప్రజలు ఈమెను దేవతాస్వరూపిణిగా భావింతురు. వేల

కొలఁది మోడలతోను, అసంఖ్యాకములైన యంత్రశాలల తోను, ఒప్పారుచు నీమెరాజ్యము ఆరోగ్యమునకును సత్ప్రి మమునకును నిదానమై సర్వ సంపత్సమృద్ధమై శత్రువులకు దురాసదమై యలరారుచుండెను. స్వనాశ సర్వనాశసూత్ర ములకు లోనుగాకుండ నీమె పరోపకారపారీణయై లోక సముద్ధరణమునకుఁ బూనుకొని ప్రేమ కిరీటమును ధరించి నిజ ముగా సార్థకనామ యయ్యెను.—ఛికాగో పట్టణమున సభ జరిగిన మఱునాఁడు ప్రేమవతియు విజ్ఞానశృంఖలయు నిట్లు సంభాషించుకొనిరి.

"ప్రేమవతీ! ప్రేమవతీ! దూరశ్రవణ యంత్రముతో ఛికాగో పట్టణములోని సభావిషయముల నన్నింటిని వింటివి గదా?"

ప్రేమ—విన్నాను! • విజ్ఞానశృంఖలా! సర్వమును విన్నాను! సత్వరజస్తమో గుణములలో నింకను తమోగుణ మే వారిని ఆవరించియున్నది. తిమింగిలముల క్రొవ్వు వర్తక మునకు పనికివచ్చునని తెలిసికొని వీరే ఆవేఁట కారంభించిరి. నేఁడు ప్రపంచమునుండి తిమింగిలముల జాతి అస్తమింప నున్నది. ఏనుఁగు దంతముల విలువను వారు తెలిసికొనిరి. అనేక దేశములలో నిప్పుడు ఏనుఁగులే లేవు. అగ్నిపక్షి యీఁకెలను ధరించుట అందమని యెంచిరి; నేఁడు ఆపక్షులును తగ్గిపోవుచున్నవి. మన విమానములను పడఁగొట్టి శోధింపఁ దలఁచిరి. కాని యింతవఱకును ఈశ్వరుఁడు మనపాలనుండి రక్షించుచున్నాఁడు. వారినే వ్రేలుపెట్టి చూప నక్కఱలేదు. ఇప్పుడు లోకమంతయు తమోంధకారము చేతనే ఆవరింపఁ

బడియున్నది. సర్వనాశనమును గుర్తింపనేరని చదువులు నేఁటి నాగరకతకు లక్షణములయినవి.

విజ్ఞా—సృష్టియందలి జ్ఞానమును మానవాధీనము చేయ యత్నించుట మన జీవితాదర్శము. ఆపని జరుగుచునే యుండెను. ఇఁక విచార మెందులకు?

ప్రేమ—ప్రేమమను గుణము మానవ జీవితాదర్శము కావలెను. ప్రేమ లేనియెడల నా దేశము కొఱకై నీ దేశమును వినాశము చేయుటకు నేను జంకను. సర్వమానవ సమత్వము నకు పురికొల్పు ప్రేమరాజ్యము వెలయుదాఁక మన యాశయము నెఱవేఱదు.

విజ్ఞా—నూరులకొలఁది ఓడలు నిర్మించితివి. వేలకొలఁది పనివాండ్రు నీ గనులలో పనిచేయుచున్నారు. తలఁచినయెడల నొక్క క్షణములో భూలోకమునంతను భస్మ పటలము గావింపఁజాలు నమోఘ శస్త్రములతో నీ రాజ్యములను నీవు సంరక్షించుకొను చుంటివి. నీకు శత్రుభయము లేదు. నీ కోర్కెలు ఫలించుచున్నవి. ఈ విచార మెందులకు?

ప్రేమ—కాని ప్రేమమను రత్నము ప్రతి మానవ హృదయములోను ఇంకను ప్రజ్వలించు చుండలేదు.

విజ్ఞా—నీ పోషణమువలన ఆర్య ప్రచారకులు నానా దేశములందును వెలసి పేదసాదుల నాదుకొనుచు, ఆపన్నులను గాపాడుచు ప్రేమ బీజములను వెలయింపఁగలరు?

ప్రేమ—ఇల్లలుకఁగానే పండుగ కాలేదు. ఇంతవఱకు ప్రయత్నములైన ఆరంభము కాలేదు.

విజ్ఞా—యత్నమెట్టిదో ఫలమును దాని కనుగుణమైన దే.

ప్రేమ—సాహసియగు తత్వజ్ఞునికి ప్రకృతిదేవత బంటగునని మనము నమ్మితిమి. కార్యాచరణ విధానములను మనమిప్పుడు నిర్ణయింతము.

విజ్ఞా—నీవు మహా రాజ్ఞివయితివి. శివాజీ చక్రవర్తి వలెను బుక్కరాయలవలెను అఖండరాజ్య సంపదల నందితివి. సాటి చక్రవర్తులతో నీవు సమానస్థానము వహింపవలెను. నీ పేరును మన రాజ్యముపేరును ఆ చంద్రార్కస్థాయి గావలెను. ఈపనికి కార్యాచరణ విధాన మిప్పుడు నిర్ణయింప వలసి యున్నది. అందఱు దేశపాలకులలో నీవును నొక యగ్రగణ్యవని లోకమున ప్రకటనము గావలెను.

ప్రేమ—నేను నీకేమి పగయొనర్చినానని యిట్లు భాషించెదవు? సన్యాసినినై జగదుద్ధరణకు ఈ తనువును సమర్పించుకొన్న ఈ దీనురాలికి చక్రవర్తులెందుకు? సమానస్థాన మెందుకు? చరిత్రాత్మక మెందులకు? ఇట్టి మాటలాడి నన్నేల దుఃఖపెట్టెదవు?

విజ్ఞా—నామాటల యర్థమును నీవు గ్రహింపలేదు, చక్రవర్తుల సానుభూతిలేక పరరాజ్యములలో మన సంస్థలు వెలయఁగలవా?

ప్రేమ—మనము నిఱుపేదలమయిన ఈశ్వరుని సేవకురాండ్రము. తుచ్ఛులమైన మనమేమిటి? రాజాధిరాజులకు రాయబారము లంపుట యేమిటి? లలితామహాదేవి తనపేరనే సమస్త చక్రవర్తులకు రాయబారము లంపును.

విజ్ఞా—అనఁగా మన ధనములను మనము చెప్పిన రీతిగా లలితామహాదేవి వెచ్చింపవలె నన్నమాట.

ప్రేమ—మన ధన మేమిటి? పుట్టినప్పుడు మనము ధనము తెచ్చుకొని పుట్టలేదు. పోవునప్పుడు పట్టుకొని పోఁబోము. తన ధనాగారములలోని తఱుగని ధనములను ఈశ్వరుఁడు మానవసేవకై మన కప్పగించినాఁడు. మానవ హృదయముల లోని ఈశ్వరవ్యక్తిని వెలువఱుచు కొఱకై అది మనచేత ఉప యోగింపఁబడవలసియున్నది. దానికి మన తల్లియైన మహా రాణి అధినాయిక. నడుమవచ్చిన మనకు ఊరేమి పేరేమి?

విజ్ఞా—నీ స్వార్థత్యాగము అనితర దుర్లభమైనది.

ప్రేమ—ఆర్య సమాజమునకు శ్రీ లలితామహాదేవి గారు ఉపాధ్యక్ష. మనకు లభ్యమగునెల్ల ధనములను సమా జముకొఱకు వెచ్చించుట మన సంకల్పము. పెద్దాపురపు జగపతుల రాజ్యము లోక విశ్రుతము. ఉపాధ్యక్షురాలు సమా జము పేర మనము నిర్ణయించు ధనములను మనము నిర్దే శించురీతిని రాయబారముల కొఱకును సంస్థలను దేశములలో స్థాపించుకొఱకును వినియోగించును.

విజ్ఞా—కార్యాచరణ విధానమునకు ప్రథమ సోపా నము చక్రవర్తుల సానుభూతి. వారి అనుమతిలేకుండ వారి రాజ్యములలో ప్రవేశించినను అందు గొప్పసంస్థలు స్థాపించి నను ప్రమాదములు పుట్టవచ్చును.

ప్రేమ—అవును. చక్రవర్తుల సానుభూతిలేక సత్సం స్థలు ఏ దేశమునందును వెలయలేవు. ఒకవేళ వెలసినను విజృంభింపలేవు. అందువలననే లలితా మహాదేవి సమస్త రాజన్యులతోను రాయబారములు నెఱపి అమూల్యములైన

కానుకలు పంపుచు కార్యములు సానుకూలము చేయవలెను. మహారాజ్ఞి యగుటచే నామెకు అట్టి అంతస్థుగలదు.

విజ్ఞా—మనరాయబారులు అమోఘరాజనీతి ధురంధరులై యుండవలెను. దేశమెఱిఁగి కాలమెఱిఁగి చతురత నెఱయ నవకాశములు సృష్టించుకొని చక్రవర్తుల సానుభూతిని మన యాశయములకుఁ గూర్పఁగలవారే రాయబారులు కావలెను. అట్టివారు దొరకుట దుర్లభము.

ప్రేమ—అట్టిపేళ్లు ఒకటిరెండు నాకు స్ఫురించుచున్నవి.

విజ్ఞా—వారు ప్రకృతిశాస్త్ర విశారదులేనా?

ప్రేమ—విశారదులన్నది చప్పనిమాట. వారు రూపమును దాల్చిన ప్రకృతి శాస్త్రములేయని చెప్పవచ్చును.

విజ్ఞా—ప్రకృతి శాస్త్రములే సర్వ విషయములందును మానవ జీవితమునకు పరమావధి యని వారు అంగీకరింతురా?

ప్రేమ—అంగీకారము మాత్రమేకాదు. వారు అఖండమైన తమ సంపదనంతను ఆర్ష మత ప్రచారముకొఱకు ధారవోసినవారు. మనవలెనే ఆర్ష యోగీంద్రుని యాంతరంగిక కోటికిఁ జేరినవారు. నీ విజ్ఞానము ఎంతవఱకు పోవునో చూతము వారెవ్వరో చెప్పుకో?

విజ్ఞా—అట్టివారు చాల మందియున్నారు. అట్టివారు మనగురువులైన విజ్ఞానచక్షు యోగీంద్రు లొక్కరు. కాని మహనీయులైన మన గురువులు ఇట్టి రాయబారములకు అరుగ

వలసిన వారుగారు. ఇంకొకటి రెండు ప్రశ్నలడుగుదును. దేశ పరిస్థితులును కాల పరిస్థితులుగూడ కార్యసాఫల్యమునకు నిమిత్త కారణములు. నీ చెప్పినవారికి దేశజ్ఞానమును కాల జ్ఞానమును నేమైన కలదా ?

ప్రేమ—వారు మనవలెనే విహంగారూఢులై అనేక పర్యాయములు లోకసంచారములు గావించి యనుభవములు గడించినవారు. భూలోకమునకు పటములుఎత్తి సేకరించిన వారు ; ప్రజల హృదయములందు ప్రకృతి విద్యారహస్యముల యెడ నాశ్చర్యమును బురికొల్పి మనము చేయఁదలఁచిన పనికి ఇదివఱకే భూలోకమును కొంతవఱకు సంసిద్ధము చేసినవారు. ఈ ఛికాగోసభ వీరి సంచారఫలమే కదా ? నాఁటి టైమ్సు పత్రిక వ్యాసములును తదనంతర చరిత్రమును వీరి విహంగ యాన ఫలితములే కదా ?

విజ్ఞా—అక్కా ! ఇప్పుడు తెలిసినది ! వారు వీర భద్రుఁడును రామభద్రుఁడును. ఇందువలననే నీవు మహారాజ్ఞి వయితివి. వలదని త్రోసివేసి కొన్నను నీ బుద్ధిసంపదకు వలచి ఎన్నఁడో ఒకనాఁడు మహారాజ్ఞీత్వము నిన్నువచ్చి చుట్టుకొనక మానదు. ఎంత యమోఘముగా యోచించి తివి ! వీరరామభద్రులకంటె నుత్తములైన రాయబారులు మనకు నభూతో నభవిష్యతి. వీరరామభద్రులకును ఇంత కంటె సంతోషకరమైన పని మఱియొకటి యుండదు.

ప్రేమ—వీరు తమకున్న లక్షల నన్నింటిని వెచ్చఁ బెట్టిరి ; కాని క్రొత్తధనములు కూర్చుకొనుటకుఁగాదు. దశ దిశాసంచారములు కావించిరి ; కాని వినోదము కొఱకుఁ

గాదు. భూలోక పటములను సంపూర్ణ వివరములతో నెల యించిరి ; కాని దిగ్విజయము కొఱకుఁగాదు.

విజ్ఞా—అట్లయ్యును ఇప్పుడు వారి యనుభవమే మన యమూల్య ధనము ; వారి లోకరక్షాపరత్వమే లోకములకు నిజమైన వినోదము. వారు వేసిన సుజ్ఞాన బీజావాపనమే ప్రకృతి శాస్త్రముల దిగ్విజయ ఫలసిద్ధికి మూలకందము.

ప్రేమ—ప్రకృతి సత్యములను గూర్చి జనులకు ఉద్బోధనము కావించు పనిని ఈశ్వరుఁడు వారికిని మనకును పంచిపెట్టెను. ధనాశా ప్రేరితులమై రహస్యశోధనలు చేయుచు సముద్రగర్భమున మనము అణఁగి పడియున్నప్పుడు ఆర్ష యోగీంద్రుని ప్రేరణచే వీరు విహంగముల నెక్కి విశ్వ సంచారులై ప్రపంచము నంతను అద్భుతాంబుధి నోలలాడించిరి. ప్రజలలో నుత్సాహముతో ప్రకృతి విద్యాబీజములను నాటుటకు సర్వమానవ హృదయ క్షేత్రములను సంసిద్ధముగావించిరి.

విజ్ఞా—మనతో సమానముగా నిట్టి బాధ్యతను వహించిన యీ వీరభటులు నీయడుగులకు మడుగు లొత్తుచు నీయాజ్ఞలను శిరసావహింపఁగలరు.

ప్రేమ—అఖండ విద్యాసంపన్నులైన యీ చతురమతులు మహారాజుల సానుభూతిని మన కార్యములకు తప్పక కూర్తురు. మఱియును ప్రతి రాష్ట్రములోనియు ఊరూరను పల్లెపల్లెను శాస్త్ర సంబంధమైన యద్భుతములు ప్రదర్శించుచు నుపన్యసించి వీరు మానవ హృదయములందు ప్రకృతి విద్యాభిలాషను నెలకొల్ప సమర్థులు. లలితా మహాదేవి

రాయబారులై నానా రాజసందర్శనము చేయుటకు వీరిని నియమింతును.

విజ్ఞా—తప్పక అట్లు చేయుము.

విజ్ఞా—ఇప్పుడు ప్రబోధము కలిగించుట యొకరి పనియు, దానికి ధనసంపాదనము మఱియొకరి పనియు నైనది.

ప్రేమ—ఈధనముతో ఈ ప్రబోధమును జీవలోకము నందు పొసఁగించుటకు ఇంకను కార్య విభజనము కావలెను. ఒక చక్రవర్తిని తక్కిన చక్రవర్తులతో సఖ్యము నెఱపి సంస్థల సంస్థాపనకు పూనుకొన వలెను.

విజ్ఞా—ఈపని శ్రీ లలితా మహారాజ్ఞిగారి కొసఁగితివి.

ప్రేమ—సంస్థలు స్థాపింపఁబడిన తఱువాత వానిని నడపుటకు ప్రకృతి విద్యాచతురులైన పండితులుగావలెను.

విజ్ఞా—ఈబాధ్యత ప్రకృతి నిలయమువారికి అప్పగించితివి. మన గురువర్యుని శిష్యులలోని పట్టభద్రులైన యార్యులను శ్రీ విజ్ఞాన చక్షులవారిట్లు లోక కల్యాణమునకై విదేశముల కంపఁగలరు.

ప్రేమ—ప్రకృతి విద్యలను మానవజీవితమునకు సమన్వయముచేసి నడపింపఁజాలెడి తత్వ విశారదులు గావలెను.

విజ్ఞా.—వీరే జగద్గురువులైన ఆర్ష తీర్థులవారి యాంతరంగిక శిష్యులు.

ప్రేమ—అన్ని పనులును ఒక్కరితలనే యుండుట యుక్తముగాదు. యంత్రములోని కీలు కీలును తనకృత్యము సరిగా నెఱవేర్చినప్పుడే అది నిజమైన యంత్రమగును.

కాఁబట్టి ప్రబోధకులు, ధనము, అధికారబలము, శాస్త్ర బలము, తత్వబలము నని మనపనికి అయిదంగములు ఏర్పడు చున్నవి.

విజ్ఞా—జగత్సృష్టికి పంచభూతముల వలెనే. కానివీని నన్నింటికి సమన్వయించి నడపించుటకు యంత్ర చోదకుఁ డొక్కఁడు కావలెను. నీకుఁదప్ప ఒరులకు ఆపని సాధ్యమగు నది కాదు. అప్పుడు ప్రేమవతిగారు మహారాజ్ఞి యగును.

ప్రేమ—పని ప్రారంభము కానిమ్ము. సంఘటనలను బట్టి తరువాతి సమస్యలను ఎదుర్కొందము.

లోకసేవ వెంటనే ప్రారంభమైనది. పెద్దాపురములోని యధికారులపేరనే పని పురికొల్పఁబడినది. ఈమె ప్రేమమున కుముందుగా గుఱియైనది ఆసియాఖండము. ఈమె ధనములకు నిజమైన యధికారము పెద్దాపురములోని యార్య సమాజము వహింపవలెను. ఈమె కార్యములకు పరరాజ్యములలో సాను కూలములు కల్పింపవలసినది లలితా మహాదేవి. జగపతీంద్ర రాజ్య రమాధారేయ యగు లలితామహాదేవి ఆసియా ఖం డములోని సమస్త రాజేంద్రులకును అమూల్య రత్నములును అనంత సువర్ణములును కానుకలొసఁగుచు రాయబారములు పంపవలెను. అట్టిరత్నములును సువర్ణములును ప్రేమవతి వలన సమకూర్పఁ బడవలెను. ఆర్య యోగీంద్రుని శిష్యులైన మత ప్రచారకులు రాయబారులతోఁ గూడ వివిధ రాజ్యముల కరుగుచుండవలెను.

ప్రేమవతి తాను తలపెట్టిన పనిపట్ల ఆలస్యమునకు ఓర్చునదికాదు. ఆమె యాజ్ఞచే ఇట్టి యేర్పాటులకు సన్నాహ

ములు క్షణములో పూర్తియయ్యెను. తంత్రీవార్తలతో కార్య సాధనోపాయములు ప్రేమవతి నిర్ణయించెను. ఒకనాఁటి శుభోదయమున వందలకొలఁదిగా జలాంతర్గాములును విహంగములును కోరంగిచేరెను. లలితా మహాదేవి రాయబారియై వీరభద్రుఁడు అమూల్య ధనములతో పెద్దాపురమునుండి బయలుదేఱి, వాహినీపతి యను నోడ నధిష్ఠించెను. మూఁడు పటాలపుటోడలు వాహినీపతిని సంరక్షించుటకై సాయము కూర్పఁబడెను. రెండు జలాంతర్గాములు ఈ యోడను వెంబడించి వచ్చుచుండెను. రెండు విహంగయంత్రములు ఈయోడలకు ముందుగా ఆకసమున నెగిరి ప్రమాదములు రాకుండ కని పెట్టుచుండెను. రెండు విహంగయంత్రములు ఓడల కిరుప్రక్కల కావలి కాయుచుండెను. మూఁడు విహంగయంత్రములు ఓడలవెనుక ప్రక్కనిలిచి అటునుండి ప్రమాదములు పొసఁగకుండ చూచుకొనుచుండెను. మిగిలిన జలాంతర్గాములును విహంగములును నందందు నిలుపఁబడెను. ఇట్టి సన్నాహములు కూర్చి ప్రేమవతి లలితామహాదేవిచే రాయబారములంపించెను. వాహినీపతియందు ఆర్య ప్రచారకు లెందఱేని చేరిరి. ప్రకృతి నిలయమునందాఱితేఱిన పట్టపరీక్షా ధురీణులును ననేకు లిందున్నారు.

ఇట్టి సన్నాహములతో వాహినీపతి కోరమండలమునకు రాజధానియగు కోరంగి రేవునుండి బయలుదేఱినది. క్రమముగా నీ నౌకాబృందము కొన్నినాళ్లకు బ్రహ్మదేశమును చేరెను. అచ్చటి రాజులకు కానుకలొసఁగఁబడెను. వారి సానుభూతి సంపాదింపఁబడెను. ఆరాజులు లలితామహా

దేవికి మఱల కానుకలొసఁగిరి. కొందఱు ఆర్ష ప్రచారకులును ప్రకృతి నిలయపు పట్టభద్రులును ఆరాజుల కప్పగింపఁబడిరి. రాజాదరణమున నందు వసించుచు ప్రకృతివిద్యలను ఆర్ష సత్యములను నందు వెలయించుట వీరిపని. వీరిపోషణకగు వ్యయమంతయు పేరునకు లలితా మహాదేవియే వహించును. ఇట్టి సంధిషరతులు కల్పించి వాహినీపతి బ్రహ్మ దేశమునందు కొన్ని దినములు విడిసెను. ఆకాలములో అనాథ రక్షణశాలలు రెండు స్థాపింపఁబడినవి. వృద్ధులు, అంధులు, రోగులు మున్నగువారి కొక రక్షణశాలయు, దిక్కులేని బాలబాలికల కొక రక్షణశాలయు నిట్లు స్థాపితమైనవి. ప్రకృతి విద్యాలయ మొక్కటి వెలయింపఁ బడినది. ప్రకృతి విద్యాలయమున నెల్లరకును ఉచితముగా అన్నవస్త్రములిచ్చి చదువు చెప్పుదురు. వీని రక్షణకై తీగెలులేని దూరవార్తా హారిణియొక్కటియు నొక జలాంతర్గామియు, నొక వాయువిమానమును వలసిన ధనమును ఒసఁగఁబడెను. సముద్రతీరపు పట్టణములలోనే ప్రారంభ సంస్థలు వెలయింపఁ బడినవి.

అటువెనుక వాహినీపతి మలయాద్వీపకల్పము, సయాముదేశము, యవద్వీపము, మున్నగు నా ప్రాంతములలోని సమస్త స్వతంత్ర రాజ్యములను సంచరించెను. ఈరీతిగా ఉత్తర మహాసముద్రమువఱకు వాహినీపతి సంచరించి ఎల్ల చోటులను ప్రకృతి నిలయపు పట్టభద్రులను, ఆర్ష ప్రచారకులను నెలకొల్పినది. ఒక్కొక్క విమానమును జలాంతర్గామియుఁగూడ నందుంపఁబడెను. లలితామహాదేవి యొసఁగిన యమూల్యములైన కానుకలకు లొంగిపోవని రాజేంద్రుఁ

పొక్కుడును ఎంచును లేడయ్యెను. అట్లే వివేకవతియును మఱియొక యోడ యిట్టిరీతి సన్నాహములతోనే పారసీకము యవనము, కపిలము, గాంధారము•మున్నగు పశ్చిమపుదెస నున్న సముద్రప్రాంత దేశములకు రామభద్రునివెంట ననుపఁబడినది.

ప్రకృతి శాస్త్రవేత్తలును, ఆర్ష విద్యాధురంధరులును విదేశముల కేగినంతనే కార్యములు తీఱఁబోవు. వీరిపోషణకు తగినంత ధనము మాటిమాటికి చేరుచుండవలెను. మదాంధులైన యధికారులనుండియు, కొన్నియెడల మనుష్యాశనులైన యనాగరకులనుండియు వీరిని సంరక్షించు చుండవలెను. అందులకై లలితామహాదేవి పేరున ప్రేమవతి పెద్ద సిబ్బందిని ఏర్పఱిచి వారిచేత నిరంతర విహంగయానములు చేయించుచుండెను. పరోపకార నిమగ్నులై ప్రేమతత్వమును ప్రకృతి స్వరూపమును జనులకు బోధించుచు నితర విషయములలో నెంతమాత్రమును సంబంధము కల్పించుకొనకుండ తామరాకుమీఁది నీటిబొట్టువలె కాలము గడపుకొనుచు దేశమున ప్రబోధమును గలిగించి యమృతమును బురికొల్పి చరించుట ప్రచారక ధర్మముగా నిర్ణయింపఁబడెను.

రాజాదరణమున నార్షసంస్థలు వెలసిన ప్రతిపట్టణములోను ఆర్ష సమాజము పేర ననేకమందిరములు నిర్మింపఁబడినవి. అందు మొదటిది పేదలైన వృద్ధులకును వికలాంగులకును అవయవవైకల్య కారణమున సంపాదించుకొని జీవింపనేరని వారికిని నివసింప తావొసఁగి అన్నవస్త్రములిచ్చి రక్షించు నాశ్రయస్థానము. రెండవది రోగులకు ఉచితవైద్య

శాల; ఇందు ఆర్ష వైద్యమును తద్దేశపు వైద్యమును గూడ నెఱపఁబడును; మూఁడవది అనాథరక్షణశాల; నాలుగవది ఉచిత విద్యాశాల. ఇందుఎల్లరకును అన్నవస్త్రములిచ్చి పుస్తకములిచ్చి ఉచితముగా ప్రకృతివిద్యలు నేర్పబడును; అయిదవది ఆదరించు దిక్కులేని పసివాండ్రకు ఆశ్రమము. ఆఱవది కర్మాగారము; ఇందు యంత్ర సహాయమున వస్త్రములునేయు మరలు, కాగిదములుచేయు మరలు మున్నగు నా దేశమునకు వలసిన పెక్కు మరలుండును. పట్టణములోని కూలికంటె కొంచెము తక్కువగా నిందలి పనివాండ్రకు దినభృతి యొసఁగఁబడును. కూలిపని దొరకనినాఁడు ఎవ్వఁడైనను నిందువచ్చి పనిచేయవచ్చును. చేసిన పనినిబట్టి కూలి నిర్ణయింపఁబడును. ఇట్టిరీతి సంస్థలు ప్రకృతి నిలయపు పట్టభద్రులచేతను ఆర్ష ప్రచారకులచేతను నిర్వహింపఁబడుచుండెను.

మఱియొకరీతి ప్రచారముకూడ నిట్టి పట్టణములందు ఆరంభింపఁబడెను. నూరేసియిండ్లు కొక్కొక్క ఖండముగా సంస్థలుగల పట్టణములన్నియు విభజింపఁబడెను. విద్యాలయములోని విద్యార్థులు ఖండమున కొక్కొక్క బృందముగా విభజింపఁబడిరి. ఉదయమునను సాయాహ్నమునను ఈ బృందములు తమతమ ఖండములకరిగి విచారణలుచేసి నిస్సహాయులైన యాపన్ను లెవ్వరైన నున్నచో కనుఁగొని చేతనైన సేవ చేయవలెను; లేదా ఆ గ్రామములోని యార్ష సమాజాధ్యక్షునకుఁ దెలుపవలెను.

ఆర్షనిలయములు వెలయింపఁబడిన దేశములలో మఱి

యొకరీతి ప్రచార మారంభింపఁబడెను. ఆఱవ ప్రకరణము నందు కాకినాడలోని గంట స్తంభముకడ సంభాషించుకొను చుండిన యువకు లిరువురును ఆర్య ప్రచారకులైరి. ప్రేమవతి వీరికి నౌకాపట్టణములను విమాన పట్టణములను నిర్మించి యిచ్చెను. మఱియు ఈజడ ప్రకృతిలో నడఁగియుండిన మహా ప్రభావములను వెలువరించి ప్రజలలో ఎట్టియెట్టులు అద్భుతోత్సాహములు కూర్ప వలనుపడునో అట్టి సాధనముల నన్నింటిని వీరికి సమకూర్చెను. సర్వదా నానాదేశ సంచారములు కావించుచు నార్య నిలయ పరిసరములం దధికముగను దూరప్రదేశములందు కొంచెము తక్కువగను ప్రబోధము కలిగించుట వీరిపని. అట్లే రాజమహేంద్రపుర వాసులగు రామమూర్తియు విశ్వనాథమును వేంకటేశ్వరుఁడును గూడ వీరిలో చేరిరి. వీ రెల్లరును సంసార తాపత్రయములలో మునిఁగి జీవితకాలమునంతను దారారాధనయందే వ్యర్థపుచ్చనొల్లక బాల్యముననే ఆర్య సన్యాసులై ప్రజాసేవకు దీక్షగైకొనిరి.

మత ప్రచారమును విద్యా ప్రచారమును ఆర్తరక్షణమును ఏకకాలముననే ప్రతి దేశమునందును ఆరంభింపఁబడెను. జనులు ఎవ్వరి మతమును వారు అనుష్ఠింపవచ్చును. కాని ప్రేమ సూత్రముతో సర్వమానవ సముద్ధరణపు క్రియకు భంగము రాకుండునట్లు ప్రాచీనమత సిద్ధాంతములను వారు సమన్వయింప వలెను.

ఆర్య తీర్థులవారు ప్రజలలో ప్రకృతిశాస్త్ర చర్చలను పురికొల్పుటకొక యుపాయముగా జనాభివృద్ధి సిద్ధాంతమును ప్రకటించినప్పుడు శుష్కవేదాంతులెట్లు చెలరేఁగిరో అట్లే

యీ నూతన సంస్థలకు జడిసి ప్రతిదేశమునందును శుష్క వేదాంతులు బయలుదేఱి ఆర్యప్రచారకులను మాంత్రికులనియు దయ్యాలమారులనియు, దూషింపసాగిరిగాని శుద్ధవర్తనులై రాజాశ్రయమున వర్తించు వీరికి యిట్టి మూఢుల ప్రచారమువలన నెట్టి నష్టమును గలుగలేదు.

ఈరీతిగా ఆసియా ఖండమున మొట్టమొదట ప్రచారమారంభమైనది. ప్రకృతి శాస్త్రజ్ఞుల యద్భుత సంఘటనలును ప్రచారకుల యద్వితీయ సుగుణ ప్రభావమును ప్రతిదేశమునందును తలఁచిన దానికంటె పదింతలుగా సత్ఫలముల నొసఁగఁజాలెను. సముద్రతీర భూములలోనేగాక దేశమంతటను నిట్టి సంస్థలను స్థాపింపఁగోరుచు దేశాధిపతులే లలితామహాదేవిని వేఁడుకొనఁజొచ్చిరి; అట్టిసంస్థల కగువ్యయమును గూడ తామే భరింతుమనియు వారు విన్నవించుకొనుచుండిరి. క్రమక్రమముగా సంస్థలు పెరిగిపోవుచుండెను. దేశమెల్లెడల నివి యల్లుకొనుచుండెను. వాని వ్యయమునకు అపారముగా నా దేశాధిపతులచే సుక్షేత్రములైన భూములును ఒసఁగఁబడుచుండెను. "జగత్తు సత్యము; శాస్త్రము దానికి కీలకము; తపస్వియైన మానవునకు జగములు బంట్లు; ప్రేమమే లోకకల్యాణములకు మూలసూత్రము" అని దేశదేశముల యందును విద్యార్థులు చెప్పక చెప్పుకొనుచుండిరి.

కాని ఊరూరను విశ్వవిద్యాలయములు నెలకొల్పుట సాధ్యముకాదు. ప్రకృతి నిలయపు పట్టభద్రులవలన నించుకించుక విద్యలు విదేశములలో వెలసినను అధికవిద్యలకు ఒక కూడలి యవసరమగుచున్నది. ఈ సమస్యను సాధించుటకై

ప్రేమవతియు విజ్ఞానశృంఖలయు అమరావతీ విశ్వవిద్యాలయ నిర్మాణమును దక్షిణధ్రువమున నెప్పుడో పూర్తి కావించి యుంచిరి. నేఁడు వీరు ఆదిక్కునకు యాత్రను మఱల సాగించిరి.

విదేశములందలి యార్య సంస్థలలో ప్రాథమికవిద్య పూర్తియైనతరువాత నందలి విద్యార్థులలో గుణమునను దెలివిని నుత్తములైనవా రందఱును అమరావతీ విశ్వవిద్యాలయమునకుఁ బంపఁబడుటకు ఏర్పాటు కావింపఁబడెను. దీనివలన ఆసియా ఆఫ్రికాఖండములలోని సంస్థలనుండి వేలకొలఁది విద్యార్థులు ఉన్నతవిద్యలకై దక్షిణధ్రువమున కరుగుచుండిరి.

# యిరువదియవ ప్రకరణము.

ఛికాగో పట్టణమున రెండవసభ సమావేశమయ్యెను కాలవ్యవధి కలిగినందున పండితులకు విమాన నిర్మాణ పద్ధతులకు అభినివేశము అధికమయ్యెను. అధ్యక్షుఁ డిట్లు సభ నారంభించెను.

అధ్య—క్రిందటి సభయందు జలవాయువును తిత్తులలో చేర్చి విమానములు నడప నిశ్చయించితిమి. తిత్తులు వంగిపోవునని పూర్వపక్షము వచ్చినది. గాలి విసరువలనను గమన వేగముచేతను తిత్తులు వంగిపోకుండ ఇనుపకఱ్ఱలను తీగవలలను మీటలుగా పెట్టి కార్యము సాగింపవచ్చును. కాని ప్రకృతి

నిలయమువారి విమానముల యెదుట మన విమానములు సూర్యునిముందటి దీపములగును.

పండితుఁడు. ౧—నేను దీనినే యోచించితిని. జల వాయువు అక్కఱలేదు. ఱాతిని విసరి నీటియందు కప్పగంతులు వేయించవచ్చునుగదా. అట్లే విమానమును విసరి గాలియందు సంచారము చేయింపవచ్చును.

పండితుఁడు. ౨—విమానమును మీరు పైకెత్తి విసరఁగలరా ?

పండితుఁడు. ౧—అవసరములేదు. భూమిపైనిపట్టాలు వేసి యంత్రబలముతో అతివేగముగా పరువెత్తించి ఆకస్మికముగా నొకకొన భాగమునంతను పైకి ఆకసమువంకకు నిగుడునట్లు చేసినయెడల గమనవేగమే విమానమును గాలిలోనికి ఏటవాలుగా తూలించి ఎగురునట్లు చేయును.

పండితుఁడు. 3—ఇది సాధ్యమైనపనిగా తోఁచలేదు.

పండితుఁడు. ౧—ఇంతకంటె సులభ సాధ్యమైనది వేఱొక్కటిలేదు. వేగముగాపోవు నే వస్తువునకేని అడ్డము తగిలినయెడల అదియెట్లు గాలిలోనికి తూలునో అట్లే గమన వేగము వలనను మొనవాలు వలననుగూడ విమానము పైకి లేచును. మఱియు విమానమును కదలించు యంత్రము పని చేయుచునే యుండును గావున గాలిలో ఆ విమానము మొన వాలినదిక్కు ననుసరించి యెగిరిపోవును.

పండితుఁడు. ౨—అప్పుడది క్రిందఁబడిపోదా ?

పండితుఁడు. ౧—ఱాతికి దారమునుగట్టి గిఱగిఱత్రిప్పు నప్పుడది క్రిందబడుచున్నదా ? ఒక విమానమునకు భూమ్యా

కర్షణశక్తి పదిమంతుగు లనుకొనుఁడు. విమానవేగము పం
డ్రెండు మంతుగు లనుకొనుఁడు అప్పుడది భూమ్యాకర్షణను
లక్ష్యపెట్టక ఏకాంచెము వేగముతోనో తిరుగుచునేయుండును.

అధ్య—ఇవి ఊహలుగాని ఆచరణయోగ్యములుకావు.

పండితుఁడు. ౧—గాలిపటము ఆచరణయోగ్యమై
నప్పుడు ఇదియేలకారాదు? ఆకాలమును త్వరలోనేవచ్చును.

పండితుఁడు. ౨—మీరు చెప్పునది అసంభవమని
నేను పందెమువేసి చెప్పఁగలను. మా పూర్వపక్షములకు
మీరు సమాధానము చెప్పినయెడల అప్పటిమాట చూచు
కొందము. విమానము గాలిలోనికి ఎగిరిన దనుకొనుఁడు. కాని
అది సంచారమునకు పనికిరాదు.

పండితుఁడు. ౧—పనికివచ్చును. దానికి సాధనము
లున్నవి. మొదటిది సంచారవేగమునకు ప్రత్యేక యంత్రము
లు నిర్మింపఁబడుట, ఇదియొకటి. పక్షిరెక్కలవంటి రెక్కలు
విమానమునకు అమర్పఁబడి అల్లార్పఁబడును. ఇదిరెండు.
వేగాధిక్యము పొసఁగిన తరువాత వడిని నిలుకడగా నుంచుటకు
అంత అధికబలము అవసరముకాదు. ఇదిమూఁడు.

పండితుఁడు. ౩—అట్లేఎగిరి గాలిలో పరుగెత్తు సను
కొనుఁడు. కాని పైకెగిరినతరువాత ప్రమాదములేకుండ క్రింది
కి దింపుటకు శక్యముకాదు,

పండితుఁడు. ౧—క్రిందికి పడిపోకుండునట్లు భూమ్యా
కర్షణశక్తికి మించిన బలమును మాత్రము మిగిల్చి యంత్ర
జనితములగు తక్కిన వేగములను ఉపసంహరించిన యెడల

వేగము తగ్గునుగాని యంత్రము క్రిందకుపడదు. సుఖముగా క్రిందికి దిగవచ్చును.

పండితుఁడు. ౪—విమానమును ఎత్తివేయఁ గలిగి నంత వేగము వచ్చుదాఁక నేలను నడిపించి పిమ్మట మొసను ఎత్తుమంటిరి. ఇట్టి సంచారములకు పురమధ్యములందు విశాలములైన బయళ్లు దొరకవు.

పండితుఁడు. ౧—ఆకాలము వచ్చునప్పుడు అట్టి బయళ్లను కల్పింపఁబడును. స్థలము దొరకదనుట యొక యుక్తి కాదు.

పండితుఁడు. ౫—ఎత్తు ఎగిరిన కొలఁదిని వాయువు పలుచనయగును. యంత్రమును నడుపు బొగ్గును చమురులును వేగముగా సరిగా మండుటకు అచ్చటిగాలిచాలదు. అందుచేత వేఁడితగ్గి విమానము నేలఁబడి ముక్కలై పోవును.

పండితుఁడు. ౧—యంత్రసహాయమువలన ప్రతిచోట ను వాయువుతో తిత్తులను పూరించుకో వచ్చును. అట్లు సర్వత్ర లభ్యమగు వాయువును వాయుమండలమునుండి తిత్తులకు చేర్చి యణఁచిపెట్టి ఆ వాయువుసహాయముతో ఎట్టిచోటను గూడ చమురు జ్వాలించుటకు వలసినగాలిని కూర్పవచ్చును.

పండితుఁడు. ౬—ఱెక్కలు కూర్చుటవలన బరువు హెచ్చును.

పండితుఁడు. ౧—ఱెక్కలు పక్షులకు ఎట్లు సహాయ పడుచున్నవో మనకును అట్లే సహాయపడును. మఱియు యంత్రముపై కెగిరినప్పుడు అది మున్నుండిన క్రిందితావు వాయుశూన్య మగును. వాయుశూన్యములైన తావులకు అతి

వేగముతో గాలివానలందునవలె క్రొత్త వాయువులు వచ్చును. వాని వేగము యంత్రగమనమునకు లాభించును. అట్లే రెక్కలల్లార్చుట వలనను వాయువేగము తోడగును. ఇట్లు నూతనమైన వాయువేగ మొకటి మనకు అనుకూలమగును. ఎంతదూరము యంత్రబలముచే విమానము నెట్టఁబడునో దానికి అనుగుణమైన వాయువేగమొక్కటికూడ మనకు తోడ్పడుచు బంటువలె సహాయమొనర్చును.

పండితుఁడు. ౨—ఘోరములైన తుపానులు ఎదురుకొట్టునప్పుడు యంత్రము స్తబ్ధమై కదలిక లేక నిలిచిపోవును. కదలిక లేక నిలిచినప్పుడు అది నేలపడి భగ్నమై పోవును.

పండితుఁడు. ౧—అట్లు జరుగదు. ఎట్టి తుపానునైన నెదుర్చు వేగము యంత్రమునకుండును. సుడిగాలి తిరిగి యంత్రమును నేలకు కొట్టఁజూచినను విమానము దానిని ఎదుర్కొనఁ గలదు.

పండితుఁడు. ౩—గాలిలో ఎగురవచ్చు ననుకొనుఁడు. కాని దానిని మనకు వలసిన యూళ్లకు నడపింప సాధ్యము కాదు.

పండితుఁడు. ౧—తప్పక సాధ్యమగును. చుక్కాని పెట్టి నడపింప వచ్చును. రెండు మీటలును ఒకకఱ్ఱయందు అమర్చుదము. కుడిమీట నొక్కినచో కుడిప్రక్కకును, ఎడమ మీట నొక్కినచో నెడమ ప్రక్కకును, విమానము తిరుగును. కఱ్ఱను కుడి యెడమలకుత్రిప్పి రెక్కలను సరియైన దారికి మరల్పవచ్చును. అట్లే పైకిని, క్రిందికిని, ఏటవాలుగానుగూడ ఇచ్చ వచ్చినట్లు దీనిని నడపింప వచ్చును.

పండితుఁడు. ౬—నడపింపవచ్చునని యొప్పుకొందు మనుకొనుఁడు. అప్పటికిని అమితమైన వేగము కల్పింపఁబడక యంత్రము ఆకసమున నిలువఁ జాలదు. అట్లు మహావేగముగా పోవునప్పుడు నడుమ పర్వతాదులు అడ్డము వచ్చినయెడల ఘోరప్రమాదములగును.

పండితుఁడు. ౭—ఎంతటి వేగమును క్షణములో నుపసంహరింపవచ్చును. లేదా గుండ్రముగా విమానమును త్రిప్పి వెనుకకు మఱలింప వచ్చును. ఇట్టి నిరోధములు దూరమునుండియే కంటికిఁ గానఁబడును.

పండితుఁడు. ౮—దట్టమైన పొగ మంచుగాని మేఘములుగాని వర్షముగాని పడుచున్నచో గజము దూరముననున్న వస్తువుగూడ మనకండ్లఁ బడదు.

పండితుఁడు. ౯—మార్గమునకు సంబంధించిన భూగోళశాస్త్ర పటములెప్పుడును విమాన చోదకుఁడు తనకడనే యుంచుకొనును. క్రొత్తతావుల కేగునప్పుడు తలయందు మెదడుగల ప్రతిచోదకుఁడును ఇట్టి దృష్టి నిరోధములు లేని సమయముననే ప్రయాణము చేయవలెను.

పండితుఁడు. ౧౦—ఆకస్మికముగా మరలు చెడిన యెడల చోదకునకు మరణము సిద్ధము.

పండితుఁడు. ౧౧—ఆకస్మికముగా తిత్తికి చిల్లిపడినను, జలవాయువు మండిపోయినను నిట్టి స్థితియే. కాని ప్రయాణమునకు ముందు యంత్రచోదకుఁడు మరలను పరీక్షించుకొనుట శాస్త్రధర్మము.

పండి ౧౧—శీతోష్ణ భేదములవలన ప్రమాదములు పొసఁగినప్పు డేమిచేయవలెను ?

పండి ౧—తదనుగుణముగానే సంచారమునందు మార్పులు కావించుకొనవలెను.

పండి ౧౨—ఇంతచేసినను మీ విమానము గంటకు రెండుమైళ్లుకూడ పోలేదు.

పండి ౧—అది యంత్రముల బలము ననుసరించి యుండును. విమానమును నందలి ప్రయాణికులును సామానులు గలిసి అయిదువేల టన్నుల బరువగుకొనుఁడు. ఈ బరువును లాగికొనుచు విమానము శేషించిన బలముతో సంచరించును. గంటకు ఇన్నూరుమైళ్ల వేగము దుర్ఘటముకాదు.

పండి ౧౩—విమానమునందు ఇతర పరికరము లేవేవి యుండవలెను ?

పండి ౧—వానిని సులభముగా చేర్చుకోవచ్చును. విమానవేగమును దెలుపు యంత్రమును, ఉష్ణమానియు, వాయుభారము తెలుపు మరయు, దిక్సూచనియు—నిట్టివానిని ఊహకొలఁదిని మనమే కూర్చుకోఁగలము. దీపములు, ఆహార పదార్థములు, వస్త్రములు మున్నగువానిని ఈ పండితసభలో నిర్ణయింపఁ బనిలేదు.

పండి ౧౪—యంత్రము క్రిందికి దిగునప్పటి పరిస్థితు లెట్లుండును.

పండి ౧—గాలికెగిరినయాకుగాని, గాలిపటముగాని యెట్లు నేలకు దిగునో అట్లే అప్రమాదముగా యంత్రముల

వలని యధిక సదుపాయములతో విమానముకూడ నేలకు దిగవచ్చును.

పండి ౧౫—యంత్రమును కొయ్యతో చేయరాదా?

పండి ౧—కొయ్యకు ప్రమాదములు హెచ్చు. తేలికయు దిట్టతనమునుగల లోహముతో చేయవలెను.

పండి ౧౬—విడువకుండ ఒక్కబిగిని ఎంతకాలము ఈ విమానము సంచరింపఁగలదు?

పండి ౧—మనము కొనిపోవు చమురులు నేలబొగ్గుమున్నగు యంత్రమును నడపుటకు వలసిన పదార్థములు అయిపోవుదాఁక విమానము తిరుగుచునే యుండవచ్చును. పిమ్మట క్రిందికి దిగి మరమ్మతులు చేసికొని వలసిన పదార్థములు కూర్చుకొని మఱల ప్రయాణ మారంభింపవలెను.

పండి ౧౭—భరతవర్షీయుల విమానములు సంవత్సరములకొలఁది ఏకరీతిని నిరంతర సంచారములు చేయుచున్నవి.

పండి ౧౮—వానికి నేలను పరుగులెత్తి మొనపైకెత్తి ఎగురవలసిన యవసరములేదు.

పండి ౧౯—అవి జలగర్భమునను, నీటిమీఁదను, గాలిలోనుగూడ సంచరింపఁగలవు.

పండి ౨౦—లక్ష గుఱ్ఱముల శక్తికూడ వానిని చెనకలేదు.

పండి ౨౧—మన విమానము ఆగిపోయినప్పుడు నేలను పడిపోవలసినదేగాని గంటలకొలఁది కాలము కదలకుండ ఆకాశమును విడియుటలేదు.

పండి ౧—ఆ కాలమును మనకు రావచ్చును. ఇప్పు

టికి నాకుతోఁచిన యొక పద్ధతిని మీకు విన్నవించితిని. దీని కంటె వేఱొకపద్ధతి మీకు తెలిసినయెడల వివరింపుఁడు. పరిశీలించి మానవోద్ధరణమునకు మీరు నిర్ణయించు మార్గ ముననే పోవుదము.

మొదటిపండితుఁడు చెప్పినదానికంటె వేఱొకపద్ధతి ఎవ్వరికిని తట్టలేదు. పండిత ప్రకాండుల తర్కములు అంతటి తో నిలిచిపోయినవి. ప్రేమవతి కనిపెట్టిన యణువిభేదక మార్గము బ్రహ్మాభేద్యమైన రహస్యమై లోకమును విస్మయము పాలొనరించినది. కాని చికాగో పట్టణములోని పండిత సభ అట్టిమార్గమును కనుఁగొనలేక పోయెను.

# ఇరువది యొకటవ ప్రకరణము.

## అమరావతీ విశ్వవిద్యాలయము.

అమరావతీ విశ్వవిద్యాలయము స్థాపింపబడెను. ఇది ఎరిబస్ అను అగ్ని పర్వతమునకు ఆఱువేలమైళ్లు కావల భూగర్భమున ఒక మైలులోతున నిర్మింపఁబడినది దీనిపొడుగు ముప్పదిమైళ్లు వెడల్పు ఇరువదిమైళ్లు. వైశాల్యము ఆఱువం దలమైళ్లు. సముద్ర గర్భమునుండియే దీనిలోనికి ప్రవేశించు టకు మార్గము. జలాంతర్గామి సముద్రపునీట మునిఁగి యొక పర్వత పార్శ్వమునకుఁ బోవును. ఆపార్శ్వమున నొక పెద్ద సొరంగము కలదు. ఆ సొరంగము భూగర్భము లోనికి వ్యాపిం చినది. ఆ భాగము సున్నపుమయము, అచ్చోట భూమిపై

పొఱ అగ్ని పర్వతములవలన పటికరాళ్లతో నేర్పడి రెండువేల యడుగుల మందముగలిగి యుండెను.

ఈపటిక పొఱకు దిగువను సుద్ద పొఱకలదు. ఇది రెండువేల గజముల మందముగలది, అంగారవాయు మిశ్రితమైన జలములో సుద్దకు కఱఁగిపోవు గుణముగలదు.

కాఁబట్టి సముద్రపు నీటివలన భూగర్భమున నిట్టి సొరంగ మేర్పడినది. ప్లుతమనో హారిణుల సహాయమువలన ప్రేమవతి యీ సొరంగమును కనిపెట్టి యిందుండి జలమును వెడల నడఁచి తగు ద్వారములు కల్పించి నివాస యోగ్యము కావించెను. లోపలకు శుద్ధ వాయువుల ప్రవేశించుటకు ఏర్పాటులు గావింపఁబడెను.

అమరావతీ విశ్వ విద్యాలయము ఇందు నిర్మింపఁ బడినది. రెండులక్షల మంది జనులకు ఇందు నివాసము కల్పింపఁబడెను. ప్రపంచములోని యార్ష విద్యాలయముల నుండి ప్రతిసంవత్సరమును వేలకొలఁది బాలబాలికలు ఉన్నత విద్యలకై యిచ్చోటికిఁ బంపఁబడు చుండిరి. ప్రాథమిక పాఠశాలలును ఇందు చాలకలవు.

ప్రేమవతియు, విజ్ఞాన శృంఖలయు అమోఘ శాసనియు, కరుణదేవియు వీరభద్రుఁడును రామభద్రుఁడును ఇందే నివసించుచు ప్రకృతివిద్యలను, ప్రేమ తత్వమును లోకమునకు అనుగ్రహించుచుందురు.

ఆనాఁడు అమరావతియందు శీతోష్ణమాని —63° వేఁడిమిని చూపుచుండెను. ఆ చలికి త్రాఁగెడి మంచినీళ్లు సహితము వజ్రపు తునుకలవలె నభేద్యముగా గడ్డకట్టుకొని

పోయెను. ప్రమాదకరమైన చలిగాలి ప్రాణాంతకముగా వీచుచుండెను. బైట సంచరించువారి చర్మపు బొంతలమీఁద మోయరానంత భారముగా మంచు పేరుకొనిపోయి యుండెను. అది యా ప్రదేశములోని శీతకాలపు నడిరేయి. అప్పటికి సూర్యుఁడస్తమించి 62 దినములైనది. మఱియొక యిఱువది మూఁడు దినములదాఁక అచ్చోట మఱల సూర్యోదయము కాదు. ఈ చలికి ఆప్రదేశమంతయు గడ్డకట్టిన పొగమంచుతో నావరింపఁబడి యుండుటచే ఒకగజము దూరములోనున్న వస్తువుకూడ కానవచ్చుటలేదు. మంచులేళ్లును, తెల్లయెలుఁగుగొడ్లును మాత్రమే ఆ నిశాంధకారమునందు ఆ చలిలో నిరంతర సంచారములు కావించుచుండెను. అట్టి కాళరాత్రియందు అమరావతీ విశ్వవిద్యాలయములోని సాంఘిక సేవాసమితికి చేరిన పదిమంది విద్యార్థులును నొక కాంతామణియు పేరుకొనిపోయిన సముద్రపు మంచుగడ్డలమీఁద మంచులేళ్లచే లాగఁబడుచుండిన చక్రములులేని యొక శకటమునెక్కి నడిసంద్రములోనికి పోవుచుండిరి. వారికాళ్లకు ఎత్తైన చర్మపు మోజాలు మోకాళ్లదాఁకనుండెను. అందుండి బరువైన ఉన్ని యిజార్లు పైకి లేచుచుండెను. తలయు ముఖమును పెద్ద బొంతలతోఁ గప్పఁబడి యుండినవి. వానిదిగువను ఒక దానిక్రింద నొకటిగా మూఁడుజతల నానావిధములైన వాయు నిరోధకములగు నుష్ణ పరిధానములుండెను. ఆవేషమునుబట్టి వారు స్త్రీలో పురుషులో బాలురో వృద్ధులో తెలియ సాధ్యము గాదు. ఆ శకటమునందు అవ్వారిగా ఆహార పదార్థములును ఔషధములును గూడ నుండెను.

ఆ యచక్రయానము సముద్రపు మంచుగడ్డలలో పోయిపోయి యా చిమ్మచీఁకటిలో రెండు మంచుగడ్డలనడుమ నిఱుకుకొనిపోయి చాలవఱకు మంచుతో కప్పఁబడిన తిమింగల మువలెనిడుపగు నాకారముగల యొక పదార్థమును సమీపించెను. తోడనే ఎల్లరును గొడ్డళ్లు చేతఁబుచ్చుకొని శకటము నుండిదిగి యా పదార్థమును సమీపించి దానిపై మంచుగడ్డలను ఛేదింప నారంభించిరి. అల్పకాలములో మార్గమొకటి యేర్పడినది. వెంటనే నాయకస్వరూపి శకటమునుండి కొన్ని యంత్రములను పెట్టెలను దెప్పించి ఆమార్గముగుండ తన బలగముతో లోనికిఁ దిగెను.

అది మంచుగడ్డల నడుమ పూడుకొని పోయిన యొక యోడ. అందు నూటయేఁబది మంది మనుష్యులు గలరు. ఈ యోడ సుమాత్రా ద్వీపమునుండి బయలుదేరి ఆస్ట్రేలియా వంకకుఁ బోవుచుండఁగా నడుమ తుపానుకొట్టినది. వాత్యాహతమై యీ యోడ దిక్కుతెన్ను లేక గాలి తనను ఈడ్చిన ట్లెల్ల పోయిపోయి యిరువది నాళ్లలో నాలువేల మైళ్లప్రయాణము సాగించి మంచుకరుళ్ల నడుమ బంధింపఁబడి యిచ్చటకు కొట్టుకొని వచ్చినది. మిక్కుటమైన చలిచేతను, భయము చేతను బడలికచేతను ఇట్టి ప్రదేశములందు ధరింపవలసిన యుష్ణ పరిధానములు లేమిచేతను అందందు ఓడ గడ్డకట్టిన మంచులో పూడుకొని పోవుటచేతను వారందఱును స్పృహతప్పి కొయ్యవాఱి యా యోడలో నామంచులోఁబడి యుండిరి.

శకటమునుండి దిగిన పదునొకండ్రును వెంటనే శుద్ధ వాయువులు ప్రవేశించుటకు దారిచేసి యంత్రములు ప్రయో

గించి అచ్ఛోటనుష్ణము పుట్టించుచు నెల్లరకును సద్యః ప్రాణకరములగు నౌషధములు నోటఁబోసి వైద్యోపచారముల నొనర్చి వారిని ఉన్నివస్త్రములతోఁ గప్పియుంచిరి. ఎల్లరలోను ప్రాణచిహ్నములు కానవచ్చినవి. కాని పెక్కండ్రకు పలునాళ్లు వైద్యసేవ కావలసియుండెను. దైవతా స్వరూపులగు నీప్రాణదాతలకు వారు నమస్కరించిరి. ప్రాణములు చేరుకొని మాటలాడఁగలస్థితి యందున్న యోడ నాయకుఁడు శకట నాయికనుజూచి ఏమో యడుగఁబోయెను. నాయిక యొక పత్రమును ఆతనికి ఒసఁగెను. అందు సంస్కృతము, చీనాభాష, పారసీకము, గ్రీకు, ల్యాటిను, ఆంగ్లము, ఆంధ్రము—ఈభాషలలో వ్రాయబడిన లేఖనములు కానవచ్చెను.

ఓడ నాయకుఁడు—ఆంధ్రభాషయు నిందున్నదా? ఆంధ్రమున కింత వ్యాప్తికలదా?•

నాయిక—మీ మాటయేఁబంధ్రుఁను తేలుకొన్నారు. కాని యారోగ్యము వడయుటకు కొంతకాలము పట్టును. ఇది ప్రపంచ రాజ్యముల కన్నిటికిని మిత్రమండలము. సర్వవిధముల మేము మీకు తోడై సంరక్షింపఁగలము. నేనిచ్చటి సాంఘిక సేవాసమితికి అధ్యక్షురాలను. ఇట్టి పత్రములుఏఁబది యేఱు భాషలయందు లిఖింపఁబడినవి.

నాయకుఁడు—వేషమునుబట్టి స్త్రీపురుషుల నీదేశము నఁబోల్పరాకున్నది. కాని మీఋణమును మేము తీర్చుకోలేము. ఇచ్చటి కాంధ్రమెట్లు వచ్చినది.

అధ్య—ఏఁబదియేఱు ప్రధాన భాషలలో నేది వచ్చినను, మీతో మాటాడఁ గలవారు కొందఱు ఇప్పుడీ

యోడలో నున్నారు. ఈశ్వరుని శాసనమగు విశ్వమానవ ప్రేమ మా మతమునకు అనుల్లంఘ్యము. కాని యిచ్చోటికి వచ్చువారు కొన్ని నియమములను అంగీకరింప వలెను. ఈ పత్రమును దయచేసి చదువుఁడు.

నాయకుఁడు—(చదువు చున్నాఁడు)

"ఆపన్నులైన యన్య దేశాగతులకు స్వాగతము. కాని ఆపత్కాలము దాఁటువఱకే మీరిందు నిలువ నర్హులు. మా వైద్యులు పరీక్షించి మీకు వలసిన సమస్త పదార్థములను సమకూర్పఁగలరు. సాంఘిక సేవాధ్యక్షులు సమర్పించిన పత్రము ననుసరించి మా యాజ్ఞ వెలువడుదాఁక మాత్రము ఓడనుండి దిగుటకు మీకు అనుమతి లేదు."

అమ్మా! ఓడనుండి దిగుటకు మాకు శక్తియును లేదు. ఇట్టి మీ యాదరణమే మాకు పదివేలు. ఆ పన్నులము. కండ్ల కద్దుకొని మీ యాజ్ఞలను శిరసావహింతుము. మూఁడునాళ్లనుండి మంచుగడ్డలలో చిక్కి వానితోఁ గొట్టుకొని వచ్చుచున్న యీ యోడ మీ ఆజ్ఞాపత్రము వెలువడులోపల మఱియెచ్చటకుఁ గొట్టుకొని పోవునో?

అధ్యక్షుఁ—మీ యోడ మాచే దిటవుగా బంధింపఁబడినది. ఆ భయములేదు. త్వరలోనే మీకు సమస్త సహాయములు చేకూఱును. ఆహారము సిద్ధమైనది. దీనిని సేవించి ఈ పరిధానములను ధరింపుఁడు. అప్పుడు మీకు శీత బాధ యుండదు.

ఎల్లరును పథ్యమును భుజించి యుష్ణపరిచ్ఛద (వస్త్ర)

ములను దొడిగికొనిరి. ఇంతలో నొక లేఖ వచ్చెను. సూర్య లాంఛనముగల యాలేఖ సువర్ణాక్షరములతో లిఖింపఁబడి యుండెను. నాయకుఁడు దాని నిట్లు చదివెను.

"సాగరసంచారియనెడి యోడనాయకునకుస్వాగతము.

"వాత్యాహతిచే నాపన్నులైన మీకు సమస్త సదుపాయములను నొనర్ప సంసిద్ధులము. కాని మీలో పెక్కండ్రు కదపరాని స్థితియందున్నవారు. మఱియు ఆరోగ్యాది నియమముల ననుసరించి కొన్నినాళ్లదాఁక ఆగంతుకులను వారియోడలోనే యుంచి పరిశీలించుట ఇచ్చటి యాచారము. ఏడునాళ్లదాఁక మీరా యోడలోనే యుండ నంగీకరింతురేని తరువాతి కార్యక్రమము మీకుఁ దెలుపఁబడును. అంతదాఁక మీకు వలసిన సమస్త పదార్థములును మీ యంగీకారము రాఁగానే మీకు చేరఁగలవు."

నాయకుఁడు—తల్లీ! ఆజ్ఞ కఠినముగానున్నను దయ అపారముగా నున్నది. ప్రాణదాతలగు మీ యాజ్ఞలను శిరసా వహించుచున్నాను. ఇదె లేఖను వ్రాసి యొసఁగుచున్నాను. కాని, అమ్మా! మంచులో మంచువలె కప్పఁబడిన మాయునికి యీ చిమ్మ చీఁకటిలో మీకెట్లు తెలిసినది?

అధ్య—శబ్ద మెప్పుడును తరంగరూపమున వాయువునందు దశదిశాసంచారములు చేయును. అట్టి శబ్దములలో ప్రమాదధ్వనుల తరంగ దైర్ఘ్యమునకు ప్రత్యేక వ్యక్తిత్వము కలదు. మంచుగడ్డల నడుమ చిక్కుకొనిపోయి కొట్టుకొని వచ్చుచున్నప్పటి మీ యలజడి ఎప్పుడో మాకుఁ దెలిసినది.

ఓడ పద్దారిని వచ్చుచున్నదో, ఎంత వేగముతో వచ్చు చున్నదో, ఎంత దూరముననున్నదో—సర్వమును గణింపఁ బడినది. శీఘ్రములో నెట్టి ప్రమాదమును మీకు రాదని మేము తెలిసికొంటిమి. అందువలన సమస్త సన్నాహములును పూర్తిచేసికొని మీరీ యోడ్డు చేరినక్షణముననే చేతనైన సహాయము చేయుటకు సంసిద్ధులమై వచ్చితిమి. మేము పను నొకండ్రమును ఈ యేడునాళ్లును ఈ యోడయందే నిలిచి మీకు సర్వ సదుపాయములను గూర్పఁగలము. విశ్రాంతి నందుఁడు.

నాయ—అమ్మా! ఒక్క ప్రశ్నమును మిమ్మడుగ నాతురపడుచున్నాను. ఇది యేదేశము? భరతవర్ష మిచ్చటి కెంతదూరమున నున్నది?

అధ్య—చెప్పుటకు నాకు అనుజ్ఞ లేదు.

నాయ—కృతజ్ఞతను దెలుపుటకై యీ సువర్ణ ముద్రి కను దయచేసి యంగీకరింపుఁడు. ఎంతధనమైన నొసఁగెదను. మమ్ము రక్షింపుఁడు.

అధ్య—ఇదియేమిది? నాకు లంచము లీయఁబోవు చున్నారా! ఇట్టి తెన్నులు మీరు వదలివచ్చిన కలి ప్రపం చములోనివి. మీ భరతవర్షము మహామోహుని విజృంభణా మునకు నిదానము.

నాయ—మఱియొక్క ప్రశ్నము. తెలుంగుజాతికి చేరిన మీరీ సూర్యసంచారములేని యంధకార ప్రదేశములలో నేల వసించుచున్నారు?

అధ్య—చెప్పుటకు నాకు అనుజ్ఞ లేదు. మృత్యులోకము నుండి వెడలివచ్చిన మీరు విశ్రాంతిని తీసికొనుఁడు. నిద్రించి తేలుకొనుటకు ప్రయత్నింపుఁడు. మీ దేహస్థితి సంభాషణ కోదవనేరదు.

అధ్యక్షురాలు మూఁగవలె మాటలాడుట మానివేసెను. ఎల్లరును నిద్రించిరి. ఇట్లు వారికి ఉపచారములతో దినములు గడచిపోవుచుండెను. క్రమక్రమముగా నెల్లరకు ఆరోగ్యము వర్ధిల్లుచుండెను. గడియారపు లెక్కను నూట యిరువది యెనిమిది గంటలకాలము ఇట్లు గడచిపోయెను. సూర్యరశ్మి లేమిచే గడియారములే అచ్చోట కాలనిర్ణయమునకు ఆధారములు. సరిగా నూటయిరువది యెనిమిదవ గంట కొట్టుచుండఁగా నౌకాధిపతికి మఱియొక యాజ్ఞాపత్రము వచ్చినది. సువర్ణపత్రముపైన వజ్రములవలె కాంతులీను నక్షరములతో లిఖంపఁబడిన యాలేఖ యిట్లుండెను.

"సాగర సంచారియనెడి యోడ నాయకునకు స్వాగతము.

"మీ యేడునాళ్ల ప్రవర్తనమును మాకు తృప్తిని గలిగించినది. మా నియమములకుఁ గట్టువడ నంగీకరించినచో నిఁకమీఁద మీరు ఈ భూమిపైన అడుగిడవచ్చును. వలసిన సమస్త సదుపాయములును మీకుఁ జేయఁబడును.

"నియమములు.

1. పదిహైదునాళ్లు మాత్రమే మీకీ భూమియందుండుటకు అనుజ్ఞ యొసఁగఁబడినది.

"2. మేము చూపిన గృహమునందే మీరు వసింప వలెను. అందుండి భూప్రదేశమున రెండు మైళ్లకంటె అధిక దూరము మీరుపోరాదు. అట్లు హద్దుదాఁటి వచ్చువారు ప్రకృతి దేవతచే బంధితులగుదురు.

"3. మీరు మాభూమిమీఁద సగుగు పెట్టఁగానే మీ యోడ మా స్వాధీనమగును.

"4. పదియైదునాళ్ల గడువు తీఱఁగానే మాయోడలు మిమ్ముఁ గొనిపోయి సురక్షితస్థానమునఁ జేర్చును. అచ్చట మీయోడ మఱల మీకుఁ జేర్పఁబడును.

"5. మీ వర్తనము తృప్తికరముగా నుండునేని మీ యిష్టానుసారముగా నీగడువును హెచ్చించు విషయము ఆలోచింపఁబడును.

"6. ఈ కాలములో మీ భారమును సర్వవిధముల మేము వహింపఁగలము."

నియమానుసారముగా నెల్లరును గట్టుచేరిరి. అదిగట్టు కాదు. సముద్రములోని మంచుకరుళ్లే క్రింది నేలమీఁద నూరడుగుల యెత్తులేచి ఎంమును వ్యాపించియున్నవి. కుక్కలచే లాగఁబడెడి అచక్ర యానములమీఁద నెల్లరును సురక్షితముగా నొక మంచుకొండ ప్రక్కకుఁ జేర్పఁబడిరి. ఆ కొండ యడ్డముచేత నాప్రదేశమునకు గాలి విసురువలని బాధ లేదు. అచ్చట మంచుగడ్డలచేత నిర్మింపఁబడిన విశాల భవనములు ఇరువదియుండెను. ఓడ యధికారులకు ప్రత్యేక భవనములు సమకూర్పఁబడినవి. వారివారి యున్నతికిఁదగినట్లు ఎల్లరకును వాస ప్రదేశములు కుదిరినవి.

ఆ శీతల దేశములందు దినమునకు 7,000 కాలర్ల ఉష్ణమును గలిగింపఁగల యాహారము కావలెను. అధ్యక్షులు వారలు ఆహారము వస్త్రములు మున్నగు సర్వసదుపాయములను గూర్చుచుండెను. రాత్రి నిద్రించుటకు ఏడేసియడుగుల పొడుగును తలపైన మూఁడడుగుల ద్వారమును గల తెల్లమెలుఁగు చర్మపు సంచులును, శిరో వేష్టనములును గూడ నెల్లరకు యథాయోగ్యముగాఁ గూర్పఁబడినవి. నావికు లందఱును సుఖముగాఁ గాలము గడుపుచుండిరి.

పక్షము దినములును గడచినవి. ఇంకను గొందఱు అనారోగ్య దశయందే యుండిరి. మఱియొక మాసము గడు వాసఁగఁబడెను. అప్పటికెల్లరును స్వస్థులైరి. అప్పటికిని సూర్యోదయము కాలేదు. కాని విద్యుత్సంబంధమైన గ్రుడ్డి వెలుఁగొక్కటి మాత్రము ఆప్రదేశమునందెల్లెడలఁగలదు. ఆ వెలుగులో పుస్తకము చదువలేము. కాని పదార్థములు గుర్తింపఁగలము. ఒక్కొక్క వేళ ఆకాశమున విద్యుజ్జ్యోతులు ఆకస్మికముగా మెఱసి మాయమగుచుండెను. కొంచెము ముఱికి చెందినట్లున్న ఆకుపచ్చని తీగెలవంటి మెఱుపులు ముందు మెఱయుచుండెను. వెంటనే యవి యదృశ్యమై గులాబిపూరంగు మెఱుపులు వచ్చుచుండెను. ఆవెంటనే యవి యదృశ్యమై తెల్లని తీగకడ్డీలు ఆకసమున మెఱయుచుండెను. ఆ తరువాతి క్షణములోనే వట్టి యాకాశము; ఏ మెఱుపును నుండదు. ఇంతలో చూచుచుండఁగనే ఎఱ్ఱని కాంతిరేఖలు; చూపఱులు హృదయంగమమైన యా కాంతులను గ్రహించు లోపలనే బంగారుచాయలు. ఈరీతిగా ఆ దీర్ఘ నిశాంధకార

మునందు ఆకసమున విద్యుజ్జ్యోతులు అప్పుడప్పుడు మెఱయు చుండెను. కన్నులకు స్వాదువులై మనస్సునకు అమృతధారలై యీ విద్యుజ్జ్యోతులు దేవదూతలవలె ఆకసమున శోభాయ మానముగా తళుక్కుమనుచుండును. ఈదృశ్యమును ఏ మానవుఁడును తన జన్మలో మఱచిపోలేఁడు.

ఒకనాఁడు నావికులలో నొక్కఁడు నియమితమైన రెండుమైళ్ల హద్దును దెలుపు నానవాలుదాఁటి ముందడుగు వైచెను. అచ్చటి మంచుగడ్డలు దిటవుగా లేవు. అడుగుపెట్టఁ గానే కాలు దిగిపోయి యాతఁడు మహాసముద్రములోఁ గూలి పోయెను. ఎచ్చటనుండియో కుక్కయొక్కటి పరువెత్తివచ్చి ఆనీట దుమికి వానిని కాలుబట్టి యొడ్డునకీడ్చి మొఱుఁగుచుగృహము వంకకు బాణమువలె తీవ్రన వచ్చిచేరెను. వెంటనే అ చక్రయానము పైనెక్కి అధ్యక్షురాలాచోటికిపోయి వానినిపరీక్షించెను. భయముచే వాఁడు కొయ్యవాఱెనుగాని ఆ దుస్తుల లోనికి నీరెక్కుటకు సాధ్యపడలేదు. వాఁడు తడియనైన తడియలేదు. పాల ముక్కలవలెనున్న యీ హిమప్రదేశము ఎవ్వరికిని ఆపద కలిగింపలేదు. అదిమొదలుకొని యెవ్వరును హద్దుదాఁటి యడుగిడుటకు సాహసింపలేదు. పాలసముద్రము వలె నది గానవచ్చుచున్నను, క్షీరోదధియందును మహావిష్ణు వొక్కఁడే నివసింపఁగలవాఁడు.

నిర్మానుష్యమైన యీ ప్రదేశములో రాజగృహము లెచ్చటనో, ఆహార పరిచ్ఛదాదులు పుష్కలముగా నెందుండి వచ్చుచున్నవో ఎల్లరకును అగమ్య గోచరముగా నుండెను. ఒకనాఁడు నాయకునకు రత్నములుచెక్కిన బంగరు పెట్టె

యందు సువర్ణపత్రముపైన వజ్రపుఁబొడితో వ్రాయఁబడిన యీ క్రిందలేఖ వచ్చినది:—

"సాగర సంచారియనెడి యోడనాయకునకు—స్వాగతము.

"నియమానుసారమైన మీ నిర్దుష్ట ప్రవర్తనమునకు మేము ప్రీతులమైతిమి. మీలో సకల విద్యావేత్తలెవ్వరైన నుందురేని యందు ముప్వురకు మేము దర్శన మొసఁగఁ గుతూహలురము. ఇష్టమేని ఱేపటి యుదయమున 8.45 వేళకు మేమంపు సువర్ణ శకటము వారిని మాసన్నిధికిఁ జేర్పఁగలదు."

నౌకాధికారియు నిద్దఱితరులును మఱునాఁడు సువర్ణ శకటమునకై వేచియుండిరి. యథాకాలమున కావాహనము అచ్చట చేరినది. నూరడుగుల యెత్తును నలువది యడుగుల చుట్టుకొలతయు గల వర్తులాకారమగు నాపక్షి శకటమును జూడఁగానే వైకుంఠనాయకుని రథమువలె నది కన్నులపండువు గావించెను. ఆరథము సువర్ణమయము. అయిదేసి యడుగుల దూరమున చుట్టును నీలములు, పచ్చలు, వజ్రములు, కెంపులు, గోమేధికములు మున్నగు శుద్ధరత్నములు చాళ్లుచాళ్లుగా నేత్ర పర్వముగా నందు ఖచితములై యపూర్వ రామణీయకతను వెలయించుచుండెను. ఈ చాళ్లనడుమ ఈశ్వరుని ప్రకృతి విశేషములు దేవాలయమునందు వలె విగ్రహ రూపమునఁ జిత్రింపఁబడి యుండెను. ఒక యడుగు చుట్టుకొలఁతఁ గల వజ్రమొక్కటి కెంపుల చట్టమున నిమిడి విద్యుత్కాంతి వలన దుర్నిరీక్ష్యముగా సూర్యునివలె కాంతులీనుచుండెను.

ఆకాంతులాదిగువను నాలుగడుగుల చుట్టుకొలఁతఁ గల యొక నీలమణి పూరితమైన ప్రదేశమునఁబడి యా ప్రదేశమునకు సముద్రచ్ఛాయ నొసఁగు చుండెను. ఆ సముద్రమునుండి యంత్ర సహాయముచే కాంతులు ఆవిరివలె పైకిలేచి మఱి యొకప్రక్కను మేఘరూపముదాల్చి నిలిచి యుండెను. కాంతి రేఖలను యంత్రములనుండి పనిపి వర్షపాతమును ఒకయెడ నా మేఘములు ప్రదర్శించు చుండెను. అప్రక్కను పచ్చలతోఁ జేయఁబడిన వరి పొలములు కానవచ్చు చుండెను. ఈశ్వరుని లోకరక్షణ విధాన మీ రత్నచిత్రముల వలన తేటఁబడు చుండెను. నావికులు మరియొక చిత్రమును నిదానించి చూచిరి. అచ్చోట పచ్చలతోఁ జేయఁబడిన యాకులు గల మామిడి గ్రూఁకులు కలవు. వానికి బంగారముతోఁ జేయఁ బడిన పక్వఫలములు వ్రేలాడు చుండెను. అప్రక్కను సహజా కారముతో యంత్ర సహాయమున నెగురుచు కూయుచు సంచ రించు రత్నపుంజిలుకలు కానవచ్చుచున్నవి. ఈశ్వరుని ప్రపంచ పరిపాలనా ప్రభావమంతయు నిట్టి యసంఖ్యాకము లైన చిత్రములందు ఈ శకటముపైన యథాసృష్టి క్రమమున బంగరుతోను రత్నములతోను కానవచ్చు చుండెను.

నాయకుఁడు మిత్రద్వితయముతో నాశకటము నారో హించెను. తోడనే యది ఱెక్కలువిప్పి ఆకసమున కెగిరి పది యోజనముల దూరము పరువెత్తెను. వెంటనే దాని పార్శ్వ ములన్నియు మూసికొని పోయినవి. జలవాయు భేద్యమగు మందసముగా నది మాఱిపోయినది. లోపల రత్నదీపములు వెలుఁగ సాగినవి. మంచుగడ్డలను భేదించుకొని యది సముద్ర

గర్భమున లీనమై పోయినది. కొంతకాలములో మఱల తలుపులు విడినవి. స్వర్ణ విరచితమైన యొకద్వారము కడ నీ యంత్రము ఆగినది. వెండికుంచెలను రత్నపు దీపములను గేలఁగొని యిరువురు సేవకులు యంత్రద్వారమును దెఱచి యంత్రస్థితులకు జోహారు లొనర్చి వారిని లోనికిఁ గొని పోయిరి. అదియొక భూగర్భమునందలి విశాలబిలము. విద్యుత్కాంతు లెల్లెడల రంగురంగుల కాచపాత్రలనుండి వెలువడి యా ప్రదేశమునకు సౌభాగ్యమును గూర్చుచుండెను. ఆ బిలమున ఉద్ధారక పీఠముపై నిలిచి ఇన్నూరడుగుల లోతుచేరిన తఱువాత ఇంద్రుని యమరావతీ పట్టణమునకు సాటియైన పురరాజమొక్కటి గానవచ్చెను.

ఐరావతమును బోలిన మూఁడు తెల్లనియంత్రపు టేనుఁగులు అందుఁ గలవు. నావికులు ఆ గజములనెక్కి పుర వైభవమును ఆశ్చర్యముతో వీక్షించుచు రత్నపుటిటుకలతో నిర్మింపఁబడిన రాజ ప్రాసాదమును జేరిరి. అందలి విశాలమైన రాజసభ ఎటుచూచినను నిన్నూరు గజముల పొడవుగలిగి దేదీప్యమానములగు వస్త్రములతో విరాజిల్లెడు పురుషోత్తములచేఁ గ్రిక్కిఱిసి యుండెను. రాజేంద్రుఁడు కన్నులు మిఱుమిట్లుగొలుపు తేజముతోఁ బ్రకాశించుచు నొకవర్ణనాతీతమైన దివ్యసింహాసనము నలంకరించి యుండెను. ఆసింహాసనమునకు పైన నంతకంటె నెత్తైనట్టియు కేవలము ఏకాండపుఱాళ్లతోనే చేయఁబడి నట్టియు కోటిసూర్య ప్రభాభాస మానమై చూడ దుర్నిరీక్ష్యమైనట్టియు, దేవేంద్రుని స్వర్గమునఁగూడఁ గానరానట్టియు ముప్పదిరెండు ద్వారములుగల మఱియొక

సింహాసనము ముండెను. ఆ సింహాసమున నే త్రైలోక్యసుందరి యగు మహారాణి యాసీనయై యుండెను.

నావికులు ముప్వురును ఆపీఠములను సమీపించి సాష్టాంగ మొనర్చిరి. వీరభద్రుఁడును మహారాణియు చిఱునవ్వుతో వారిని బహూకరించి యుచితాసనముల నలంకరింపఁ గను సైఁగ చేసిరి.

వీరభద్రుఁడు—అమరావతీనగరమునందలి యీ సుధర్మ సభకు మీకు స్వాగతము. ఆంధ్రులైన మీకు దేవిగారును స్వాగత మొసఁగుచున్నారు. ఇప్పుడిచ్చట పండితగోష్ఠి యగు చున్నది. ఇందున్న యీ మహనీయు లెల్లరును ప్రకృతి రహస్య పారంగతులై యందిమిడియుండు లోకేశ్వరుని శాసనములను మానవ జీవితమున కనుసంధానముచేసి సఫల జీవనులైన విద్యానిధులు. బ్రహ్మ సృష్టికి ప్రతిసృష్టి యొనర్చి జగమునకు నిత్య సౌభాగ్యములుగూర్చు పరబ్రహ్మస్వరూపులు. వీరితో మీరు ప్రసంగింపవచ్చును.

ఓడనాయకుఁడు వారినిఁజూచి లజ్జితుఁడై యిట్లనెను:—“మహారాజేంద్రా! నావికావృత్తిచే నుదరపోషణము చేసికొను మాకు వీరితో ముచ్చటింప యోగ్యతకలదా? ఇట్టి పవిత్ర తేజుల దర్శనముచేతనే మాజన్మ సార్థకమైనది. మానోములు ఫలించినవి. మేము తరించితిమి”.

మహారాణి—ఇట్టి మహనీయులకు మీ విద్యాస్థానములలో తావుగలదా?

నాయ—తల్లీ! కలిమాయాబద్ధమైన మా లోకములో స్వార్థపరత హెచ్చు. ఇట్టివారు మా లోకమునకు వచ్చిరేని

వారిని పాతాళము దూఱుదాఁక తఱుమఁగొట్టి పంపివేయు దుము.

మహారాణి—విద్యా విషయములలో నుత్తమ శోధనలు గావించువారికి మీ దేశములో సౌకర్యములు ఉండవా?

నాయు—ఐరోపా అమెరికాలయందలి ప్రజలు నాగర కులు. మా దేశమందు బహుభాషలు; ఒక్కొక్కభాషలో బహుజాతులు; ఒక్కొక్కజాతిలో బహుళవ్యక్తులు. ధనవాంఛయు అధికార వాంఛయు, గౌరవవాంఛయు మానవునకు సహజములు. వీనికైపను పాట్లలో యోగ్యతా యోగ్యతలకు స్థానము లేదు.

మహారాణి—చట్రాతి నుండి నారను తీయఁగల వారును, మోఁకాఁట ఆవగింజను విఱువఁగలవారును, ఉసిరిక కాయలను దొంతులు పెట్టఁగలవారును, అఱచేతిని పాత్రగా చేసి వండఁగలవారును, మహా సమర్థులు మీ భారతదేశ ములో కలరే? శ్రద్ధ లేనివారికిఁగూడ విద్యలయెడల నుత్సాహము పుట్టించుట మానవ ధర్మమై యుండఁగా, యోగ్యులగు కార్యధురీణులు గూడ ఇంచుకంత సహాయము లేక క్రుమ్మగవలసి వచ్చుచున్నదా?

నాయు—అమ్మా! ఒక్క భరతవర్షమే యననేల? భూలోకమే కొన్నియెడల శోచనీయ దశయందున్నది. ఒక కాలమున కులమును బట్టియే విద్యాధికార ముండెడిది. ఈ కాలమున ధనమునుబట్టి విద్యాధికారము కలుగుచున్నది.

మహారాణి—ఈశ్వరసృష్టిని శోధించి నానాటికిఁ దెలి య వచ్చుచుండెడి.యందలి మర్మములను లోకులకందఱకు

విస్తృత మొనర్చునదే శాస్త్రము. ఈశ్వర శాసనములకు ఈశ్వర పుత్రుల కందఱకు నధికారము కలదు.

నాయకు—అనఁగా విద్యను నేర్చుటకు సర్వమానవు లకు సమానాధికార మున్నదన్నమాట. సత్యమట్టిదే. కాని దేవుఁడు వరమిచ్చినను పూజారి వరమీయఁడు.

మహారాణి—చదువుకొన దలఁచిన వారిని చదువ రాదని నిషేధించువారుందురా ?

నాయ—నెలకు పదిరూపాయల బడిజీతము, పదు నాఱు రూపాయల నిర్భాగ్యపు సత్రభోజనము, ఇంతయు కర్చుపెట్టఁగా జీవనోపాధి కూర్పలేని శుష్కమైన శాస్త్రజ్ఞా నము—పెద్ద పరీక్షలకు చదువుచో నిండ్లు వాఁకిండ్లు తాఁకట్లు, అటుపైన అన్నములేక అష్టకష్టములు—ఏ కూలిపనిలోచేరి యొక పావలా గణించి గంజినీళ్లైన త్రాఁగవచ్చును గాని యీ చదువులెవ్వరు భరింపఁ గలరు ? ఈ శుష్కవిద్వాంసు లెందుకు పనికివత్తురు ?

మహారాణి—అట్లైన మీవిద్యా పద్ధతులు మూర్చ రాదా ?

నాయకుఁడు—అది నాయకులపని. బొజ్జసవరించుకొ నుచు, మీసములు మెలిపెట్టుకొనుచు కొందఱు నాయకులు తీఱికయేలేక కష్టపడుచుందురు. తమకు నిత్యవందనము లాచ రించు వారినైన సర్వత్రవృద్ధికి దేలేనివారి కష్టములను గమ నింపవలదా ? కలికాలపు నాయకత్వములు బూటకపు గౌర వములకుఁగాని లోకోద్ధరణమునకుఁ గాదు.

మహారాణి—మీగ్రామ పరిపాలనా సంఘములును నట్టి దుస్థితిలో నేయున్నవా ?

నాయకుఁడు—ఈనడుమనట్టి యొకసంఘములోని వారు కఱ్ఱలుపూని తలలు పగులఁగొట్టుకొను చుండఁగా రాష్ట్రీయ ప్రభుత్వమువారు అడ్డురావలసి వచ్చినది. ఎన్నికలగు దాఁక నొకఁడు ప్రజలబంటు. అటువెనుక నాతఁడు చిత్రముగా కండ్లను మూఁతిని త్రిప్పనేర్చిన అలభ్య దర్శనుఁడగు నంతఃపుర కాంత.

మహారాణి—మీరాష్ట్రమున నుత్తమ పురుషులు లేరా?

నాయకుఁడు—కావలసి నంతమందియున్నారు. సుగంధ యుక్తములగు మల్లికాది పుష్ప సహస్రములు మా దేశములో నుండఁగా నిర్గంధ కుసుమములును పూలుపూయని ఆకులకట్ట లగు మొక్కలునే వారికి గృహాలంకారములు. వారువానికి పనివాండ్రను నియమించి జుట్లు కత్తిరింపించి శృంగారము కూర్చుచుందురు. దేహీయని యేడ్చు దిక్కులేని కుంటి గ్రుడ్డి వారికైన నెల కొకింత మొత్తమును వ్యయపఱుచుట వారెఱుఁగరు.

మహారాణి—లోకమన్న మీ కింత కంటకముగా నున్నదా ?

నాయ—దరిద్రుల బాధలు ధనికులేమి యెఱుఁగుదురు?

మహారాణి—రాజేంద్రా! ఈతనిని కొన్నినాళ్లు మన యతిథి మందిరమున నునిచి కొంతవిద్య నేర్పఁగుతూహలము వొడముచున్నది. నీవేమి తలంతువు.

వీరభ—మహారాణీ! తమయాజ్ఞను శిరసావహించు చున్నాను.

రాజేంద్రుని వాక్యము నాయకునకు ఆశ్చర్యము కలిగించెను. "వీరు అద్భుత వ్యక్తులుగా నున్నారు. రాజుగారువట్టి రాజేంద్రుఁడఁట! ఆమెమాత్రము మహారాణి యఁట! నీవేమి తలంతువని యేకవచన ప్రయోగము! తమయాజ్ఞను శిరసావహించు చున్నానని యుత్తరము. ఇంత వినయమును ఇంత భయమును ఎందులకు? రాజు ఊరక కూరుచుండి యుండఁగా ఎంతసేపును రాణిగారే ప్రశ్నలు వేయుచున్నారు. ఇది పురాణములలోని స్వర్గమును దాఁటిపోయిన క్రొత్త లోకముగాఁ గానవచ్చుచున్నది! ఏ దేశమున స్త్రీలు విస్తారముగా గౌరవింపబడుదురో ఆదేశమునకే భాగ్యాభివృద్ధులు. ఇంగ్లాండు అట్టి దేశమేకదా!" ఇచ్చోటను స్త్రీలకట్టిగౌరవమే యున్నది.

మహారాణి—మీరు కొన్ని దినములు మా సన్నిధినే యుందురని మీ నావికులకు వర్తమానము పంపుచున్నాను. మీ సంభాషణము మమ్ము హర్షాంబుధి నోలలాడించినది. మా మనవి నంగీకరించి మాయొసర్చు నాతిథ్యమును బరిగ్రహింప మిమ్ము వేఁడుచున్నాను."

నాయ—మహా ప్రసాదము.

సభ ముగిసినది. ఒక్క క్షణములో నచ్చట నున్నవారు ఱెక్కలు విదిలించుచు ఆకసమున కెగిరిరి. ఇద్దఱు పరిచారికలు నావికులను భద్రముగాఁ గూరుచుండుఁడని హెచ్చరిక చేసిరి. వెంటనే వీరితోఁగూడ వీరు కూరుచుండిన పీఠములును ఆకసమున కెగిరి పోయినవి.

---

# ఇరువది రెండవ ప్రకరణము.

---

మహారాణిగారును నౌకానాయకుఁడును సంభాషించుచుండిరి. ఆ సమయమున నొక పరిచారిక వీరభద్రునిరాకను విన్నవించెను.

మహారాణి—ఇచ్చట నొక రత్నాసనమమర్చి వారినిఁ బ్రవేశపెట్టుము.

పరిచారిక—మహాభాగ్యము (అని యాసనము నమర్చి రాజేంద్రునిఁ గొనిరానరిగెను.)

నౌకానాయకుఁడు—ఇందలి యిండ్ల యిటుకలుగూడ సువర్ణమయములు. అతులములైన రత్నములు మీ వీధుల యందు గులకఱాళ్లవలె దొఱలుచున్నవి. ఇది యే లోకము?

మహారాణి—మీది యోగభూమి. మాది భోగభూమి. భూదేవి మీకు పుణ్యములను పండును. అందలి యోగ్యతరములైన కొన్నింటిని మే మిందు అనుభవింతుము. ఇచ్చటి భూమి తటిత్స్వరూపిణియగు మహాశక్తికి ఆవాసము. ఆ దేవి క్షుద్రలోహమగు ఇనుమును సహింపదు. ఇచ్చటి భూప్రభావము భూలోకపు పైరుపంటలకు అతీతమయినది. అందువలన బంగారమే మాకు ఆధారము. భూలోకమందు సంచితమైన పుణ్యద్రవ్యమే మాకిట భోగ్యపదార్థము.

ఇంతలో వీరభద్రుఁడు ప్రవేశించి మహారాణికి సాష్టాంగ

మొనర్చెను. మహారాణి ప్రేమతో నాతని హస్తమును బట్టి లేవనెత్తెను.

మహా—రాజేంద్రా! వచ్చితివా? నేనును నీకొఱకే యెదురు చూచుచున్నాను. ఈ యాసన మలంకరింపుము. ఓడ నాయకునితో నాతని దేశవిశేషములను ముచ్చటించుచుంటిని.

వీర—భూలోకమింత శోచనీయదశయందున్నదా యని వగచుచున్నాను.

నాయ—ముఖ్యముగా ఆసియా, ఆఫ్రికాఖండములు మఱియు దురవస్థయం దున్నవి.

మహా—అనఁగా సృష్టిలోని మూఁడువంతుల మంది నరులు నరకలోకబాధల ననుభవించుచున్నారన్న మాట.

వీర—ప్రకృతిశాసనములను బుద్ధి బలముతో మచ్చిక చేసికొని నడపింపనిచో నవి మదపుటేనుఁగులవలె చెలరేఁగి భయంకరములగును. అవియే మానవేచ్ఛానుకారిణులై నప్పుడు సర్వాభీష్ట ప్రదాయినులగును.

మహా—కొతుకొలఁది గుట్టము; ప్రకృతిశాసనములు ఉత్తమ మానవేచ్ఛానుకారిణులైనప్పుడే లోకోపకృతి పొసఁగ గలదు. అవి నీచమానవులచేఁ బడినప్పుడు ప్రళయ హేతువు లగును. కల్యాణకృత్యముల కొదవవలసిన జలాంతర్గామి ఓడ లను ముంచు సాధనమగుట లేదా?

వీర—మానవ హృదయములు వివేకాధిష్ఠితములగు నప్పు డవి యీశ్వరుని పవిత్ర భద్రాసనములు. మహామోహా విష్ఠితములగునప్పుడు అహంకార మమకారాదులును, కామ

క్రోధ లోభాదులును గూడ మానవహృదయ సీమలలోనే ఇల్లు కట్టుకొని కాపురము చేయుచుండును.

నాయ—దంభాహంకారాది పూరితులగు మా నరజాతి వారికి ఇఁక మోక్షము లేదా ?

మహా—కలదు. ప్రకృతి దేవతయొక్క పరిచారికయగు విద్యాదేవి యిప్పుడిప్పుడే వివేకునితోఁ బరిచయము చేసికొనుచున్నది. ఆమెవలన మానవక్షేత్ర నివాసియగు వివేకునకు ప్రకృతిదేవితోడి దాంపత్యము పొసఁగఁగలదు. సీతారాముల వివాహమునకు విశ్వామిత్ర మునీంద్రునివలె నీ యిరువురకును వివాహమును పొసఁగించుటకై యార్ష యోగీంద్రుఁడు విశ్వ ప్రయత్నము లొనర్చుచున్నాఁడు.

వీర—దేవీ ! నేఁటి విశ్వవిద్యాలయోపన్యాసమునకు వేళకాలేదా ?

మహా—కావచ్చినది. నౌకాధ్యక్షా ! తమరుగూడ నీ యుపన్యాసమునకు రాఁగలరా ?

నాయ—తప్పక వచ్చెదను. దేవలోక వాసులకుఁ గూడ విశ్వవిద్యాలయములు కావలెనా ?

మహా—ఇవి యీ లోకమునుజేరిన మీ నరజాతి వారికొఱకు ఉద్దేశింపఁబడినవి. మా లోకములో వేఱు మానవులు లేరు.

నాయ—అనఁగా పుణ్యకర్మములుచేసి స్వర్గలోకము చేరిన నరులకొఱకు ఉపన్యాసములనుగూడ ఒపఁగుచుందురా? పురాణములలో నీ మాట లేదు.

మహా—అట్లే భావింపవచ్చును. ఇచ్చటి మా విశ్వవిద్యాలయములో నలువదివేలమంది బాలబాలికలున్నారు.

నాయ—కావచ్చును. పంచకోటి భూఖండములో చచ్చినవారి కందఱకు ఒక్కటే స్వర్గము. అనఁగా నెల్లవారికి ఒక్కటే కూడలి. అలువదివేలు మంచి సంఖ్యయే.

మహా—వీరు భూమండలమున మృతినొందిన వారుగారు. భూమండలమున నిజమైనబ్రదుకు బ్రదుకనెంచినవారు.

నాయ—నేఁడు ఉపన్యసించునది మీ దేవగురువగు బృహస్పతుల వారా?

మహా—కాదు. భూదేవులచేతనే యిచ్చట నుపన్యాసము లిప్పింతుము.

నాయ—మృతులైన మహావిద్వాంసులకు ఇచ్చట ఉద్యోగములు దొరకునన్నమాట.

మహా—లేదు. ఈ యుపన్యాసము ఆంధ్రదేశములోని పెద్దాపురమను గ్రామమున (లేచినిలిచి చేతులుజోడించి) ఆర్ష యోగీంద్రులవారిచే (మఱలఁ గూరుచుండి) నొసఁగఁబడును.

నాయ—అట్లయిన పుష్పకవిమానమెక్కి మనోవేగముతో మనమిప్పుడు పెద్దాపురము పోవలెనా?

రాజేంద్రుఁడు—అక్కఱలేదు. అచ్చటి లలితా మహాదేవిగారి విద్యాలయములోని బాలురకు ఉపన్యాసము జరుగును. మన విద్యాలయములోనికి అది వినఁబడును.

నాయ—ఎక్కడి పెద్దాపురము! ఎక్కడి స్వర్గలోకము!

వీర—మహారాణిగారి యేర్పాటులట్టివే. తీగెలు లేకుండ వార్తలంపు విధానము మీరెఱుఁగుదురా ?

నాయ—ఎఱుంగుదును. యోగీశ్వరులకు దూరదృష్టియు దూరశ్రవణమును ఉండునట!

వీర—మాలోకములోని వారికై దూరశ్రవణయంత్రములిందు నిర్మించితిమి. వార్తలు చేరినప్పుడు ఉపన్యాసములు చేరలేవా ?

నాయ—నిశ్చయము, ఏమి యద్భుతము ! ఈ యుపాయముచేత ఎచ్చట పాఠముచెప్పినను అన్ని దేశములలోను వినఁబడును.

వీర—ప్రపంచములోని ప్రతి ముఖ్యదేశములోను మా విద్యాలయములు కలవు. వేలసంఖ్యలైన మా యన్ని విద్యాలయములయందును ఇట్టి దూరశ్రవణయంత్రములు అమర్పఁబడియున్నవి.

నాయ—ఇది విద్యావిధానములలో నూతనపద్ధతి. ఒక్కఁడే ఉపాధ్యాయునిచే పదికోట్ల పాఠశాలలో ఏకకాలమున పాఠములు చెప్పింపవచ్చును.

వీర—అదియే మాయేర్పాటు. అంతియేకాదు. ఇచ్చిన ప్రతి యుపన్యాసమును శబ్దగ్రాహకములచే బంధించి ప్రతులు తీయింతుము. ఉత్తమోపన్యాసము ఒక్కనాఁడు ఒసఁగఁబడినచో నదియే ప్రతిసంవత్సరమునకుఁ బనికివచ్చును. మరత్రిప్పఁగానే ఆ యుపన్యాసము మఱలవచ్చును. లోకములోని మావిద్యాలయము కన్నింటికి ఒక్క యుపన్యాసము ఒక్కనాఁటికి చాలును.

నాయ—అట్లైనచో ఏపెద్దాపురములోనో ఒక్క యేఁడా దికి ఒక్క యుత్తముఁడైన యుపాధ్యాయుని నియమించి లోకములోని పాఠశాలలలోని యుపాధ్యాయుల నందఱను వెడలఁగొట్టవచ్చును. సంగీతపు మరయందువలె అదే యుప న్యాసమును మరలతో ఏటేట పాడించుకొనవచ్చును.

వీర—అట్లే కావచ్చును. కాని శాస్త్రములు దిన దిన ప్రవర్ధమానములు. అందువలన నిరుటియుపన్యాసము ఈయేటికి పనికిరాదు. మఱియు విద్యార్థుల సందేహములు తీర్చుటకును, వారిలో నుత్సాహము పురికొల్పుటకును ప్రతి శాస్త్రమునకును ప్రతివిద్యాలయములోను నుత్తములైన ప్రత్యేకపండితులును గావలయును. అట్టి యేర్పాటులు దేశ కాలాది పరిస్థితుల ననుసరించి నిర్ణయింపఁబడును.

రాణియు వీరభద్రుఁడును నాయకుని నాతని యిరువు రనుచరులను విశ్వవిద్యాలయోపన్యాస స్థానమునకుఁ గొని పోయిరి. ఇఱువది వేలమంది విద్యార్థులేక కాలమున నమరావతీ విశ్వవిద్యాలయోపన్యాస మందిరమున తమ నియమితాసన ముల నధిష్ఠించియుండిరి. సభాభవన మధ్యమున మెడసన్నమై మూతివిశాలమైన నాలుగు గొట్టములు ఒక బంగరు స్తంభము పైన నలువైపులను దిక్కొక్కటిగా నమర్పఁబడియుండెను. సభాభవనము రత్నపు టిటుకలతోను బంగరు పూఁతతోను నిర్మింపఁబడి నూటయేఁబది గజముల వెడలుపును నన్నూరు గజముల పొడుగును గలిగి యుండెను. తరగతుల వరుసను అందు రత్నపుకుర్చీలు అమర్పఁబడియుండినవి. వెలపొడుగు పట్టు పుట్టములను ధరించి మూర్తీభవించిన యారోగ్యమూర్తి

లో యనునట్లు పుష్టికరములైన దేహావయవములును వికాసవంతమై నిగ్గువెన్నెలలుచిలుకు మోములును, విశాలములగు నెన్నుదుళ్లునుగలిగి యా విద్యార్థులుచూడ వేయికన్నులు చాలని సొబగుతో నందుఁ బ్రకాశించుచుండిరి. పదియేండ్ల లోపు వారుగాని యిరువదేండ్లవయస్సుకు మించినవారుగాని వారిలో నొక్కరును లేరు. సభాభవనము చీమ చిటుక్కుమన్న వినవచ్చునంతటి నిశ్శబ్దముగా నుండెను. బాలికలందఱు నొక్కప్రక్కను బాలురందఱు మఱియొకప్రక్కను ఆత్రముతో గొట్టములవంకకుఁజూచుచు కూరుచుండిరి.

ఉపన్యాసమైనది. వెంటనే యాగుంపునుండి పదియేండ్ల బాలుఁడొక్కడు మహారాణికడకు పరుగెత్తుకొనివచ్చి యామెను కౌఁగిలించుకొనెను. ప్రేమతో నెత్తుకొని ముద్దిడుకొని యామె వానిని సుఖముగా నున్నావా? యని యడిగెను.

బాలు—ఉన్నాను. అమోఘశాసనిని తేనె మామిడి పండు కావలెనని యడిగితిని. లేదు పొమ్మన్నది.

మహా—ఏల లేదన్నది?

బాలు—అంత జ్వరమునుండి యిప్పుడే లేచితివి. నీవు తినరాదు పొమ్మన్నది. మహారాణితో చెప్పెదననఁగా నన్ను

చూచి నవ్వినది. నాకు పండుపెట్టినప్పుడు ఆమెను నేను అమ్మా అని యెందుకు పిలువవలెను?

మహా—నేఁడు మాయింటికిరా. నిన్ను ఎత్తుకొనియే నేను తీసికొనిపోయెదను. ఱేఁపు అమోఘశాసనికి నమస్కారముచేసి రాణి నన్ను మీకునమస్కారము చేయుమన్నదని చెప్పు.

నాయ—తెలుఁగింత చక్కగా మాటలాడు నీ బాలుఁ డెవ్వఁడు.

మహా—మనుష్యాశినుల దీవులలో చంపఁబడిన యొక పూర్ణగర్భిణి యుదరములోని గ్రుడ్డు! ఆర్య ప్రచారకునిచే సంరక్షింపఁబడినవాఁడు. ఉపన్యాసములు పాఠములు అన్నియు తెలుఁగుననే జరుగును. మఱియొకభాషను ఇందు మాటాడ నీయము. నూతనబాలురు రాఁగానే పదునెనిమిది నెలలు వారికి తెలుఁగు వ్రాయను చదువను భాషింపను నేర్పఁబడును. లేనియెడల భాషభాషకు ఎందఱేసి పండితులను పెట్టఁగలము?

నాయ—ఈ గ్రుడ్డెట్లు బ్రదికినది.

మహా—అది జగద్గురువుల కటాక్షము. ఫిజీదీవులలో నార్యమత ప్రచారము జరుగుచున్నది. మనుజులను దినునచ్చటివారు స్త్రీ శరీరములు లలితములు రుచ్యములునని యొక నిండుగర్భిణిని ఒక్కనాఁటి వారి పండుగ విందునకై కొని తెచ్చిరి. ఇది తెలిసి ప్రచారకులు ధనమిచ్చి యామెనుకొనిరక్షింపనెంచిరి. బేరము కుదురుక్షణమున కామె నఱికివేయఁబడినది. కాని ధనమిచ్చియొక్కనిముషములో ప్రచారకు లామెకళేబరమును దెచ్చి యందుండి యీ గ్రుడ్డును తీసి సంరక్షించిరి.

నాయ—ఆర్షమత ప్రక్రియలు జగదద్భుతములుగా నున్నవి. మహాప్రభావ సంపన్నములై యున్నవి. కాని అమ్మా ఈ బాలుర మొగములు చాలవఱకు భరతవర్షీయులవిగా నున్నవే ?

మహా—అవును. ఈ యఱువదివేల మందిలో ముప్పదియైదువేల యెనమన్నూట పదుముగ్గురు భారతీయులు. ఆభారతీయులలో పదునాఱువేల మున్నూట యిఱువది నలువురు నాయన్న దిక్కులేని నిర్భాగ్యులు. వీరిలో నన్నూట డెబ్బది యేార్గురు రహస్య ప్రసవమున కని వదలివేయఁబడిన దురదృష్టవంతులు. (కన్నీటితో) నాయనా ఇది భూలోక సమాచారము. స్వార్థపరులైన మీ దేశ నాయకులు ఏమిచేయుచున్నారు ? వారు పుట్టియేమి పుట్టకయేమి ?

నాయ—అమ్మా ! ఇట్టివారికిఁగూడ స్వర్గలోకములోనికి ప్రవేశము కలదా ? వీరెంత పుణ్యము చేసికొని పుట్టినారో ? ఇట్టి సత్కార్యములు సచ్చింతలు వెలయుటచేతను, ఇందు ఆఱునెలలు పగలు ఆఱునెలలు రాత్రి యగుటచేతను, ఇందలి వైభవముచేతను ఏ పుణ్యావశముననో నాకు జీవించి యుండఁగనే స్వర్గముచూచు నదృష్టము పట్టినది. ఇది స్వర్గలోకమని నేను స్పష్టముగా దెలిసికొన్నాను.

* * * *

ఆదీర్ఘ రాత్రియందు మధ్యాహ్నమైనది. అనఁగా నది మనదేశమే యగునేని యప్పుడు పగలు పంౘ్రెండు గంటల వేళయై యుండును.

వీర—నేఁడు జలాంతర్గాములు వచ్చినవా?

మహా—వచ్చినవి. (లేచినిలిచి) జగద్గురువులవారు ఈ (శ్రీ)ముఖమును బంపినారు.

వీర—(నిలిచి చదివి) నిశ్చయమే. ఆంధ్ర దేశమున కైన మనమొకింత సాయము చేయలేమా?

మహా—ఇష్టమున్నచో లోకమున కంతకును జేయ వచ్చును. గనులనుండి మనము పదివేల బారువుల బంగారమును ఇందులకై జగద్గురువుల పాదములకడ సమర్పింపవచ్చును. కాని యిట్టిదానము ప్రజలలో నుద్బోధము కలిగింపదు.

వీర—అవును. ఒరుల కష్ట నివారణమునకు మానవు లలో త్యాగశక్తిని అంకురింపఁజేయవలెను. మనమే యావత్తు వ్యయమును వహించినయెడల మానవులలో ప్రబోధము కలుగదు. అవసరము కలిగినప్పుడు ఆపద్బాంధవుల మగుటకు మనము ఎప్పుడును సంసిద్ధులమె. అయినను కార్యనిర్వహణ పద్ధతులు జగద్గురువుల వారివి.

వీర—మన నిధులు ఎంత విశాలములో మన మెఱుఁగము. పదివేల బారువలను వెంటనే తెప్పించి యీ పనికై ప్రత్యేకించి బొక్కసము చేర్చుదము. ఒక్క శుభమైన లోకమునకుఁ గావలెను.

మహా—ఒక్కొక్క యాశ్రమమునకు వేయిమంది నిరాధారులని లెక్కవేసినచో సాలుకు లక్ష రూపాయలు వారికి పుష్కలముగా చాలును. శాశ్వతనిధికి ఏఁటేట నింతవడ్డి వచ్చుటకు 16 లక్షల మూలధనము కావలెను. అట్టి నాలు

గాశ్రమములకు 64 లక్షలు అవును. తులము బంగారము ఇరువది రూపాయల లెక్కను 350 మణుఁగుల బంగారము దీనికి సరిపోవును. వెంటనే జగద్గురువులకుఁ బంగారము బంపి శాశ్వతనిధిని స్థాపింపవేఁడుము.

వీర—వికలాంగులు, ముదుసండ్రు; రోగులు,—నిరాధారులైన ఇట్టి వారినే ముందు ఆశ్రమమున చేర్తురట. ఇంకను ఎవ్వరిని చేర్పవలెనని శ్రీముఖము ప్రశ్నించుచున్నది.

మహా—జగద్గురువులు ఎట్టివారికి ఆశ్రయమీయ నిచ్ఛగింతురో అట్టి యందఱకునని విన్నపము చేయుఁడు.

వీర—ఆర్ష ప్రార్థనలు, ఆర్షాచారములు, ఆర్ష పురాణశ్రవణము—ఇట్టివి నిర్బంధములనికూడ వ్రాయవలెనా ?

మహా—అవి జగద్గురువుల వారికిని మనము వ్రాయవలెనా ? కాని యిట్టి వేయి యాశ్రమములకు వలసిన మూలధనమున కేర్పాటులు చేయఁబడినవని వారికి విన్నవింపుఁడు. అనఁగా పదిలక్షల మంది కన్నమాట.

ఆర్ష యోగీంద్రుని లేఖపని ముగియఁగానే అంతవఱకు నిలిచియుండినవారు మఱల ఆసీనులైరి.

మహా—ఈలేఖను జూడుము. భరతవర్షములో చెన్నపురి తంబుసెట్టివీధిలో నాలుగేండ్ల యొక బాలిక రెండేండ్ల తనతమ్ముని పోషించుకొను చున్నదఁట! ఎవ్వరును ఈ నిసువులకు దిక్కులేరఁట! తమ్ముఁడు మార్గమున నడచు శకటముల క్రిందికి పరువెత్తు చుండఁగా ఆత్రముతో ఈ యక్కవచ్చి వానిని లాగివేయు చుండునఁట! భుజించి వీధినిఁ బాఱవైచిన

యెంగిలి యాకులనుండి అన్నము తెచ్చి అక్క తమ్మునికి తిని పించునఁట! ఆ రాజవీధికి ప్రక్కగానున్న తూముకాల్వలపొంత వీరినివాసమఁట! ఒకనాఁడు తమ్మునికి జ్వరము వచ్చినది. ఏమి చేయవలయునో అక్కకు తెలియదు. ఏడ్చుచు నా పసిబాలిక వానిప్రక్కఁ గూరుచుండఁగా నెదుటియింటి బ్రాహ్మణుఁడు పిల్లవాఁడు మరణించునని శంకించి "నిర్భాగ్యురాలా! నీతమ్ముని ఈవీధినుండి తీసికొని పోయెదవా లేదా" అని బెత్తముతో వారి నిద్దఱను కొట్ట సాగెనఁట! దేశనాయకులగు మహా ధనికులెందఱో వీరిని నిత్యమును జూచుచు పోవుచుందురు గాని——నాటకములకును, భోగములకును బోవు ధనములో నొక్క దమ్మిడీయైన వీరి కిచ్చుటకు వారికి దరిద్రమఁట! సోదరా! మన భరతవర్షమున కెంతగతి పట్టినది!

వీర——వారిగతి యేమైనది?

మహా——ఆర్షకుమారుఁ డొక్కఁడాదారిని బోవుచు నీ దృశ్యమును జూచెను. ఆ నరపశువు వారిని ఇఁక కొట్టకుండ నివారించి, ఆ నిసువులను ఒకబండిలోఁ నెక్కించి ఆశ్రమము చేర్చెను. నేటి జలాంతర్గామములలో వారిక్కడకు చేరినారు. అదిగో ఆ పసిపాపలను జూడు. ఈశ్వరునిలీలావిలాస మెట్టిదో గాని యీ నాలుగేండ్లకూన ఆ తమ్మునికై ఎన్ని సంసార తాపత్రయముల ననుభవించినదో?

(లేచినిలిచి) ఇదిగో చక్రవర్తిని లలితామహాదేవిగారు ఈ యాజ్ఞాపత్రమును బంపినారు.

వీర——(నిలిచి పత్రమును కన్నులకద్దుకొని చదువును)

ప్రేమ—దేవిగారి కేమని మనవి చేయుదము ?

వీర—రాజపోషణము లేక మత ప్రచారకులకు విదేశ ములలో అనుకూలము లొందవవు. నేఁటిదనుక ధనము మన మిచ్చినను భారమును దేవిదేః నిర్వహించుచుండెను.

ప్రేమ—అవును. దేశదేశములలోని చక్రవర్తులకు విరివిగా కానుకలంపుచు తన మహారాజ్ఞిత్వమును వినియోగించి ఆర్య ప్రచారకులకు ప్రపంచ మెల్లెడల వసతులు రాజాశ్రయములు కల్పించుచు ఉపాయముగా నామె ఆర్య మతోద్ధరణమునకు, పాటుపడుచుండెను.

వీర—బాలజగపతి రాజ్యమునకు రాఁగానే ఆర్యమత ప్రచారమునకు రాజ్యాంగములతో సంబంధముండదు. మన రాజు పేర పరదేశ రాజులకు ఆర్య రాయబారములు పోవు. ఆర్య ప్రచారకులకు అన్యదేశములలో సంరక్షణము ఉండదు.

ప్రేమ—నాకొకటి తోఁచుచున్నది. మతప్రచారము వ్యక్తిగతము. చక్రవర్తిని మనకు ఉపాధ్యక్షు. ఉపాధ్యక్షు పదవితో పూర్వ పరిచయములను బురస్కరించుకొని ఆర్య సమాజము పేరనే కానుకలంపుచు సర్వకార్యములను ఎప్పటియట్లే నిర్వహింపుఁడని మనము ప్రార్థింపరాదా ?

వీర—అవును. అది లెస్సగా నున్నది. చీనాచక్రవర్తి కామె నేఁమని వ్రాయవలెను.

ప్రేమ—ఆర్య ప్రచారకులు విద్యాలయములు నెల కొల్పుచో ఎందఱు విద్యార్థులుందురో అన్ని యెకరముల పల్లపు నేలనుగదా చీనావా రొసఁగునది. విద్యార్థియన్న వస్త్రములకిది చాలదసియు రెండేసి యెకరముల నేల నొసఁ

గుచో నీపనికిఁ బూనుకొనుటకు ఆర్ష యోగీంద్రులు సిద్ధముగా నున్నారనియు చీనా చక్రవర్తికేల వ్రాయఁగూడదు ?

వీర—అవును. అట్లే చేయవచ్చును.

వీర—చక్రవర్తినికి జపాను ప్రభువుపంపిన విన్నపమునకేమి సమాధానము చెప్పెదము ?

ప్రేమ—యంత్ర నిర్మాతలు మనకే చాలనప్పుడు జపానువారికెక్కడనుండి తేఁగలము ?

వీర—తాను సర్వజన సోదరత్వము నవలంబించి తన రాజ్యమును ఆర్ష రాజ్య మొనర్చినచో నొకరిద్దఱను మనము పంపలేమా ?

ప్రేమ—సోదరా ? నీకు మతిపోవుచున్నది. ఎప్పుడు యంత్రనిర్మాణము కోరెనో అప్పుడే ఆరాజు ప్రకృతిశాసనముల ఈశ్వర తేజమును అంగీకరించినవాఁడు. పూర్వమత ప్రచారకుల వలె మనము నిర్బంధములు దండనలు ఏల ఏర్పఱుపవలెను. వివేకునకు విద్యాదేవి ప్రేరణచే ప్రకృతిదేవితో సంగమము పొసఁగక మానదు. అప్పుడు ఈశ్వరోద్దిష్టమైన ఆర్షమతము లోకమతము కాకమానదు.

వీర—అవును. ప్రకృతి శాసనముల ననుసరించినంత వఱకే భూతవర్తమానములలో ఏ జీవచర్యలైన ఏకార్యము లైన సిద్ధించినవి. ప్రకృతిశాసనవిరుద్ధముగా నెంతను ఎన్నడును ఏకార్యమును జరుగలేదు.

ప్రేమ—యంత్ర నిర్మాతలు మనకేచాలరనియు, విద్యార్థులనుబంపినచో విద్యలు నేర్పెదమనియు జపాను చక్రవర్తికి

వ్రాయుము.—ఈలేఖ నాకుగురువులైన శ్రీప్రకృతి నిలయాధ్యక్షుల కడనుండి.

వీర—(కూరుచుండి లేఖనుపఠించి) మఱియొక పది వేల బారువుల బంగారమన్నమాట.

ప్రేమ—వీనినిఁగూడఁజెప్పించి బొక్కసము చేర్పుము. నాకొక్కటి తోఁచుచున్నది. మన విద్యాలయ నియమములు ఇంకను జగద్వ్యాప్తములు కావింపవలెను.

వీర—అంతధనము మనకుకలదా ?

ప్రేమ—ఆదర్శములు ఆర్షములు ; ఆచరణము సర్వ జగములకును. మనము ఆర్షవిశ్వవిద్యాలయమున నవలంబించు విద్యాపద్ధతులలో మార్పులు స్ఫురింపలేదని గురువులైన శ్రీ ప్రకృతినిలయాధ్యక్షులవారికి వ్రాయుము. ప్రకృతమున పది లక్షలమంది విద్యార్థులకు అన్నవస్త్రములిచ్చి సర్వవిద్యలను నేర్పుటకు ఏర్పాటులు చేయబడినవనియు, ఆ సంఖ్యకులోఁబడి ప్రయత్నములు చేయవచ్చుననియు వారికి విన్నవింపుము.

ఇంతలో ఒడనాయకుఁడు విచ్చేసెను.

ప్రేమ—రాజేంద్రా ! కార్యాంతర నిమగ్ననై యున్న దానను. దయచేసి వీరికి మన యతిథికి విద్యాగృహములను జూపిరాఁగలవా ?

వీర—మహాప్రసాదము.

వీరభద్రుఁడును ఓడనాయకుఁడును సభాభవనమునుండి బయలుదేరిరి.

నాయ—మా దేశమునందు పైకి చూచినయెడల

ఆకాశమును నక్షత్రములును గానవచ్చును. స్వర్గలోకమునకు పైన ఆకాశము ఉండదా ?

వీర—ఆకాశము నిరవకాశము. అది లేనిలోకమే లేదు. కాని యీ ప్రదేశమంతయు 600 మైళ్లదాఁక యంత్రాధిష్ఠితమగు ప్రకృతి దేవ్యాలయమగుటచే నిందుండి వెలువడినఁ గాని యాకాశదర్శనము మనకుఁ గాదు.

నాయ—600 చదరపు మైళ్లలోను ఒక్కచోటఁగూడ ఆకాశము లేదా ? సదా దీపములులేని తావొక్కటియు నీ లోకమునఁ గానరాకున్నదే.

వీర—ఆలయపు గర్భగృహము 20 × 30 మైళ్లు.

నాయ—ముప్పదిమూఁడుకోట్ల దేవతలుగలరని శాస్త్రములు చెప్పును. వీరిగృహము లెక్కడ నున్నవి ?

రాజేం—మానవమాత్రులు అట్టిచోటి కేఁగలేరు. ఈ యంత్రముకడ నీ శరీరము తూఁచుకొనుము.

నాయ—(ఎక్కి తూఁచుకొని) 76 పౌనులు. అయ్యో ! సగమునకు సగము బరువు తగ్గిపోయితినే. పదినాళ్ల క్రింద చాల పౌనులు తూఁగితిని.

వీర—ఇచ్చట తూఁచినప్పుడు నీవు ఇంతియే తూఁగుదువు. ఇది భూదేవతాప్రభావము. నీవే కాదు. మీ మోడ కూడ తేలికయై పోయినది. కాని మీ యూరు చేరఁగానే అన్నియు మునుపటివలెనే తూఁగును.

నాయ—ఈ కానవచ్చు మందిర మెవ్వరిది ?

వీర—ఇది విద్యార్థుల పరీక్షాగృహము. ఈలోపల

నొక విద్యార్థికి ఒక్కటే శాస్త్రమున పది దినములనుండి పరీక్ష జరుగుచున్నది. చూతమురా.

నాయ—ఒక శాస్త్రమునకు పది దినములనుండి పరీక్ష యా? ఒక పరీక్షాపత్రము చాలదా? (ప్రవేశింతురు.)

వీర—అది భూలోకసమాచారము. మా విద్యాలయములు డొక్కశుద్ధిలేని బూటకపు పండితులను లోకముల కొసఁగెడి మీ భరతవర్షపు విశ్వవిద్యాలయములు కావు.

నాయ—మీ దేవతాపరీక్షలు అంత ఉదాత్తముగా నుండునా? మా భూలోకపరీక్షలకేమి తక్కువ వచ్చినది?

రాజే—నూటికి ఏ ముప్పదిమూఁడో ఏ నలువదియో వచ్చి ప్రశ్నపత్రములో ఆఱింటికి నాలుగు ప్రశ్నములు శుద్ధపూజ్యమైనను మీ మానవులు పట్ట పరీక్షాధురంధరులే. అనఁగా ఆఱు విషయము లడిగినప్పుడు ఏ రెండు విషయములో తెలిసి తక్కినవి రాకపోయినను చిక్కులేదు.

నాయ—ప్రతి విషయమును సమగ్రముగా ప్రతి బాలునకును వచ్చునట్లు చేయ నెవ్వరితరము?

రాజేం—కాఁబట్టి మీ విద్యాపద్ధతులు సంపూర్ణ జ్ఞానదాయకములు కావని మీరే యొప్పుకొనుచున్నారు. అది అటుండనిండు. సంపూర్ణ విద్యానిధియగు నొక బాలుఁడు జ్వరపీడితుఁడై వచ్చియో, న్యాయమైన యితర కారణముల చేతనో తిన్నఁగా సమాధానములు వ్రాయలేదు. వానికి వెంటనే యేదైన గతియున్నదా? కాఁబట్టి మీపద్ధతులు నిజమైన పాండితికల వారినందఱను తెలిసికొనుటకు మీకు ఉపకరింపవు.

నాయ—పరీక్షకు లేమిచేయఁ గలరు?

రాజేం——అనఁగా మీపరీక్షలు నిజమైన పాండితి కల వారినందఱను గనిపెట్టవలసినంత బాధ్యతను పెట్టుకొన్నవికా వని మీరంగీకరించుచున్నారు. పోనిండు. సంపూర్ణవిద్యావంతుఁడగు నొకపేదవాఁడు పొట్టకూటికై మీపరీక్షకు రాఁగోరుచున్నాఁడు. బాహాటముగా వానినేల పరీక్షకు రానీయరాదు? ఇట్టిరీతి పరీక్షలలోఁ దేఱిన విద్వాంసులకడ చదువుటకు ధనము లేక పోవుటచే వానికొక శిక్షయా? పోనిండు నూటికి నూరు గుణములు వచ్చిన వారినిమాత్రమే మీరేల విద్యాబోధకుల నుగా నియమింపరాదు?

నాయ——అట్టివారు లేరు. నిరంతర శాస్త్రాభివృద్ధికి ఆస్పదమైన ఈ కాలములో పాతముక్కలు వచ్చియేమి రాకయేమి?

రాజేం—దిగ్దంతులవంటి శాస్త్రాధికారులకడ విద్యనేర్చు దినములు మీభూలోకములో నస్తమించినవి. ఆబాలుని చూడుఁడు. పెద్దాపురములోని తర్కపండితుఁడు విద్యుద్యంత్ర సహాయమువలన ఈ బాలునిచే తర్కశాస్త్రములోని యావద్విషయములను ప్రశ్నలువేసి సమాధానము తీసికొన్నాఁడు. శాస్త్రజ్ఞాన పూర్ణుఁడని నిర్ధారణమైనది. అజ్ఞానము ను ఈ బాలుఁడు ఎంతవఱకు లోక విషయములకు అనుసంధింపగలఁడోయని యిప్పటి పరీక్ష ఆప్రశ్నము వినుఁడు;—

నాయ——ఆమూల జరుగునదియే పరీక్ష?

వీర——భౌతికశాస్త్రమునందలి నినాదవిభాగము.

నాయ—ప్రతిశాస్త్రమునందలియు ప్రతివిషయమును ఇట్లు ఈ బాలునిచేత చెప్పింతురా?

వీర—ఇది మీ భూలోకములోని ముప్పదియైదు గుణముల పరీక్షా ధురంధరత్వముకాదని చెప్పలేదా? శాస్త్రజ్ఞానమున కొకపరీక్ష; అజ్ఞానమెంతవఱకు జీర్ణమై సాధన కుపకరించుచున్నదో యన్నది రెండవపరీక్ష. మఱియొక మందిరమునకుఁ బోవుదము రమ్ము. ఆకానవచ్చుచున్నది కాగిదములు చేయుయంత్రము. (బయలు దేఱుచున్నారు.)

నాయ—కాగిదములు చేయుమరయా? ఇంకను నేయేమరలు ఇందుకలవు?

వీర—ప్రపంచములో నెందెందు ఏ యే మరలుకలవో అన్నియు నిందున్నవి.

నాయ—కామధేనువు కల్పవృక్షములునుగల మీ స్వర్గనివాసులును అంగళ్లుపెట్టుకొని మాభూలోకవాసుల ధనమునకు ఆసింపవలసి వచ్చినదా?

వీర—మీప్రజలు మఱల భూలోకమునకు వెడలినప్పుడు ఏమరనైన పెట్టుకొని బ్రదుకవచ్చునని చిన్నతనమునసే వారికి అన్నివిద్యలును నేర్పుచున్నాము. ఇదె యీమరలోనికి పోవుదమురా.

నాయ—విద్యార్థులందఱు ఇందేమి చేయుచున్నారు?

వీర—ఎవరు నేర్చినపనిని వారుచేయుచున్నారు. రాని దానిని చూచి నేర్చుకొనుచున్నారు.

నాయ—అందఱు విద్యార్థులును అన్ని మరలలోను పని చేయవలెనా?

వీర — ఏ దేశమునకు ఏమరలు అవసరమో నిర్ణయించి ఆవిద్యార్థులను ఆ మరలకుఁ బంపుదుము. ఒక్కొక్క మర లోను కొంతకాలము వారిని ఉంచి విషయములు నేర్పి, ఇంకొకమరకు పంపుచుందుము; ఏ దానియందు ఒకనికి అత్యంతాభిరుచి యొదవునో గమనించి యందు అభినివేశము కల్పింతుము; వానిచే పనులు చేయింతుము; తప్పులు దిద్దుదుము; క్రమ క్రమముగా శాస్త్ర రహస్యములనన్నింటిని సాంగోపాంగముగా వానికి జీర్ణమగునట్లు చేయుదుము. చెడిన యంత్రములను చెడిన యాంత్రిక లబ్ధ పదార్థములను వాని కప్పగించి బాగుచేయింతుము.

నాయ — అనఁగా మీ బాలురు సర్వ యంత్రములను నడపి కర్మ విద్యలందు ప్రవీణులగుదురన్నమాట. కాని వేఱు చదువు సంధ్యలు అక్కఱలేదా? ఒక్క మనుచరిత్రమైన చదివి ఆనందించుపాటి జ్ఞానము వారికి అక్కఱలేదా?

వీర — దినమునకు మూఁడు గంటలు అట్టి పాఠములు నేర్పఁబడును. మిగిలినకాలము ఆరోగ్య సూత్రానుసారముగా నిట్టి కర్మవిద్యలకును పరోపకారాది కార్యములకును, ఈశ్వర సాక్షాత్కార మొనర్చుకొనుటకును వినియోగింపఁబడును. వంతులప్రకారముగా వీరు తమ తమ నివాసపు కూటములలోఁ జేయు ప్రార్థనాదికమువలన వీరి యీశ్వరానుభవము విమర్శింపఁబడును. అందును ఉపాధ్యాయులు వీరికి మార్గదర్శకులగుచుందురు. ఆ కానఁబడునది మాపుస్తక నిలయము. అరువది వేలమంది బాలురకు గ్రంథములు వలయుటచే నొక్కొక్క పుస్తకమునకు వేలకొలఁది ప్రతులు ఇందున్నవి. (అటకరిగి).

నాయ—ఇంత శ్రద్ధగాను ఇంత నిశ్శబ్దముగాను ఇందఱు చదువుట అద్భుతముగా నున్నది. ఇందు రెండు వేల మందిదాఁక నున్నట్లున్నది.

రావీర—అవును. ఆ యా యంత్ర సంబంధములయిన సందేహములను దీర్చుకొనుటకును, ఉపాధ్యాయులొసఁగిన యాయా విషయములను ఆకళింపుచేసికొనుటకును, నూతన శోధనలకును,—ఈ నిలయము రాత్రి పదిగంటలదాఁక ఎప్పుడును తెఱచియే యుండును. అన్నియు తెలుంగుగ్రంథములే.

నాయ—ప్రతి సంవత్సరమును పరీక్షచేసి బాలురను పై తరగతిలో వేయుచుందురా?

వీర—అది మీ భూలోకపు పద్ధతి. గణితములో అభినివేశము కలవానికి చరిత్రమన్న తల కంటగింపవచ్చును. వానిని స్వేచ్ఛగా వదలినచో నొక్క యేడాదిలోనే గణితమున పదియవ తరగతి కర్హుఁడయ్యును, చరిత్రమున నాలుగవ తరగతికైన నసర్హుఁడు కావచ్చును. అట్టివాని గణితము నందలి శ్రద్ధను చంపివైచి అన్ని పాఠములకును నాలుగవ తరగతియందే పడవేసి యుంచుట వృద్ధికి నిరోధకము; ఘోర పాతకము.

నాయ—అనఁగా అభిరుచికల విద్యను ప్రోత్సహించి జ్ఞానాభివృద్ధి కూర్చుచుందురు.

వీర— అభిరుచి లేనివిద్యల పట్లను శ్రద్ధను గల్పించి పైకితీయఁ బ్రయత్నించుచునే యుందుము. ఆ కానవచ్చునది వినోద గృహము. అటుపోదము రండు—(పోవుచున్నారు.)

నాయ—వినోద గృహమనఁగా ఆఁటలాడు ప్రదేశమా?

వీర—కాదు. అది మఱి యొకచోట నున్నది. తాము చదివిన విద్యను ఉపయోగించి బాలురు ప్రపంచమున కత్యంతోపయుక్తమయిన నూతన పదార్థమును నొకదానిని సృష్టింపవలెను. అట్టి పనికి వలయు పరికరములన్నియు వారికొసఁగఁబడును. అట్లు సృష్టింపఁబడిన పదార్థములలో నుత్తమములైన కొన్నియిందు చేర్పఁబడినవి. (పోవుచున్నారు)

నాయ—ఈ స్త్రీ లెవ్వరు ?

వీర—కీలుబొమ్మలు. కీలుబొమ్మలన్నమాట మన భాషలో నిలిచినది గాని వానినిచేయు విద్యనశించినది. పాశ్చాత్త్యులు తెఱమీఁద నాటకము లాడింపఁగలరు గాని యంత్రపు బొమ్మలు చేయనేర్వలేదు. ఈ బొమ్మలు అభినయములు చేయుచు ఆడును ; పాడును ; భరత శాస్త్రమును సంగీత శాస్త్రమును ఇం దనుసంధానముచేయబడినవి. వీనిచే నాఁడించెదను. మీకు శృంగార పారవశ్యమో వైరాగ్యప్రబోధమో యివి కావింపఁగలవు.

నాయ—చక్రములుగల ఈ ద్రావకముల పెట్టె యెందులకు ?

వీర—ఈ భౌతిక ప్రపంచమంతయు అణువులచేఁ జేయఁబడినది. అణువులు పరమాణువుల వలనఁ గూర్పఁబడినవి. ఒక్క పరమాణువును పగులఁగొట్టితిమా అందుండి వెడలుశక్తి మీ భూలోకము నంతను గంపింపఁ జేయఁగలదు. ఇది పరమాణు భేదక యంత్రము.

నాయ—భూతదర్పణములకైనను గానరాని పరమాణువును భేదించి ఏమి లాభము ?

రాజే—భావి ప్రపంచమునకు ఆవిరిబలమును, విద్యుద్యంత్ర బలమును సులలితములు గావు. మా లోకములోని విమానాది యంత్రములన్నియు నీయణువిభేదిని వలననే నడపఁబడు చున్నవి. ఈ యంత్రమును జూడుఁడు. ఇది బయలునుండి విద్యుచ్ఛక్తిని చేయునది.

నాయ—అదియెట్లు పొసఁగును ?

రాజే—తీగెలులేని తంత్రీవార్తలు మీకుఁ దెలియునా ? అవి బయలునందలి విద్యుద్వాహినులవలన నడచు చున్నవి. అట్టి విద్యుచ్ఛక్తిని తీఁగలగుండ నిది యాకర్షించును. ఆ మూలనున్న యంత్రము జలగర్భశోధని. విద్యుత్కాంతులు మానవ శరీరములోని యంతర్భాగముల పటముల నెట్లు తీయునో, అట్లే దీనివలన జలగర్భములోని గనులను జంతువులను గనిపెట్టవచ్చును.

నాయ—ఈ యంత్రములన్నియు నిప్పుడు పనిచేయుచున్నవా ?

రాజే—ప్రారంభదశయం దున్నవి. ఉత్తమబాలురు తమ విద్యలను తెలివితేఁటలను నుపయోగించి ఇంచుకించుక ఇట్టి యంత్రసిద్ధికి లాగులాడు చున్నారు. ఏకొంచెము ఫలించినను ఈ యాగారములో నది సేఁకరింపఁ బడుచున్నది. భోజనకాల మైనది. మహారాణిగారు మీకొఱకు వేచియుందురు. పోవుదము రండు.

---

# ఇరువది మూఁడవ ప్రకరణము.

బాలజగపతి పెద్దాపురపు జగపతీంద్రరాజ్యమునకు పట్టభద్రుఁడయ్యెను. లలితామహాదేవి యిట్లు రాజ్యపరిపాలనా భారమునుండి విముక్తయై కొన్నినాళ్లు పెద్దాపురముననే వసించెను. ఆసమయమున ప్రేమవతి యామె నొకసారి తనకడకు వచ్చి తన్ను కృతార్థనుజేయుమని యాహ్వానమును పంపెను. ఆ యాహ్వానము నంగీకరించి లలితామహాదేవి దక్షిణ ధృవ యాత్రకు బయలుదేరెను. పెద్దాపురపు ప్రధానమంత్రీంద్రుని కుమారులగు సోమేశ్వరుఁడును విశ్వేశ్వరుఁడును ప్రకృతి నిలయమునందు పట్ట పరీక్షాధురీణులై యిప్పుడు అమరావతీ విశ్వవిద్యాలయమున నున్నత విద్యలందుచుండిరి. వారినిఁ జూచుటకై వారి తల్లియగు జానకమ్మయు లలితామహాదేవితో బయలుదేరెను. ప్రకృతి నిలయాధ్యక్షుఁడగు విజ్ఞానచక్షు యోగీంద్రుల నెన్ని సంవత్సరములనుండియో ప్రేమవతి యమరావతీ విశ్వవిద్యాలయమున కాహ్వానము చేయుచుండెను. ఊహాయు నుత్సాహమునే తప్ప విశ్వవిద్యాలయ కార్య విధానములు తనకుఁ గ్రొత్తలనియు, గురువులవా రొక్కసారి విద్యాలయమునకు దయచేసి సర్వమును సరియైన విధానమున వెలయించి తన పూనికను జయప్రదము గావింపుఁడనియు ప్రేమవతి యెంత దీనముగా వేఁడుకొన్నను విజ్ఞానచక్షుఁడా యాహ్వానమును ఎప్పుడును అంగీకరింపలేదు. తాను వెడలిన

యెడల ప్రకృతినిలయమును జూచుకొను వారొరులు లేరనియు, తన పనులే తనకుమించి ముంచివేయుచున్నప్పుడు కదలుటకు తీఱికయు తనకు లేదనియు నాతఁడు ప్రత్యుత్తరము లిచ్చుచు వచ్చెను. ప్రకృతి నిలయమునుండి శిష్యులు వచ్చినఁగాని విదేశములందు స్థాపించిన తన సంస్థలకు ప్రకృతి విద్యాదక్షులగు గురువులు లభింపరు గావున ప్రేమవతియు విజ్ఞానచక్షు యోగీంద్రులను రమ్మని బలాత్కరించుటలేదు. ఇప్పుడు లలితామహాదేవియు ప్రధానమంత్రీంద్రుని భార్యయుఁగూడ పయనమగుచుండుటచే ఈ ముసలితనమునందుఁగూడ ప్రకృతి నిలయాధ్యక్షులకు ఉత్సాహము పుట్టినది. వీరును వారితో బయలుదేఱిరి.

వీరు మువ్వుర ప్రయాణములును నిశ్చయమయినట్లు తెలియఁగానే ప్రేమవతి యతివినయముతో జగద్గురువుల కొక యాహ్వానమంపుచు తన్ను ధన్యను జేయుమని కోరెను. "ఆర్ష సేవకొఱకు జనించిన యుత్సాహమువలన నిట్లు జీవితమును సమర్పించుకొన్న యీ దాసురాలిపనులను తమ రొక్కసారి కన్నులఁజూచి యాశీర్వదించినయెడల నాకుఁగలుగు ధన్యత్వము మాటల కందరానిదై నన్నద్వితీయమైన యానందవార్ధిఁ దేల్చున"ని యామె దీనముగా జగద్గురువులకు విన్నవించుకొనెను. జగద్గురువులును ప్రయాణమైరి.

ప్రేమవతిచే నంపఁబడిన యొక సువర్ణవిహంగమునందు జగద్గురువులును మఱియొక దాన లలితామహాదేవియు నొండొకట విజ్ఞానచక్షు గురువర్యులును నధిష్ఠించిరి. వీరిని చుట్టుకొని యున్నారు విహంగములును జలాంతర్గాములును

సేవ లొనర్చుచుండెను. వీనియందు శాంతమహాసముద్రమును గూర్చి మొట్టమొదట ప్రేమవతి బయలుదేఱినప్పుడు ఆమె వెంటవచ్చిన బలగములోని కాంతల బంధువు లనేకులుండిరి.

పెండ్లివారివలె వీరందఱును మహాసంతోషముతో కోరంగినుండి కదలిరి. సంతోషోత్సాహములతో నిరంతర ప్రయాణములు కావించుచు వీరు దక్షిణధ్రువమునకు దారి పట్టిరి. ప్రయాణము పెండ్లియుత్సవమువలె నుండెను. ఎచ్చటఁ జూచినను ఉత్సాహమే; ఎందును పట్టరాని సంతోషమే.

అట ప్రేమవతియు విజ్ఞాన శృంఖలయు, అమోఘ శాసనియు, ప్రకృతిదేవియు, మహాలక్ష్మియు, వీరభద్రుఁడును, రామభద్రుఁడును వేర్వేఱు విమాన జలాంతర్గామి యంత్రములెక్కి వీరిని ఎదుర్కొనుటకు కాచుకొని యుండిరి. కొన్ని నాళ్లకు వీరి యాగమన దివసము తెలిసెను. అప్పుడే అచ్చట పగటిపూట యారంభమయినది. సూర్యుఁడొక్క ప్రక్కను హిమశీతలముగా తన కిరణములను ఆ ప్రదేశమునకుఁ బనుపుచున్నాఁడు. సముద్రమువీఁద నన్నూరు, ఏనూరు అడుగుల యెత్తుగల మంచుగడ్డలు తేలియాడుచున్నవి. అందందు తిమింగిలములు సంచరించుచున్నవి. మంచుగడ్డల మీఁద కొన్ని పక్షులు సంచారములు కావించుచున్నవి. సముద్రము బట్టబయలై నిర్లోకము నిర్మానుష్యమునై యున్నది. మంచుగడ్డల కావలనే ఈ మహనీయులను గలిసికొనుటకై ప్రేమవత్యాదులు బయలుదేఱిరి. వీరు మంచు కరుళ్ల సరిహద్దుచేరిన కొంతసేపటికి విహంగములనుండి యొక తంత్రీవార్త వచ్చినది.

పిమ్మట జగద్గురువులును నితరులును జలాంతర్గామ లలోఁ బ్రవేశించిరి. మునిఁగి మంచుకరుల్ల దిగువనుండి అమరావతిచేరుట సులభమార్గము. ఇట్లు నీటనుగూడ మూఁడు సువర్ణయంత్రములును ఇన్నూరు ఇతర యంత్రములును అమర్పఁబడియుండెను. వీరు నిర్ణితస్థానము చేరఁగానే మఱల నొక తంత్రీవార్త యనుపఁబడినది. ఇట్లు జగద్గురువులును పరివారమంతయును నియమిత ప్రదేశము చేరినవార్త వచ్చిన తోడనే ప్రేమవత్యాదు లెల్లరును నీట మునిఁగి పెద్దాపురపు మహత్తరుల నౌకలను జేరిరి.

ప్రేమవతి అత్యాత్రముతో లలితా మహాదేవి యుండిన జలాంతర్గామి పై భాగపు తలుపులు తెఱచుకొని యొక సొరంగమున ప్రవేశించి తలుపులుమూసి, నీటిని వెడలఁద్రోచి, క్రింది తలుపులు తెఱచి, నావలో ప్రవేశించి తలుపులుమూసి తిన్నగా లలితామహాదేవి కూరుచుండిన పీఠమువంకకుఁ బరువెత్తెను. లలితామహాదేవిని చూడఁగానే ప్రేమవతి కంపించిపోయినది. ఆమె కడుపులోని భావములు ఆకస్మికముగా రేఁగిపోయినవి. గంభీర స్వాంత యయ్యును ఆమె వానిని నిరోధింపలేక పోయెను. తప్పిన పోయిన తల్లిని చూడఁగానే ఆపదచెందిన పసికూన పరుగు పరుగునపోయి చుట్టచుట్టుకొని ఆమెను కౌఁగిలించుకొని వావిడిచి ఎట్లు ఏడ్చునో అట్లే ప్రేమవతి లలితామహాదేవిని చుట్టచుట్టుకొని బంధించివైచి ఉచ్చైస్స్వరమున విలపింప సాఁగెను.

లలిత—ప్రేమా ! ప్రేమా ? నాతల్లీ ! నాతల్లీ ? ఎన్ని నాళ్లకు చూచితినే నిన్ను ? అని లలితామహాదేవియుఁ దన

బిడ్డను గాఢముగా కౌఁగిలించుకొని ఉద్వేగముతో కంట తడిపెట్టుకొనెను.

ప్రేమవతికి ఒక్కటే యేడ్పు. దానికి విరామము లేదు. వెక్కివెక్కి యేడ్చుచుండెను.

లలిత—నాతల్లీ! ప్రేమా! ప్రేమా! ఎందుకమ్మా! యేడ్చెదవు? అని లలితామహాదేవియు రోదనముచేయ నారంభించెను.

క్షణకాలము ఒండొరులను జూచుకొని గ్రుచ్చిగ్రుచ్చి కౌఁగిలించుకొని యిరువురును విలపింపసాఁగిరి. నడుమ నడుమ లలితామహాదేవి "బిడ్డా! ఎందులకు ఏడ్చెదవు? మనము కలిసి—కొ.........గదా" యని పలుకుచు నోట మాట రాక మఱల దుఃఖించును. "అమ్మా!...అమ్మా......" అని మాత్రమే పలికి పైమాట వెడలక ప్రేమవతి రోదనము చేయును. లలితామహాదేవి పరిచారికలు వీరిని ఓదార్పఁబోఁగా దుఃఖము మఱింత హెచ్చెను గాని తగ్గలేదు. వీరిని చూచి పరివారమును ఏడువసాగెను. వారి మనోభావములు నిర్నిరోధములు.

కొంతకాల మిట్లు గడచెను. నావలన్నియు మంచుకరుళ్ల దిగువనుండి ఆర్ష విద్యాలయము వంకకు ప్రయాణము చేయుచునే యుండెను. కొంత సేఁపటికి ప్రేమవతి తెప్పరిల్లి "అమ్మా! నాతప్పు క్షమింపుము. చెప్పకుండ పాఱిపోయితిని." లలితా మహాదేవి దుఃఖావేగముతో "తల్లీ! సోదర మరణ వార్తను మఱచి నీయాటలతో పాటలతో నీప్రకృతి విద్యా వినోదములతో మఱల మానవ ప్రపంచమునఁ బడితిని.

అట్టి నాకు సముద్రములఁబడి పోవుచున్నానని వార్త నంపి భయంకర ప్రళయమును దెచ్చిపెట్టితివి. పోయినదానవు ఒక సంవత్సరముదాఁక నీక్షేమవార్తనైన పంపక పోయితివి. తల్లీ! నాతల్లీ! మఱల నాకండ్లఁ జూడఁగలిగితిని. నన్ను గట్టిగా కౌఁగిలించుకో! ప్రేమా! ప్రేమా! నాముద్దులబిడ్డా!..." అని భావములు చెలరేఁగ లలితామహాదేవి యేడ్చుచు మూర్ఛితయై పోయెను.

* * * * *

ఎల్లరును బొంతలలో దూఱి సురక్షితముగా నమరావతీ విశ్వ విద్యాలయ ముఖద్వారము చేరిరి. తమతమయాత్మ బంధువుల సందర్శన కారణమున నచ్చటి పరిచారిక వర్గములో నిట్టి భావ వైకల్యమునందని వారెవ్వరునులేరు. సముద్ర గర్భమునుండి విశ్వవిద్యాలయము లోనికిఁ గల ముప్పదిరెండు ద్వారములును వారు దాఁటిరి. మొదటిద్వారము కేవల సముద్ర జలము; రెండవద్వారము ఘోరములైన సముద్ర విషసర్ప ముల నిలయము; మూఁడవద్వారము మఱల సముద్రము; నాలవద్వారము అగాధమైన మూఁడువేల యడుగుల లోతు గల జలపూరితమైన యొకగుండము. అయిదవ ద్వారము మొసళ్లమడుగు; ఆఱవద్వారము ఇన్నూరడుగుల లోఁతుగల జలభాగము: ఏడవద్వారము తెల్ల మెలుఁగుగొడ్ల మయ

మైనది. ఇట్లు దుర్గమములైన ముప్పదిరెండు ద్వారములును యంత్ర సాహాయ్యముననే దాటఁదగియున్నవి. ఒకచోట భయంకరములైన యగ్నిజ్వాలలు; మఱియొకచోట ప్రాణాంతకములైన విషవాయువులు; ఇట్లు అనన్యసాధ్యమైన యమరావతీ విశ్వ విద్యాలయమున లలితామహాదేవియు, జగద్గురువులును, ప్రకృతి నిలయాధ్యక్షులును నెల్ల పరివారమును సురక్షితముగా చేరిరి. ప్రేమవతి మరలు త్రిప్పిననేగాని యితరు లా ప్రదేశమును చొఱలేరు; లోనివారు అందుండి వెలువడలేరు.

ఆ యెడతెగని పగటి భాగమున పెక్కుదినములు గడచెను. సుఖ సంతోషములతో నెల్లరును ఓలలాడిరి. సృష్టికి ప్రతిసృష్టి యొనర్చిన ప్రేమవతి రూపముదాల్చిన యీశ్వర కళయే యని యెల్లరకును విశదమయ్యెను. అంతతో సరిపోలేదు. అసత్యవాదులతోను, కృతఘ్నులతోను, పరహింసాపరులతోను నిండిపోయి యజ్ఞానపూరిత మైనట్టిది ఈశ్వర సృష్టి! ఈశ్వరుని దివ్యకళలు ఆ సృష్టియందు దాఁగిపోయి సామాన్య మానవులకు దుర్భేద్యములై యున్నవి. ప్రేమవతియో ఈశ్వరుని సృష్టిని జ్ఞానదీపముతో వెలిఁగించుచు ఆ జ్ఞానమును సర్వజనాధీనముచేసి అజ్ఞానమును వినాశముచేయుచున్నది.

ఒకనాఁ డీక్రింది సంభాషణము జరిగెను :—

విజ్ఞానచక్షుఁడు—ప్రేమవతీ! మాకు అన్నియుఁదెలియును. అట్లయ్యును ముద్దులబిడ్డవగు నీనోటనుండి వినఁగుతూహల మగుచున్నది. మా ప్రశ్నలకు సమాధానములు చెప్పుము.

ప్రేమ—గుర్వాజ్ఞలకు సర్వదా విధేయను.

ఈ మాటలకు జగద్గురువులును, లలితయుఁగూడ సంతసించిరి.

విజ్ఞా—ఈశ్వరుని ధనములను నీవేమి చేయుచున్నావు?

ప్రేమ—ఈశ్వరార్పణమే చేయుచున్నాను. స్థూలరూపమైన రొక్కము వెచ్చించి సూక్ష్మరూపమైన జ్ఞానమును లోకమున వాడుకలోనికి దెచ్చుటకు ప్రయత్నించుచున్నాను.

విజ్ఞా—అందొకపద్ధతి లోకములోని యెల్ల దేశముల నుండియు బుద్ధి మదగ్రగణ్యులైన యువకులను దెప్పించి యుత్తమవిద్యల నుచితముగా వారికిచ్చి వారివారి దేశముల కంపించి వేయుటగదా.

ప్రేమ—గురువర్యులు సెలవిచ్చినట్లే. కాని నాకోర్కె కోరినంతదాఁక ఫలింపకున్నది. ఇచ్చటి గురువులు తమ శిష్యులుగాని తమరుగారు. ఇచ్చటి మహత్తర విద్యావిధానమున కంతకు తాము బాధ్యతవహించి నడపించినప్పుడే ఈశ్వరుని ధనములు నిజముగా ధన్యములు.

లలిత—అందులకుఁ దాము అంగీకరించినచో కామధేనువును కల్పవృక్షమును భూలోకమున నవతరించిన వన్నమాట.

జగద్గురువులు—ప్రేమవతిమాట యుత్తమార్థ సంగ్రహమైనది. కేవల సన్యాసివైన నీకు పెద్దాపురమైనను దక్షిణధ్రువమైనను నొక్కటే. అఱువది వేలమంది యుత్తమ శిష్యులను తరింపఁజేయు భాగ్యముఁకలిగినప్పుడు నీవు పెద్దాపురమును మాత్రమే పట్టుకొని కూరుచుండుట భావ్యముకాదు.

విజ్ఞా—జగద్గురువుల యాజ్ఞ! సెలవేని ఈ యమరావతీ విశ్వవిద్యాలయమందే నేను జీవితశేషమును గడపుకొందును. ఇచ్చటి విద్యా విధానములకు నేను బాధ్యతను వహింతును.

ప్రేమ—(విజ్ఞాన చక్షువునకు సాష్టాంగముచేసి) గురువర్యా! నేఁటికి ఈ భూలోకము తరించినది! నేను కృతార్థనైతిని. ఈశ్వరుఁడే తమచేత అనుగ్రహింపఁబడినాఁడు. ఏలననఁగా ఈశ్వరప్రపంచములో తమవంటి విజ్ఞానగురువులేఁడు.

లలితా—విద్యానాథులకు నమస్కారము. ప్రకృతి నిలయాధి నియంత కటాక్షముచే నేఁటికి నాబిడ్డ ధన్యురాలైనది.

ప్రేమ—ఈ క్షణమునుండి అమరావతిలోని విద్యాసంస్థల కన్నింటికి మీరే పాలకులు.

విజ్ఞా—దేవీ! ఇంద్రజాలికుఁడనై నేను ఏలినవారిని దర్శించినప్పుడు మీరు ప్రకృతి నిలయమున కాశ్రయ మిచ్చితిరి. మీరు పోషించిన యీ బిడ్డ నేఁడు జగముల కన్నింటికి ఆశ్రయ మిచ్చుచున్నది.

జగద్గురువులు—ప్రేమా! స్వార్థ పరాయణులు కృతఘ్నులు నగు జనులచే నేఁడు జగములకు కలుగుచున్న యుత్పాతములకు నీవేమి సాధనములు పన్నితివి?

ప్రేమ—జగద్గురువులకు జయమగుఁగాత. ఆర్ష సంస్థలుగల యెల్లయెడలను సాంఘిక సేవా సమితులు ఆ పన్నులకు రక్షణము కూర్చుచున్నవి. సముద్ర విప్లవములు సంఘటిల్లినప్పుడు కరుణాదేవి యించుక సహాయ మొనరించుచున్నది. తల్లిగారు ఒనర్చు సాంఘిక సేవను జూచి దీని నారంభించితిని.

వారు అనుగ్రహించినచో వారి పనిని వారికే అప్పగింతును. వారి యాశీస్సులులే లోక కల్యాణ సంధాయకములు.

జగ—దేవీ! నీ విప్పుడు జగపతీంద్ర రాజ్యభారము నుండి విముక్తవైతివి. నీ జీవితశేషమును ఒక్క నీ రాజ్యమునకు మాత్రమేగాక లోకములోని యెల్ల రాజ్యముల యుద్ధరణమునకును నేల వినియోగింపరాదు?

ప్రేమ—తల్లీ! జగద్గురువుల యాజ్ఞను పాలించినన్ను ధన్యను జేయుము. సంఖ్యాతీతములైన సదుపాయములు నీ కను సన్నచే పెద్దాపురమునందువలెనే ఇందును సమకూరఁగలవు.

లలిత—ఇచ్చటి యుత్తమ సంఘటనలను చూచిన కొలఁదిని నాకును ఆనందము పెల్లు మీఱిపోవుచున్నది. నా భావి జీవితమును ఇట్టి లోకసేవలోనే—

జగ—ఇట్టి—లోకసేవ—అనఁగా దీనిని—బోలిన—లోక—సేవయనియా?

ప్రేమ—తల్లీ! మాట తప్పకుము. నీవు నాకడనే యుండవలయును. ఇచ్చటినుండియే జగద్గురువులవారి యాజ్ఞాను సారముగా నీవు లోకములు సేవింపుము. ఇంచుక ఆజ్ఞాపించితివా నూఱింతలుగా నీ యాజ్ఞలను పాలించెదను.

లలిత—జగద్గురూ! ఇట్టి లోకసేవ యనుటలో నా యర్థము తమకు విశదమే.

విజ్ఞా—ఇప్పుడు ఆయా సంస్థలును ప్రచారకులును కరుణయు చేయుచున్న దానికంటె నుత్తమమైన లోకసేవ యని నేను దలంచుచున్నాను.

జగ—ఇది యుగసంధికాలము. కల్యధిష్ఠితమైన యుగ

మునుండి కృతయుగములోనికి మనము లోకమును తీసికొని పోవుచున్న కాలము.

విజ్ఞా—ఇంతవఱకు మానవ హృదయముల నధిష్ఠించి నది స్వార్థపరతకు నిదానమగు మోహ దేవత. ఇఁకముందు మన సంస్థలవలన మానవ హృదయములను పాలింపఁబోవునది పరార్థ ప్రాపకమగు ప్రేమపూరితమైన విద్యా దేవత.

జగ—అవును. విద్యాదేవి సహాయమువలన మానవుఁడు ప్రకృతి దేవతను ఉపాసించినప్పుడే లోక కల్యాణము పొసఁగును. లలితా! ఈ పనికొఱకై నీవు ఇచ్చటనే నిలిచి పొమ్ము. పెద్దాపురములోని పురసేవకంటె ఇచ్చటి లోకసేవయే యధిక ఫలదము.

లలిత—జగద్గురువుల యాజ్ఞకు బద్ధురాలను.

ప్రేమ—అమ్మా! అమ్మా! నాకడనే యుండెదవా? ఇఁక నన్ను వదలిపోవుగదా! నీ సన్నిధాన ప్రభావమువలన నా దినచర్య ఇఁక నెల్లప్పుడును స్వర్గతుల్యమగును. (లలితను కౌఁగిలించుకొని ఏడ్చును.)

లలిత—పసిబిడ్డ! లోకమెఱుఁగదు. తీగవలె నన్నెట్లు అల్లుకొని పోవుచున్నదో! (ముద్దిడి) తల్లీ! ఇఁక నిన్ను విడిచి పోవను. కాని నా చేయులోకసేవ నా పద్ధతుల ననుసరించి యుండును.

ప్రేమ—ఆ పద్ధతులు నాకవసరములేదు. నీ యిష్టము వచ్చినట్లు నీవు లోకములు పాలింపుము. నీకు విధేయనై మెలఁగుట యొక్కటియే నాకు వాంఛితము.

లలిత—కరుణను నాకిచ్చివేయుము. నా యాజ్ఞాబద్ధ

నైన సంస్థలలోనియు, నవ్వుల జరుగునట్టియు నా పన్నివారణ కృత్యములను ఆపిల్ల నడపుచుండును.

ప్రేమ—తల్లీ! ఈమాట విన్నంతనే కరుణ ఉబ్బిగంతులు వైచును.

లలిత——కరుణను ఇట్లు విచారించుకొనుచు నేను మఱియొక పనికూడ చూడవలెనని యున్నది——జగద్గురువులు కటాక్షించినయెడల——ప్రేమా నీవు దీనిని——

ప్రేమ——జగద్గురువులు కటాక్షించినప్పుడును, తల్లిగారు ఆజ్ఞాపించినప్పుడును ప్రేమవతిని అడుగవలెనా? నాబరువు తీఱి నే నిప్పుడు అద్భుతమైన లఘిమావస్థలో నున్నాను!

లలిత——ఇంతదనుక లోకములోని సమస్త రాజన్యులతోను నేనే రాయబారములు జరపుచుంటిని.

ప్రేమ——సమాజమునకు ఉపాధ్యక్షులై నేఁడును అట్లే జరుపఁగలరు.

లలిత——ఈ రాజేంద్రులకు పట్టి కానుకలంపి మంచితనముతో నాలుగు సంస్థలను స్థాపించుకొన్నంతమాత్రమున ప్రేమరాజ్యము స్థాపితము కాదు.

జగ——ఆమాట నిజము. ప్రేమ రాజ్యస్థాపనము వెంటనే కావలెను.

లలిత——ఒక్కొక్క రాజేంద్రుఁడే తన రాజ్యమును ప్రేమరాజ్యము కావించికొని పరిపాలింపవలెను.

జగ——అప్పుడే లోక కల్యాణమగును.

ప్రేమ——నే నీవిషయమును ఇదివఱకే యోచించితిని. తల్లిగారిని ఆర్ష రాజ్య చక్రవర్తినిఁగా నభిషిక్తను జేయుదును.

అప్పుడు మీరు లోకరాజ్యములతో నానారాజన్య సభను గూర్చి ప్రేమసూత్రముతో వాని నన్నింటిని బంధించి వేయవలెను.

లలిత—దానికి నీవే ఆర్యరాజ్యమునకు అభిషిక్తవు కావలెను. అటువెనుక నేను నాతోల్లింటి పరిచయమువలన నొక నానారాజన్యసభను గూర్తును.

ప్రేమ—అది నే నంగీకరింపను. నాకు రాజ్యపాలన మక్కఱలేదు.

లలిత—మనము స్థాపించునది ప్రేమరాజ్యము. పెద్దల కెప్పుడును బిడ్డల యున్నతినిఁ గాంచుటయే చిత్తానందము.

జగ—అది సత్యము.

ప్రేమ—కాని జగద్గురువులు నా మాటనుగూడ నాదరింపవలెను. నాకు రాజ్యమక్కఱలేదు.

లలిత—నాబిడ్డ స్వాయముగా సంపాదించుకొన్న ఈ రాజ్యపాలన విషయమున నేను ఆమెను దిద్ది తీర్చుకొని యామె కీర్తిప్రతిష్ఠలకు ఆకాశమునంటి యుబ్బిపోవుటయే నాకు సరియైన బహుమానము.

ప్రేమ—నే నీ బరువును మోయఁజాలను. ఆజ్ఞాపింపుడు; మీసేవ చేసెదను. కాని రాజ్యమువలదు.

లలిత—నేను విరాగిణినై లోకసేవకు జీవితమును సమర్పించుకొన్న దాసిని. రాజులను ప్రేమసూత్రముతో నడపించుటకు నాకు ఒప్పునుగాని నేనే నీదేశపరిపాలనకు పూనుటకు లోకము ఒప్పునా ?

ప్రేమ—ఈవిషయము నేనును యోచించినదే. నేనును

లోకసేవకై జీవితమును సమర్పించుకొన్న విరాగిణినే. అల నాఁడు పెద్దాపురమున నేను తమతో మనవిచేసికొన్న విషయ ము జ్ఞాపకమున్నదా ?

లలిత—ఏ విషయము ? దానికేమిలే! నీవు ఆర్ష రాజ్య చక్రవర్తినివి కమ్ము. నానా రాజసంఘమును ఒక చక్రవర్తియే సమకూర్పవలెను. అట్టివాఁడు మనవాఁడై యుండవలెను. ఆసం స్థను మనవిధుల ప్రకారము నడపింపవలెను. పూర్వపరిచయ ముచే రాజులు కొందఱను నేను మనము కోరినట్లు నడపగల ను. మన ఆర్షసంస్థలు తమ దేశముల వెలసిన కారణమున అనేక చక్రవర్తులు మన యెడల సుముఖులై యున్నారు.

విజ్ఞా—మీ నానారాజసంస్థ యెట్టిది ?

జగ—అదియొకరీతి మిత్రమండలి, దేశాభివృద్ధికిని లోకాభివృద్ధికిని వ్యవహరించుటయే దానిపని. ప్రేమమే అట్టి వ్యవహారమునకు మూలసూత్రము గాఁగలదు.

ప్రేమ—ఇట్లు మిత్రమండలికి చేరిన రాజులలో ఎవ్వని పరిపాలముననైన నే శాసనమైన లోకములోని సర్వ మానవాభివృద్ధికి భంగకరముగానున్నచో నీసంస్థ యట్టివానిని నివారించి ప్రేమసూత్రముతో సర్వమానవులను నుద్ధరింపఁగల శాసనములను విధించును.

విజ్ఞా—అనఁగా ఈ మిత్రమండలిలోని రాజ్యవిధానము ఏ రెండు మూఁడు రాజ్యములలోని సర్వ మానవాభివృద్ధికో గాక, ప్రపంచములోని సర్వమానవ సముద్ధరణమునకును బనికి వచ్చునంతటి విశాలదృష్టికలదై యుండవలెను. లోకరక్షణకు శత్రు శిక్షణకునుగూడ సమర్థమైయుండవలెను.

జగ—చక్రవర్తులే ఆ సభకు సభ్యులు. జగముల కభ్యుదయము కలుగునట్లు రాజ్యము లేలఁబడుటయే ఆసభ ప్రధానోద్దేశము. నీ దేశములోని పరిపాలనావిధులు ఏ దేశపు ప్రజల యభివృద్ధి కేనియు నిరోధకములు కాకుండునట్లు ఉండవలెను. సభ్యులైన యీ చక్రవర్తులలో నెవ్వరి పరిపాలనమున నేని యే విధానమేని నా దేశమునకును నాప్రజలకును అన్యాయము కూర్చుచో నేను ఈసభయందు అట్టి నిరోధ పద్ధతులను చర్చించి తొలఁగించి లోకకల్యాణమును గూర్చుట విధాయకమగును. సర్వమానవ సముద్ధరణమగు ప్రేమ ఈసభా కార్యక్రమమునకు కీలకమువంటిది.

విజ్ఞా—జగత్కల్యాణమును గూర్చుటకు జగములోని ప్రధానరాజన్యులందఱును నిందు సభ్యులు కావలెను గదా.

జగ—అవును. అప్పుడే జగములలో ప్రేమరాజ్యము స్థిర ప్రతిష్ఠితమై సర్వమానవ సముద్ధరణము సాధ్యమగును. ముందు ప్రారంభము కానిమ్ము. ప్రేమవతి రాణి కాఁగానే లలిత యీసంస్థకు పూనుకొనును.

ప్రేమ—మీరెంత చెప్పినను నాకు చక్రవర్తినీత్వము అక్కఱలేదు. నేను శుద్ధవిరాగిణిని. ఈశ్వరుని ధనములను ఈశ్వరారాధమునకు సంపాదించుటయే నాపని.

జగ—ప్రేమవతీ ?

ప్రేమ—జగద్గురువులు ఈ సేనురాలిని నిర్బంధింపవలదు. తల్లీ ! నన్ను అనుగ్రహించి తామే రాజ్య స్వీకార మొనర్పుఁడు. చిన్నదానను. నే నీ బరువు నిర్వహింపలేను.

మఱియు నాకు రాజ్ఞీత్వాకాంక్ష కించిత్తును ఎన్నఁడును లేదని త్రికరణశుద్ధిగా ప్రమాణముచేసి చెప్పెదను.

లలిత—నీ పట్టుదల లోకరక్షణమునకు ప్రతిబంధకము. రాణివన్న పేరు నీకున్నచో నా కూఁతురు రాజ్యమను పేర నీ చాటున నేను వ్యవహరింపఁగలను. పేరునకు నీవు రాణివై యుండుము. పిమ్మటిపనులు నాకు వదలివేయుము.

జగ—ప్రేమవతీ! ఇఁక నీవు దీనిని వహింపక తప్పదు.

ప్రేమ—పరమేశ్వరుని ధనములు పరమేశ్వరుని పీఠమునకే చెందును. ఆర్షసమాజము కొఱకే నేను ధనములను గూర్తునంటినిగాని రాజ్యపదవులు నొల్లుకొను నల్పవాంఛలతోఁ గాదు. నాకు రాజ్యపదవి యక్కఱలేదు. ఈ సర్వస్వమును జగద్గురువులైన తమకు భక్తిపూర్వకముగా సమర్పింపనే నేను సంపాదించితిని. ఇప్పుడు మీ పాదపద్మములకు దానిని సమర్పించుచున్నాను.

విజ్ఞా—ప్రేమవతీ! నాఁడు పెద్దాపురమున చెప్పిన మాటనే నేఁడును నిలుపుకొనఁ జూడకుము.

ప్రేమ—మానవ సమాజాభివృద్ధికి సాధనములు కూర్చుటయే నా యాశయము. నేనును ఒకదాసినై సేవచేయఁ గోరితిని. మీరంగీకరించితిరా సరి; లేనిచో ఇంతటితో ఇఁక మీకు ప్రేమవతి లేదని నమ్ముఁడు.

జగ—సర్వస్వమును ఆర్ష సమాజమున కిచ్చి వేసితినంటివి. ఆర్ష పీఠముపేర నేను దానిని స్వీకరించితిని. ఇప్పటికి నీపని రెండువంతులైనది. కాని రాజాదరణము ఇంకను మిగిలియున్నది. అది లేక యివియన్నియు క్షణికములగును.

విజ్ఞా—రాజాదరణముననే బౌద్ధమతము లోక మత మైనది. రాజాదరణముననే విశిష్టాద్వైతాది మతములకు ఆశ్రయము పొసఁగినది. క్రైస్తవ మహమ్మదీయాది మతములును రా జాదరణముననే వ్యాప్తిగాంచినవి. రా జాదరణము ప్రేమ మతమునకు లభ్యమగుచున్నను ప్రేమవతి తన చేతులార తాను పెంచిన వృక్షమును తానే నఱకివేయనున్నది.

ప్రేమ—అట్లయిన యెడల తల్లిగారు ఆర్ష సమాజము పేర ఏల చక్రవర్తినీత్వము వహింపరాదు?

విజ్ఞా—ఆమె చెప్పిన కారణములు సమంజసములై యున్నవి. ఇట్టి పనిచేసినయెడల దేవిగారిని కూఁతు రాజ్యమపహరించిన దురాశాపాతకి యని లోకములు నిందించునేగాని యామె చెప్పు ప్రేమమతమును ఎవ్వరును హర్షింపరు.

జగ—ప్రేమవతీ! ఆర్ష రాజ్యముల పరిపాలనకు నిన్ను చక్రవర్తినినిగా నియమించితిని.

లలిత—బిడ్డా! చక్కఁగా ఆలోచించుకొనుము. చక్రవర్తినీత్వమును అంగీకరించి లోక కల్యాణము పొసఁగింపుము నాకీ రాజ్ఞీవత్వము ముమ్మాటికిని అక్కఱలేదు.

ప్రేమ—తెల్లవాఱినది మొదలుకొని సుంకములు, తగవులు, మర్యాదలు మున్నగు గొడవలలో మునిఁగి పడియున్నచో నాజీవితము వీనికే సమర్పణమగును. ఆర్ష సేవయెడల నాకుఁగల యుత్సాహము రాజ్యపాలనా విధులకు నన్ను ప్రేరేపింపదు.

జగ—కాని రాజావలంబనము మనకు ప్రకృత

సమస్య. ఇది నెఱవేఱిన తరువాత నీయిష్టము వచ్చిన రీతిని నీవు లోకోద్ధరణము కావింప వచ్చును.

లలిత—బిడ్డా! అంగీకరింపుము. జగద్గురువుల యాజ్ఞ ఈశ్వరాజ్ఞయే యని తలంపుము. నాకు నీరాజ్య మక్కఱలేదు.

విజ్ఞా—ప్రేమవతీ! ఆర్య మతవ్యాప్తికి వలసిన సమస్యలలో రాజాదరణమే ఇంకను మిగిలియున్న సమస్య. అన్ని సమస్యలను నీవే సాధించితివి. దీనినిగూడ నీవే సాధించి జగత్కల్యాణ కారిణివికమ్ము. దేవిగారిని నీరాజ్యమును హరింపఁజేసి అపనిందలకు పాలువుచ్చినానారాజసభకు అడ్డము రాకుము.

ప్రేమ—(కన్నీటితో) అమ్మా! ఏమని యాజ్ఞాపింతువు?

లలిత—(ప్రేమను కౌఁగిలించుకొని కన్నీటితో) ప్రేమవతీ! నేఁటి కాలమునకు నేను ధన్యనైతిని, చక్రవర్తినీ! నాబిడ్డా! చక్రవర్తి.........''అని మఱలమఱల పలుకుచు ప్రేమవతిని బిగ్గఁ గౌఁగిలించికొని ముద్దిడికొని లలితా మహాదేవి యానంద బాష్పములతో నామె నభిషేకము చేయుచు "తల్లీ! చక్రవర్తినీత్వము నంగీకరింపుము. నీచాటుననుండి సర్వమును నేను నిర్వహించెదను."

ప్రేమ—జగద్గురూ! తమ యాజ్ఞలను శిరసావహించుచున్నాను. నన్ను ఆశీర్వదింపుఁడు.

ప్రేమవతి సాష్టాంగ మాచరించెను.

జగ—జగత్కల్యాణ సిద్ధిరస్తు.

---

# పరిశిష్టము.

ప్రేమవతి ఆర్ష రాజ్యమునకు పట్టాభిషిక్త యయ్యెను. ఆర్షమనునది ఋషియను పదమునుండి వచ్చినది. ఆర్ష మత మనఁగా ఋషులమత మన్నమాట. జగద్గురువుల పేర ప్రేమవతి రాజ్యపరిపాలన మొనర్చుచుండెను. నిజమునకు లలితా మహాదేవియే సర్వమును నడపించు నట్టిది. ఎల్ల దేశములలోను సర్వజనప్రేమమను పేర ఆపద్రక్షణము సాధ్యమైనంత వఱకు సమాజ సేవకులచే నెఱపఁ బడుచుండెను. రాజులతో మున్ను రాయబారములు నెఱపిన వీర రామభద్రులు సంస్థాపన కార్యములు సాధించిరి. ప్రేమవతి ఇప్పుడు రాజేంద్రుల కెల్లరకును గౌరవనీయమైనది.

క్రమక్రమముగా సర్వ మానవ సముద్ధరణమగు ప్రేమ మను కీలకముతో నానారాజసభ స్థాపింపఁబడెను. "తన రాష్ట్రమునందలి మానవోద్ధరణమున కచ్చటిరాజు పూనుకొనునప్పుడు ఆతనికి అన్యరాష్ట్రములలోని చట్టములు నిరోధములు కారాదు. అట్లే తనరాష్ట్రములలోని చట్టములు అన్యరాష్ట్రములలోని మానవుల యభివృద్ధికి భంగకరము కాఁగూడదు. రాజ్యపాలనము సర్వ మానవ సముద్ధరణమునకుఁ గాని స్వోదర పోషణముకాదు." ఈ నియమములు నానారాజసభయందు అంగీకరింపఁ బడినవి. ఆశియాఖండములోని చక్రవర్తులే ఈసభకు మొదటిసభ్యులు.

ఈరీతిగా ప్రేమవతి లోకోద్ధరణమునకు పూనుకొనెను. నానారాజసభాసభ్యుల రాష్ట్రములలో ఎందుఁజూచినను విద్యాశాలలే! ఎందుఁగాంచినను యంత్రశాలలే! ఎందుఁజూచినను

ప్రేమపూరితములైన ఆపన్నుద్ధరణ క్రియాకలాపములే. అమరావతీ విశ్వవిద్యాలయము పండితులను, జగద్గురువులు ప్రచారకులను ప్రసాదింపఁగా, నిర్బంధవిద్యయు, ఆపన్నులను రక్షించుటయు రాజ శాసనములుకాఁగా, జగద్వ్యాప్తమైన ప్రేమమే జీవితాదర్శము కాఁగా, క్రమముగా లోకములు అంధకారము నుండి జ్ఞానజ్యోతిని బడయ దొరకొన్నవి. భూములు లేనివారుగాని అన్నవస్త్రములకు వెలితైనవారుగాని, అరక్షకత, రోగము, ముసలితనము మున్నగు వానివలన దిక్కులేక క్రుగ్గిపోయినవారుగాని యీ రాజ్యములలో లేరైరి.

అప్పుడు జగద్గురువులైన యార్షతీర్థులవారు ఈక్రింది సందేశమును సర్వమానవ హృదయములందును సువర్ణాక్షరములతో లిఖించిరి:—

1. "ప్రకృతి శాస్త్రములే మానవ జీవితమునకు సర్వ విషయములను ప్రథమ ప్రమాణములు.
2. ప్రకృతిశాస్త్ర జ్ఞానసంపాదనమే నిజమైనవిద్య.
3. ప్రకృతి యంతయు మానవునకు బంటు; శాస్త్రజ్ఞానమే ప్రకృతిని నడపించు సాధనము.
4. ప్రపంచము నిత్యము; మానవ జీవితము ధ్రువము.
5. సర్వమానవ సముద్ధరణమున కనుకూలించు జీవితమే ధర్మమునకు నిదానము.
6. అవ్యాజమైన సర్వమానవప్రేమమే జీవితాదర్శము.
7. ఈశ్వరుఁడే జగన్నియంత.



కేసరీ ముద్రాక్షరశాల, చెన్నపురి.

# ఆంధ్ర సరస్వతీ గ్రంథమాల.

## నిబంధనలు

1. చందాదారులు రు 1-0-0 కి తక్కువగాని పూర్వ గ్రంథ మొకటి కొనవలెను.

2. ఇందు ఏడాదికి ఆఱు పుస్తకములు వెలువడును. ఒక్కొక్క పుస్తకము 200—300 పుటలకు మించదు. దానివెల చందాదారులకు రు 1-0-0 ఎప్పుడైన ఒక గ్రంథము 300 పుటలకు మించు నేని అందలి పైనూరేసిపుటలకు రు. 0-5-0

3. మూఁడు తరగతులుగా చందాదారులు లిందు చేరవచ్చును. (1) ఇందు ప్రచురించపఁబడు ప్రతి నూతన గ్రంథమును గొనువారు మొదటి తరగతి చందాదారులు. ఒక సంవత్సరములో వారికిఁ బంపఁబడు గ్రంథములవెల రు 6-0-0 లకు మించదు. మఱియు వారికి ఒక అనుబంధ గ్రంథమును ఉచితముగా పంపఁబడును. (2) ఇందలి నవలలుతప్ప తక్కిన విజ్ఞానశాస్త్రములు (ప్రకృతి శాస్త్రములు) మున్నగు నన్నిగ్రంథములను కొనువారు రెండవతరగతి చందాదారులు, ఒక సంవత్సరములో వారికిఁ బంపఁబడు గ్రంథముల వెల రు 3-0-0 మించదు. (3) ఇందలి నవలలు కథావళులు చరిత్రములు మున్నగు మిగిలిన గ్రంథములను మాత్రమేకొనువారు మూఁడవతరగతి చందాదారులు. ఇందు ఒక సంవత్సరములో, రెండునవలలును ఒక చరిత్రగ్రంథమును వెలువడును. ఒక సంవత్సరములో మొత్తముమీఁద వారికిఁ బంపఁబడు గ్రంథముల వెల రు 3-0-0 మించదు.

4. చందాదారులు ఏతరగతికి చేరినను గూడ వారికిఁ బంపఁబడు గ్రంథములకన్నిటికిని అగు పోస్టేజీమున్నగు కర్చులను వారే భరింపవలెను.

5. ఒక సంవత్సరముచందా ముందు పంపువారికి అయేట వారికిఁ బంపవలసిన గ్రంథముల పోస్టుకర్చులను గ్రంథమాలయే వహించును. రిజిస్టరీకి రు 0-3-0, మణియార్డరుకు రు 0-2-0 బుక్కుపోస్టు పదేసి తులాలకు 0-1-0 గానున్న ఈకాలములో ప్రతి వి. పి. కి చందాదారులకు దాదాపు 0-8-0 పోస్టుకర్చులే అగును. ఇదియే యేడాదికి వారికి 3-0-0 కావచ్చును. కావున ముందుగా ఒక సంవత్సరము చందాపంపినచో పోస్టుకర్చులు గ్రంథమాలయే భరించును.

## ఏది నిజమైన త్యాగము ?

ఆంధ్ర సరస్వతీ గ్రంథమాలకు చందాదారులై

జాత్యభివృద్ధికిఁ దోడ్పడుట.



## ఏది గౌరవనీయమైనది ?

భాషకు వలసిన పాశ్చాత్య విజ్ఞానము

నంతను ఆంధ్రమునకు దెచ్చుట

కుపకరించు మహాపురుషు

లలోఁ జేరుట





# శ్రీ ఆంధ్ర సరస్వతీ గ్రంథమాల

## తెలుఁగు భాషయు

తనకుఁగల భాషా సంబంధమైన

బాధ్యతనునిర్వహింప వలయునేని ఎల్ల

పరిశ్రమలకును, వృత్తులకును, వ్యాపారములకును

వలసిన విషయములు.

తెలుఁగుననే మనవారు చదువుకొనుభాగ్య

దినములు ఆంధ్రుల త్యాగమువలన ఆంధ్రభాషకు రావలెను.

# *Sri Andhra* Saraswati Grandha Mala

*(No Language is complete without Scientific Literature.)*

If our Indian languages should function healthily for the growth and welfare of our communities, they must be raised to the level of the languages of the West and furnish every kind of information in all branches of knowledge. I may perhaps be pardoned when I say that in this sense no Indian language is functioning as such, nor would it be able to do so until a movement is set on foot and the patriotic minds of our country are made to realise how wanting we are in things vital to modern life. I most respectfully and humbly beg of you to imagine, where we are in matters of Scientific Literature? What is the place that you would give to Telugu or for a matter of that to any Indian language in this respect, as compared with the Western Languages? Are we to own that Telugu Language is eternally hopeless? Are we to advise our people to learn some language better than Telugu for matured culture?

I do not for a moment believe that Indian languages are never fitted for scientific expression or must for ever be doomed to lie neglected like that. Rather, I would respectfully appeal to you to see if a few centuries ago any language in the world was adapted to scientific expression. Growth and development are the order of creation and it is the baby born helpless that grows in time—when carefully tended—to a full man. We have to tend our language as we do a baby.

One only thought pervades my mind. Telugu must rise to the level of the best equipped languages of the world. Telugu must one day become a language that needs nothing from outside, rather must be complete in every branch of modern culture. I am not unaware of the difficulties at first attempts in this direction, but begin we must and then begins a new life that grows with every effort; that develops even as the laws of evolution have indicated how growth proceeds.

I therefore come to you to seek your valued support. I beg of you to leave a corner in your mind for thoughts like these. If you are able enough to give your mite, kindly do so. Even a *kind word* from you to some of your friends means a lot for a great cause.

The conditions are simple. It is intended to revive for this purpose, the *Andhra Saraswati Grandhamala* that was discontinued during war time. As scientific publications are not light-reading and first dabblings in this direction are necessarily so, however efficient the writers may be, and as it also a fact that our *dear Language* is yet wanting in types of literature that all civilised nations possess in abundance, it is intended to publish three books on Science per annum side by side with light literature like Novel, Story, History, etc., and in new ways and forms required for us. To suit our conditions it is intended to issue six publications per annum, each costing **One Rupee** plus postage. For other conditions please see the succeeding pages.

The following Sciences are at present contemplated and competant Scholars have been at work or are being requested for it. These are Physics, Chemistry, Botany, Economics, Cooperation, Electrical Engineering and some manufactures based on applied Chemistry. The treatment will be popular in the first pages of each book, and no economy of space is contemplated, as Scientific Thought is to become adaptable into the language. The later treatment will slowly raise the matter to the B.A. Standard. The light Literature need not be detailed,

I shall be glad if you can kindly become a permanent subscriber and also encourage your friends to join the movement. The necessary form is annexed.

124, Vellala Street,
Vepery, Madras,
8—6—1933.

**T. RAJAGOPALA RAO.**

# ఆంధ్ర సరస్వతీ గ్రంథమాల.

124 వెల్లారివీధి—వేపేరి చెన్నపురి,

## విజ్ఞప్తి

మన యాంధ్రుల జనసంఖ్య 26 కోట్లు, భరతవర్షమున జనసంఖ్యా చేత మనము తృతీయస్థానము నాక్రమించియున్నాము. హిందీ మాతృభాష గాఁగల జనులసంఖ్య 90 కోట్లు; వంగభాషను మాటాడువారి సంఖ్య 50 కోట్లు. ఆంధ్రమును మాటలాడువారు 26 కోట్లు.

మనదేశము దరిద్రస్థితియందున్నది. ఆంధ్రు లనేకులు పరువు ప్రతిష్ఠలను జూచుకొను దశలో లేరు. లక్షలకొలఁది యాంధ్రులు పొట్టను జేతపెట్టుకొని కూలినాలిచేసి బ్రదుకుటకై విదేశములకు వలస పోయి యున్నారు. నేఁడును గతిలేక అసంఖ్యాకముగా పోవుచున్నారు.

ఉన్నవారన్ననో తెలుఁగు మీఱిపోయినారు. మనము ప్రాచీన వృత్తులను పోఁగొట్టుకొన్నాము. నవీన వృత్తులు నేర్చుకోలేదు. నాగరకతకు లొంగిపోయి చిన్నచిన్న వస్తువులకుఁగూడ మనము పరరాష్ట్రముల మీఁద నాధారపడియున్నాము. ప్రాఁతవి పోయినవి. క్రొత్తవి మనకు రావు. మనకు చేతఁగాదు.

దేశము భాగ్యవంతమగుటకు కృషి వాణిజ్యాదులే ప్రధానములు. పరలోక సంబంధమైన వాఙ్మయము విఱివిగా తెలుఁగులో కలదు గాని యిప్పుడు మనము ఉన్నది ఇహలోకము. ఈ ఇహలోక జీవనమును వెడలఁబుచ్చుకొనుటకు తెలుఁగుభాష తెలుఁగువారికి ఉపకరించుట లేదు. బ్రతుకునట్టి తెలివుచూపు విజ్ఞానము మన భాషలో నున్నయెడల మన మింత దరిద్ర దశయందుండి యుండము. కాఁబట్టి నేఁటికైన అట్టి విజ్ఞానమును మనము మన భాషయందు వెలయింపవలెను. ఆంధ్రులు ఏ విషయమునఁగాని అన్యభాషల పొంతపోనక్కఱ లేకుండునట్లు భోగ భాగ్యావహములగు విజ్ఞాన విషయముల నన్నింటిని ఆంధ్రభాషయే మనకు సమకూర్చినచో మన మెంత ధన్యులమో కదా. వెదురు బద్దకు కీలుపూసి జపానువారు నాలుక గీసికొను బ్రాఁటియాకు క్రింద మనకు అమ్ముచుండఁగా అంతపాటి బుద్ధివికాసము ఆంధ్రులకు లేకపోలేదా?

కాని ఐహిక విజ్ఞానశాస్త్రములు మనకు లేవు. అవిలేక మనము భాగ్యవంతులము కాలేము.

భోగభాగ్యావహములగు యాంత్రికవిద్య విద్యుద్రాసాయనికాది భౌతికశాస్త్ర శతములు మన కింకనులేవు. పట్టపరీక్షా ధురీణులు వేలకు వేలు ఉన్నారు. కాని శాస్త్రగ్రంథము లన్నియు తెలుఁగున వెలయు లేదు. ఇది ఆంగ్ల విద్యాధికులైన యాంధ్రభాషా వేత్తలే పూనుకొన వలసినపని. అత్యంత వ్యయప్రయాసలతోఁ గూడిన యీ కష్టకార్యమును అతి సాహసముతో మేము పూనుకొంటిమి. ఒక్కొక్క ప్రకృతి శాస్త్రమునకు అచ్చుకర్చులే డాఁదాఁపు రెండువేల రూపాయలు కావచ్చును. ఏలననఁగా క్లిష్టములైన శాస్త్ర విషయములు సుబోధమగుటకై ఆయా పదార్థములు యంత్రములు మున్నగువానికి వలసిన చిత్రపటములు విరివిగా నిండుండవలెను. ఒక్కొక్క గ్రంథమునకు రెండుమూఁడు నూరుల చిత్ర పటము లుండునేని బొమ్మలకే పంద్రెండు లేక పదునైదువందల రూపాయలగును. అనఁగా నొక ప్రకృతి శాస్త్రగ్రంథమును ముద్రించుటకు డాఁదాఁపు రెండు వేలగును,

ఇప్పటికింకను చావకుండ మిగిలియున్న మన ప్రాచీన వృత్తులను నూతనజ్ఞాన పద్ధతులతో మనము పునరుద్ధరించుకోవలెను. క్రొత్తవానిని సృష్టించుకోవలెను.

ధనములేక యేకార్యమును సాఁగదు, అందువలన గ్రంథమాల రూపమున ప్రచురణము జరుగుచున్నది. ఈ గ్రంథమాల షరతులు పై పుటలో చూడవచ్చును.

అఱవలు 5 దిన పత్రికలను పోషించుచున్నారు. వంగభాషలో కొన్ని పత్రికలకు 25,000 మంది చందాదారులు కలరు. మరాఠీ పత్రికల కింకను నెక్కుడు వ్యాప్తియున్నది. ఆంధ్రులు భాగ్యవిషయమున వంగద్రావిడ మహారాష్ట్రులకు తీసిపోయిన వారుకారు.

మీరును వెంటనే చందాదారులై మీ మిత్రులను గూడఁ బ్రోత్సహించి ఈమహత్కార్యమునకు నిజమైన చేయూఁత నొసఁగ వేఁడెదను. లేదా ప్రచారమైన నొనరించి యాంధ్రమాత నుద్ధరింపఁ బ్రార్థించెదను.

మదరాసు
8-6-1933

ఇట్లు విధేయుఁడు
తేకుమళ్ల రాజగోపాలరావు.

# ఆంధ్రసరస్వతీ గ్రంథమాల.

124 వెల్లారివీధి : పరశువాకము—వేపేరి—చెన్నపురి.

స్థాపితము : 1909.

నవలలు : కథావళులు—ఆంధ్రాది దేశచరిత్రలు—విజ్ఞానశాస్త్రములు—ఆంధ్రమున నింకను వెలయవలసిన సర్వవిధములైన గ్రంథములు—200—300 పుటలకు మించకుండ—ఏడాదికి ఆఱు గ్రంథముల చొప్పున ప్రకటింపబడును.

చందాదారులకు చౌకవెలలు. ఇతరులకు ఆవెలలకు దొరకవు.

(నవలలు మాత్రమే వలయువారు మూఁడవతరగతికి చేరి అవిమాత్రమే వలయునని తెలుపవలెను.)

నిబంధనలు

1. చందాదారులు ప్రవేశరుసుముక్రింద రు 0-4-0 చెల్లింపవలెను.

2. ఇందు రెండేసిమాసములకు ఒక్కొక్క పుస్తకము వెలువడును. అది 200—300 పుటలకు మించదు. దానివెల చందాదారులకు రు 1-0-0 ఎప్పుడైన ఒక గ్రంథము 300 పుటలకు మించునేని అంపిలిపై నూరేసిపుటలకు రు. 0-5-0

3. మూఁడు తరగతులుగా చందాదారు లిందు చేరవచ్చును. (1) ఇందు బ్రచురింపఁబడు ప్రతి నూతన గ్రంథమును గొనువారు మొదటితరగతి చందాదారులు. ఒక సంవత్సరములో వారికిఁ బంపఁబడు గ్రంథముల వెల రు 6-0-0 లకు మించదు. మఱియు వారికి ఒక అనుబంధ గ్రంథమును ఉచితముగా పంపఁబడును. (2) ఇందలి నవలలుతప్ప తక్కిన విజ్ఞానశాస్త్రములు (ప్రకృతి శాస్త్రములు) మున్నగు నన్నిగ్రంథములను కొనువారు రెండవతరగతి చందాదారులు, ఒక సంవత్సరములో వారికిఁ బంపఁబడు గ్రంథముల వెల రు 3-0-0 మించదు. (3) ఇందలి నవలలు కథావళులు చరిత్రములు మున్నగు మిగిలిన గ్రంథములను మాత్రమే కొనువారు మూఁడవతరగతి చందాదారులు. ఇందు ఒక సంవత్సరములో, రెండునవలలును ఒక చరిత్రగ్రంథమును వెలువడును. చరిత్రగ్రంథము అక్కఱలేదని ముందుగా తెలుపువారికి దానికిబదులుగా నొక కథావళి

గాని మణియొకనవలగాని పంపఁబడును. ఒక సంవత్సరములో మొత్తము మీఁద వారికిఁ బంపఁబడు గ్రంథముల వెల రు 3-0-0 మించదు.

4. తమ తరగతికి సంబంధించినదై క్రొత్తగా వెలువడెడి యిందలి ప్రతి పుస్తకమును ఆచందాదారులు తప్పక పుచ్చుకొనవలెను. ముందుగా ఒక సంవత్సరము చందా చెల్లించినవారికి అది ఆ చందాకాలములో అన్‌రిజిస్టర్డు పార్శ్వలుగా పంపఁబడును. చందాచెల్లింపనివారికి అది వి. పి. చేయఁబడును.

5. చందాదారులు గ్రంథమాలలోని యితర పుస్తకములు కోరుదురేని వారి కవి చందాదారులవెలకే ఈయఁబడును. కాని యే పుస్తకమును ఒక్క ప్రతికంటె అధికముగా ఆ ధరకు వారికి ఈయఁబడదు.

కోరిన చందాదారులకు మాత్రమే అనుబంధ గ్రంథములు వానివెలలకు పంపఁబడును

7. చందాదారులు ఏతరగతికి చేరినను గూడ వారికిఁ బంపఁబడు గ్రంథముల కన్నిటికిని అగు పోస్టేజీ మున్నగు కర్చులను వారే భరింపవలెను.

8. ఒక సంవత్సరముచందా ముందు పంపువారికి ఆయేట వారికిఁ బంపవలసిన గ్రంథముల పోస్టుకర్చులను గ్రంథమాలయే వహించును. రిజిస్టరీకి రు 0-3-0, మణియార్డరుకు రు 0-2-0 బుక్కుపోస్టు పదేసి తులాలకు 0-1-0 గానున్న ఈకాలములో ప్రతి వి. పి. కి చందాదారులకు దాదాపు 0-8-0 పోస్టుకర్చులే అగును. ఇదియే యేడాదికి వారికి 3-0-0 కావచ్చును. కావున ముందుగా ఒక సంవత్సరము చందాపంపినచో పోస్టు కర్చులు గ్రంథమాలయే భరించును.

ఒకొక్కక్క ప్రకృతి శాస్త్రగ్రంథము ముద్రించుటకు రమారమి రు 2,000-0-0 కావచ్చును. రెండుమూఁడువందల చిత్రపటములు, త్రివర్ణాది చిత్రములు ప్రకృతి శాస్త్ర గ్రంథములలో ఉండవలసి వచ్చుటయే యిట్టికర్చుకు హేతువు. కావున నెల్లవారును భాషకు అత్యంతావశ్యకములగు ఈ ప్రకృతిశాస్త్ర గ్రంథములను మఱవకుందురుగాక.

మదరాసు.
1-11-1932

ఇట్లు బుధవిధేయుఁడు,
తేకుమళ్ల రాజగోపాలరావు.

# దరఖాస్తు నమూనా.

## ఆంధ్ర సరస్వతీ గ్రంథమాల.

124 వెళ్లారి వీధి—పరశువాకము—వేపేరి—చెన్నపురి.

గ్రామము.

తేది.......

అయ్యా,

తమ నిబంధనలుకల ప్రత్యేక కరపత్రమును జూచితిని. నన్ను తమ యాంధ్ర సరస్వతీ గ్రంథమాలకు..................తరగతి చందాదారునిఁగాఁ జేర్చుకొని యందుఁ బ్రకటింపఁబడెడు నా తరగతిచేరిన క్రొత్తగా వెలువడు ప్రతి గ్రంథమును ఆ ప్రత్యేక పత్రములోని నిబంధనలలోఁ దెలిపినరీతిని నాకుఁ పంపుచుండ వలెను. *(రాఁబోవు గ్రంథమును సంవత్సరము ఒక చందాకు నాకు వి. పి. చేయవలెను.)

దస్కతు..........................

పేరు..........................

పైవిలాసము......................

..............................

(స్పష్టమగు నక్షరములతో)

---

* ఈ వాక్యమును అనుకూలమునుబట్టి కొట్టివేయవచ్చును. పోస్టేజీ కొఱకై యీ సావకాశము ఏర్పడినది.

# మాకు గ్రంథములు పంపు విధానము.

1. దేశోత్తేజకమగు విజ్ఞానమును గూర్చు గ్రంథములను వ్రాసిన వారు మాకు వానిని పంపవచ్చును.

2. పంపఁబడు పుస్తకములు కాగిదమునకు ఒక్క ప్రక్కను మాత్రమే స్పష్టమగు విడియక్షరములతో వ్రాయఁబడవలెను. మఱియు, వానిని తిరిగి గ్రంథకర్తలకు పంపుటకు వలసిన తపాలాబిళ్లలుగూడ ప్రతిగ్రంథముతోను పంపఁబడవలెను.

3. మాసంస్థ అట్టిగ్రంథమును అంగీకరించునేని అది ఈ గ్రంథ మాల యందొక గ్రంథముగా వెలువడును. గ్రంథమునందు సర్వవిధము లైన మార్పులను సవరణలను చేయుటకు గ్రంథమాలాధికారికి సర్వాధి కారములు కలవు.

5. మొదటి ముద్రణము గ్రంథమాలకే చెందును. కాని గ్రంథ కర్తకు 250 ప్రతులు ఒసఁగఁబడును. తరువాత వలసినప్పుడెల్ల గ్రంథ మాలాధికారి దానిని పునర్ముద్రణము చేయించుకొనవచ్చును. గ్రంథ కర్తయు వలసినప్పుడెల్ల తనగ్రంథమును తనకర్చుతో పునర్ముద్రణము చేసికొనవచ్చును. అనఁగా మొదటి ముద్రణము తరువాత గ్రంథమును మఱల ముద్రించుకొను నధికారము గ్రంథకర్తకుఁగలదు. అట్లే గ్రంథ మాలాధికారికిని గూడ గలదు.

5. గ్రంథకర్త తన గ్రంథమున మార్పులేవేని చేసినచో వానికి గ్రంథమాలాధికారి సమ్మతి పొందవలెను. అట్టియెడ అట్టిమార్పులు గ్రంథమాలాధికారియు తాను ముద్రించు ముద్రణములలో చేర్చికోవచ్చును.

6. ప్రకృతమున చేతిపనులమీఁదను కృషీవాణిజ్యాదులమీఁదను, ప్రకృతిశాస్త్రముల మీఁదను చాలగ్రంథములు వలసియున్నవి. అట్టి గ్రంథములు వ్రాయఁగలవారిని భాషాసేవకై మేము పురికొలుపు చున్నాము.

13-6-1933
వేపేరి, చెన్నపురి.

తేకుమళ్ల రాజగోపాలరావు,
ఆంధ్ర సరస్వతీ గ్రంథమాలాధికారి.

# ఆంధ్ర సరస్వతీ గ్రంధమాల.

## ప్రకటన పద్ధతులు.

1. ఇందలి ప్రతిగ్రంథము చివరకు కొన్ని ప్రకటనలు వేయుటకు తావుగలదు.

2. ఒకసారి ఒక పుట ప్రకటన వేయుటకు చార్జీ రు. 8-0-0; అఱపుటకు రు. 5-0-0; అంతకన్న తక్కువ ప్రకటనలకు వీలులేదు.

3. మా ప్రకటనను ఎడతెగకుండ తమపత్రికలో ఉచితముగ వేయు పత్రికాధిపతుల ప్రకటనలు మాగ్రంధమాలలోని ప్రతినూతన గ్రంధము చివరను ఉచితముగా ప్రకటింపఁబడును.

షరా—ఈగ్రంథమాలలోని గ్రంథములకు కలకాలము విలువ గలదుగాన ఇందలి ప్రకటనములు చాల లాభకరములు.



రాఁబోవు గ్రంథము.

ఇంపగు కథగలిగి ప్రకృతిశాస్త్ర జ్ఞానమును మానసోల్లాసకరముగా వెదఁజల్లుచు ప్రబోధము పుట్టించు వినోదకరమైన నవల.

# విహంగయానము.

### ఆంధ్రభాషలోని ప్రకృతిశాస్త్ర సంబంధమగు

### మొట్టమొదటి నవల.

ప్రకృతిశాస్త్ర జ్ఞానమును సామాన్య జనుల హృదయమున కెక్కించు నుత్తమ నవలలు ఫ్రెంచి, జర్మనీ భాషలలో మాత్రమేకలవు. వాని ప్రబోధమువలన నాదేశములలో ప్రకృతిశాస్త్రవేత్తలును, పరిశోధకులు అనేకులైనారు. ఆదేశములోని జ్ఞానము ప్రతిదినమును మానవోపయుక్తములగు క్రొత్తక్రొత్త వింతలకు దారిచూపుచున్నది. అందువలననే ఇంగ్లాండు, అమెరికాలు గూడ నిట్టి జ్ఞానమునకై ఫ్రెంచి, జర్మను భాషలను అభ్యసించుచున్నవి.

ఇప్పుడే వెలువడినది.

# ఆంధ్ర దేశపు చరిత్రము.

## మొదటి భాగము.

తెలుంగులే సాంస్కృతికుల కంటెను తమిళులు మున్నగువారి కంటెను ప్రాచీనులనియు, తమిళులు మున్నగువారు తెలుఁగువారినుండి చీలిపోయిన యుటీవలి యంతశ్శాఖలనియు నిరూపించు రాజగోపాలరావు గారి యుపోద్ఘాతము గలదు.

వెల చందాదారులకు రు. 1-0-0. ఇతరులకు రు. 2-0-0.

## కొన్ని పండితాభిప్రాయములు.

**From Rao Bahadur T. Bhagavantam Gupta Garu, Retired District Collector and Telugu Scholar and Poet.**

I have read your introduction to the History of the Andhra country with great pleasure. Much credit is due to you to the discovery of the connection between the Turanian and Scandanavian languages and **tbis is the greatest discovery after the discovery of the relation between Sanskrit and the Latin Languages of Europe.**

2. సుబోధనీపత్రిక. నెల్లూరు (20-2-33) ఆంధ్రదేశ చరిత్రము - ప్రథమభాగము - ఇది మదరాసులో పునరుద్ధరింపఁబడిన ఆంధ్ర సరస్వతీ గ్రంథమాలవారి ప్రథమ కుసుమము. శ్రీయుత తేకుమళ్ల రాజగోపాల రావు పంతులుగారు ఆంధ్రలోకమునకు చిరపరిచయులు. వారి సంపాద కత్వమునందీగ్రంథమాల నడపఁబడు చున్నది. ఈగ్రంథమునకు పీఠిక గా శ్రీయుత తేకుమళ్ల రాజగోపాలరావు పంతులుగారు తెలుంగు లెవ్వరో వారి యాదిమభూమి యెద్దియో పాశ్చాత్యశాఖలు, తెలుంగు జాతుల ప్రాచీన బాంధవ్యములు తెలుంగుజాతి యొకదేవతా జాతియని నిరూపించుచు వారి పరిశోధనలను బహు విపులముగా 108 పుటలలో వ్రాసియున్నారు. వీనిని ఆంధ్రులు చదివి పరీశీలింపఁ దగియున్నది.

# SOME OPINIONS

## ON THE

## PREVIOUS VOLUMES OF SOUTH INDIAN RESEARCH

1. **Wood National College, Madanapalle.**—The Principal of this College approves of the Magazine and says it promises to be a good one.

2. **M. R. Ry. M. Venkatakrishnayya Avl.**—The Magazine is very promising and bids fair to become a very useful journal. I wish every success to you in your undertaking.

3. **The New India.**—We warmly welcome this most useful effort and heartily wish it success...All who are interested in Indian Research—and what educated man is not?—should subscribe to this brave journal and help it to continue

4. **The West Coast Reformer.**—The need for research in every direction - especially in Science—is very pressing. Research scholars are now-a-days increasing in India, and we have no doubt that a journal of this kind will serve an excellent purpose in publishing the valuable results of research and in giving an incentive to genius and patience.

5. **The Kristna Patrika.**—A new English magazine has been recently started with this name The Editor is Mr. T. Rajagopala Rao, B. A. His name is very widely known all over the Andhra territory on account of the many books he has written in the Telugu Language.. We hope that Mr. Rajagopala Rao will not in his Researches adopt the purely western methods, but also his own independent methods of work and thus achieve the end in view.

6. **The South Indian Mail.**—It is intended for the learned few, yet the treatment will be popular. We commend this monthly to all the learned few who are interested in Research work.

7. **M. R. Ry. M. S. Puttanna Avl., Retired Amildar.**—It is certainly a high class magazine. I find the articles very interesting and ediying. You deserve every credit for your enterprise and your original researches.

8. **M. R. Ry. Rao Bahadur M. Shama Rao Avl., Retired Inspector-General of Education, Mysore**—I am glad to say that you maintain a high standard of work in both the issues. The workers in this field are very limited, and it is bold of you to engage yourself in it. I hope you will receive sufficient public patronage to maintain the same high standard and to continue your work.

9. **The Principal of the American College, Madura.**—I think there is a large need for such a Magazine and the numbers thus far received give good promise.

10 **M. R. Ry. N. A. Narasimha Char Avl., Maharani's College, Mysore.**—The South Indian Research being unique, deserves support and encouragement by the Public and the Educational Department of Government.

11. **M. R. Ry. T, Narayana Sastri Garu.**—After going through the pages carefully I cannot but express admiration and heart-felt congratulations for the very interesting and original articles contained in your magazine—The Editorial and other learned and scholarly contributions deserve a wide notice by those who are interested in the regeneration of India.

12. **The Hon'ble Mr. Justice Sir John Woodroffe. Kt. C I. E.**—I am obliged to you for sendng me a copy of the October number of South Indian Research, which promises to be of interest.

13. **The Rev. F. Lionel Marler.**—I am glad to know that you are taking up suoh useful work and wish you all succees.

14. **Prof, J W. Johary, M.A., B.D.**—The November number you sent has good articles.

15. **F. W Thomas Esq , India Office London.**—"Allow me to tender to you my sincere thanks for your kindness in sending me the issues of your interesting new periodical 'South Indian Research. I have read them with pleasure. You are covering a wide sphere of knowledge and should appeal to considerable public."

16. **The Challenge. LONDON.**—It is right that Indians should take pride in the ancient achievements of their civilisation : and we see in the magazine many indications of the best Indian thought to that of the Christian West.

## Some Opinions on the Research Work of the Editor of the Journal

17. **The Hon'ble Sir Harold Stuart. K. C. S. I., K. C. I. E.**—I can only say that you seem to be treating the subject in great detail and no doubt with great skill.

18. **His Highness Sri Kerala Varma Valiya Koil Tamburan, C. S. I. of Travancore.**—From what I had been able to see of your work, I make bold to say that it will be as important and useful as that of Bishop Caldwell. I hope I shall soon have the happiness of seeing the completion of your monumental work.

19. **M. R. Ry. Sri Raja Raja Varma Koil Tamburan, now Retired Principal, Maharaja's College, Trivandrum and Examiner to the University of Madras &c.**—What the Rev. Caldwell has done to Dravidian Grammar you have done to Dravidian Prosody. Your disinterested labours in the matter, I hope, will be adequately appreciated by all the communities of the Dravidan race.

20. **M R. Ry. The late Rao Bahadur S. Mangesha Rao Avl., Chairman, Kanarese Board of Studies, &c., University of Madras.** I am very much struck with the powers of laborious research which are displayed therein. I had been led to believe that there are few English Educated Indians who cared to devote themselves to the study of Dravidian Languages and apply Western methods of research to them and am glad to find that there is one at least who has not only the capacity but also the inclination to do so, in spite of the want of encouragement in the present state of circumstances.

21. **The Madras Mail**—The South Indian Literary Research Institute deserves to be congratulattd on Mr. Rajagopala Rao's contribution to a branch of study of such a great interest.

22. **The Rev J. S Chandler, Late Chairman, Tamil Lexicon Committee.**—It is hoped that yourself and others will develop this and kindred subjects until the relations of the Dravidian Languages to one another and to Sanskrit are clearly brought out in all departments of Languages.

# ఆంధ్రసరస్వతీ గ్రంథమాల.

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| ఆంధ్రదేశపు చరిత్రము మొదటిభాగము | 2 | 0 | 0 |
| కనకవల్లి (16-11-1926) | 0 | 12 | 0 |
| వికట కవిత్వచింతామణి * | 0 | 8 | 0 |
| వివేకదీపిక (6-1-1925) * | 0 | 12 | 0 |
| కాళిదాసమహాకవి చమత్కారకథలు : | | | |
| మొదటిభాగము | 0 | 8 | 0 |
| తెనాలిరామలింగని హాస్యకథలు (6-1-1925) * | 0 | 8 | 0 |
| మణిభూషణము : మొదటిభాగము (1-11-1927) | 0 | 8 | 0 |
| ,, రెండవభాగము (1-11-1927) | 0 | 10 | 0 |
| లలిత (6-1-1925) | 1 | 4 | 0 |
| స్త్రీచరితకదంబము (9-4-1929) | 0 | 6 | 0 |
| కృష్ణరాయలకాలపు కథలు (అచ్చుపూవుడు) | 0 | 8 | 0 |
| ఆంధ్రదేశీయకథావళి నాల్గవభాగము(6-1-1925) | 0 | 8 | 0 |
| సీసపద్యములు : వానివలనఁ దెలియనగు ఛందో విషయములు | 0 | 4 | 0 |
| Life of Buddha (English) | 1 | 0 | 0 |
| Comparative Prosody of the Dravidian Langnages Part I. (Sutrams) | 0 | 4 | 0 |
| South Indian Research : available Numbers Each set | 5 | 0 | 0 |
| పిల్లలపద్యములు | 0 | 2 | 0 |
| శారదాపద్యవాచకములు. | | | |
| మొదటి వాచకము ( ) | 0 | 3 | 0 |

* () ఈకుండలిలోనివి పాఠశాలలకు అచ్చుపూవుచేసిన గెజటు తేదీలు.

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| రెండవ వాచ | 0 | 4 | 0 |
| మూఁడవ ,, ) * | 0 | 3 | 0 |
| నాలుగవ ,,* | 0 | 3 | 0 |
| అయిదవ ,, (అచ్చుపూవుడు) | 0 | 8 | 0 |
| ఆఱవ (డిటో) | 0 | 10 | 0 |
| ఏడవ ,, (9-4-1929) | 0 | 8 | 0 |

శారదావ్యాకరణములు.

| | | | |
|---|---|---|---|
| మొదటిభాగము 2, 3 తరగతులకు (అచ్చుపూవుడు) | 0 | 3 | 0 |
| రెండవ ,, 4, 5 ,, (డిటో) | 0 | 4 | 0 |
| మూఁడవ*,, మొదటి ఫారమునకు | 0 | 3 | 0 |
| నాలుగవ*,, రెండవ ,, | 0 | 4 | 0 |
| అయిదవ ,, మూఁడవ ,, (అచ్చుపూవుడు) | 0 | 5 | 0 |
| ఆఱవ* ,, 4, 5 ఫారములకు | 0 | 6 | 0 |
| ఏడవ* ,, | 0 | 8 | 0 |
| వివేక దీపిక (6-1-1925) | 0 | 12 | 0 |
| ఛందశ్శాస్త్రము (అచ్చుపూవుడు) | 0 | 6 | 0 |
| అలంకారశాస్త్రము* | 0 | 12 | 0 |
| విగ్రహారాధనము-శాస్త్రచర్చ | 0 | 4 | 0 |
| త్రివిక్రమవిలాసము* 0 8 0. చిత్రకవిత్వములు | 0 | 2 | 0 |
| సారస్వత వ్యాసములు-మొదటిభాగము | 0 | 8 | 0 |

పై గ్రంథములు వలయువారు :—

**తేకుమళ్ల రాజగోపాలరావు,** బి. ఏ., యల్. టి.

124, వెల్లారివీథి, పరశువాకము, వేపేరిపోస్టు, చెన్నపురి.

అని వ్రాయవలెను.

---

* ఈ గుర్తుకలవి అచ్చులో నున్నవి. పోస్టేజీ కొనువారిది.

